# శ్రీమహర్షి జీవితకథామృతము,

[ప్రాచీన భారతవర్ష మహర్షుల జీవితచరిత్రలు]

*

మొదటి భాగము

*

గ్రంథకర్త:

విద్వాన్

బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ.,

పి. ఆర్. కాలేజీ,

రామారావుపేట, కాకినాడ.

సర్వస్వామ్య సంకలితము.

1953

వెల రూ 1



అఘహారంబు 'శ్రీమహర్షి జీవితకథా
మృతము' సకలలోకహితముఁ గోరి
శాశ్వతముగఁ దెలుఁగుజగమున విలసిల్ల
బులుసు వేంకటేశ్వరులు రచించె.

# విషయసూచిక



## 3. అష్టావక్రమహర్షి



## 4. ఋష్యశృంగమహర్షి



## 5. కపిలమహర్షి

# నివేదనము



౧

శ్రీమద్భారతధరణీ
ప్రామాణిక ఋషివరేణ్య భవ్యోత్ఫుల్ల
శ్రీమానిత పాదాబ్జ ర
జోమాధురి చేరుఁగాక ! సుహృదంతరమున్.

౨

జ్ఞానుల్ భారతభాగ్యదేవతలు వి
జ్ఞానప్రవిష్టాత్ము లా
మానిశ్రేష్ఠులు వారిఁ గొల్చి మఱి జ
న్మం బింక లేకుండఁ ద
న్మానాదివ్యచరిత్రముల్ తడవి సం
ధానించి యీ సత్కృతిన్
జ్ఞానైకాత్ములు మద్గురూత్తములకున్
సద్భక్తి నర్పించెదన్.

౩

సాకారమహేశ్వరది
వ్యాకారుఁడు సద్గురుం డహా ! కృతిపతి త
ల్లోకేశుఁ జేరి కృతిసతి
చేకొనుతన్ భుక్తి ముక్తి చిరజీవినియై !



# అవతారిక

"నమ ఋషిభ్యో మంత్రకృద్భ్యో మంత్రపతిభ్యో మామామృషయో మంత్రకృతో మంత్రపతయః పరా దుర్మాహ మృషీ న్మంత్రకృతో మంత్రపతీన్పరాదాం."

"మంత్రద్రష్టలు మంత్రపతులు నగుమహర్షులకు నమస్కారము. వారు నన్ను విడువకుందురుగాక ! నేను వారిని విడువకుందునుగాక !"

—: కృష్ణయజుర్వేదము.

భారతదేశమున జన్మించిన ప్రతివ్యక్తికిని బరమ పావను లగుభారతమహర్షులు త్రికాలస్మరణీయులు; భుక్తి ముక్తిప్రదాతలు. ఆధ్యాత్మికౌన్నత్యమున, జ్ఞానప్రకాశమున, విజ్ఞానవిశేషమున, ధర్మప్రవచనమున, సర్వవిషయములందును భారతవర్షమునకే కాక యావత్ప్రపంచమునకును భారతమహర్షులే భిక్షాప్రదాతలు. విశ్వసంసృష్టికిని దత్సుస్థితికిని వారే కారణభూతులు. అట్టిమహర్షులసంతతిని జనించుటచేతనే భారతీయుఁడు విశిష్టసౌభాగ్యవిలసితుఁడై విఱ్ఱవీఁగుట కధికారము గడించియున్నాఁడు. ఆమహర్షుల పవిత్రాశీర్వచనబలముచేతనే నాఁటికిని నేఁటికిని నిఁక నేనాఁటికిని జ్ఞానతేజమును బ్రసరింపఁజేయుట కొక్క-భారతీయుఁడే యర్హుఁడైయున్నాఁడు. ప్రపంచగురుత్వము వహించుట కాతఁడే సమర్థుఁడు. అజ్ఞానాంధకారబంధుర మగుపాశ్చాత్య ప్రపంచము విజ్ఞానప్రదీపమునకు భారతమహర్షులనే యాశ్రయింపక తప్పదు.

అట్టిమహామహు లగుమహర్షుల జీవితవిశేషము లెఱుఁగుటకు వారి నాదర్శముగాఁ గైకొనుటకుఁ గుతూహలపడనిభారతీయుఁ డుండఁడు. కాని వారి జీవితవిశేషము లేకముఖముగా నొకేచోటఁ గాక వివిధ పురాణాంతర్గతములై జిజ్ఞాసువుల కలభ్యము లగుచున్నవి. మఱియు సమన్వయశక్తి వివిధపురాణ పరిశీలనాసామర్థ్యము లేని వారి కవి కొన్ని పరస్పరవిరుద్ధములుగను నర్థరహితములుగను దోఁచుచుండుటలో నాశ్చర్యము లేదు. వివిధ పురాణవిదు లగువిద్వద్వతంసు లీవైరుధ్యములను వైతొలఁగించి సమన్వయ మొనరించి యేకముఖముగా నింతవఱకేభాషలోను గానిరాకపోవుట తీఱనికొఱఁతయే యనక తప్పదు. ఈపరిస్థితిలో భగవత్ప్రేరితుఁడనై మహర్షులపైఁ గలభక్తితాత్పర్యము లూఁతగాఁ గొని బహుపురాణ ప్రామాణ్యము ననుసరించి యీగ్రంథమును సంధానించితిని.

పాశ్చాత్యవ్యామోహితు లగుభారతీయులకు మన పురాణములపైఁ గలుగుచున్న యవిశ్వాసమే తద్వ్యామోహదోషములలో మొట్టమొదటిది. దీనివలనఁ బురాణములు మిథ్య లనియు మహర్షులు మనకంటెఁ దక్కువవా రనియు నెంచుబుద్ధిమంతులు లేకపోలేదు. యథార్థమునకు విశ్వమనంతము. అయ్యు నిది -సమస్తభూతకోటులతోడను నిండిన యావత్ప్రపంచమును- పరమేశ్వరుని మహాసృష్టిలో నొక్కపాలే యనియు మిగిలిన మూఁడుపాళ్ళను దీని కతీతమైనయమృతసృష్టి యనియు ["పాదోస్యవిశ్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి'' ఛాందోగ్య. 111-12-6.]

ఛాందోగ్యోపనిషత్తు తెలుపుచున్నది. పాశ్చాత్యులది నేఁటి ప్రాచ్యులది పైయొక్క-పాదములోని లవలేశముతోడనే సంబంధించినదృష్టి. కాని, మహాత్ముల దట్టిది కాదు. అమృతసృష్టికిని విశ్వసృష్టికిని నడుమఁ గలమాయాయవనిక వారి దృష్టి కడ్డురాలేదు. వారితపోమహత్త్వమున నీమాయాయవనిక వైతొలఁగఁగనే వారికి దివ్యదృష్టి కలిగినది. ఇఁక వారి కగోచర మైన దేలోకమునను లేకపోయినది. కావుననే, సకలలోకరహస్యములు, పూర్వాపరజన్మపరంపరావివరణము, కర్మసంచయపరిమాణము మున్నగున వెల్ల వారికిఁ దెలిసిపోయినవి. అంతేకాదు, పైచతుష్పాదసృష్టికర్త యగు పరాత్పరుని- లీలాపురుషోత్తముని- త్రిపాద్విభూతియు వారి కవగాహనమై వా రంతవా రైరి. అందుచే వారిదృష్టి యగాధమై వెలుఁగొందినది వారిప్రతిభ యనిర్వచనీయమై వ్యాపించినది. వారిజ్ఞాన మపారమై మిన్నుముట్టినది. అట్టిమహాత్ములు చేసినచేఁతలు, పలికినపలుకులు, చూపినయాదర్శములు- గ్రహించుటమాట యటుండనిండు- అం దేశతసహస్రాంశ మైనను బెద్దలు స్పష్టముగఁ జెప్పినను దెలిసికొనలేని మనము వారిని విమర్శింపఁబూనుటకంటె నవివేక మొకఁడుండునా ?

ఇందలికథాభాగములలో నహల్యాసంక్రందనులు, తారాశశాంకులు, మమతాబృహస్పతులు మున్నగువారి గాథలలోని నైతికమతాధ్యాత్మిక రహస్యములను గడుంగడు జాగరూకతతో మనము గ్రహింపవలసియున్నది. బాహ్యదృష్టి కసభ్యములుగను నవినీతికరములుగను దోఁచు నాయాసంఘటన

లలో నగాధము లగుమానవజీవితనైతికవర్తన మన సత్య రహస్యములు నిబిడీకృతములై యుండును. అవి జీవితపరిణామ పద్ధతులు కాని యన్యములు కావు. అనఁగా బాహ్యదృష్టితోఁ జూచిన నవి జీవితధర్మములు. ఆంతరంగికదృష్టితోఁ జూచిన నవి యయదార్థములు; మిథ్య.

మానవపరిపూర్ణతకు సత్యాహింసశౌచదయాగుణము లకు నింద్రియనిగ్రహము, తపోబలము, నాత్మజయము మున్నగువాని కన్నిటికి మన ప్రాచీనభారతవర్ష మహర్షులే యెన్నియుగములకైన నాదర్శప్రాయులు. వారిజీవితోపదేశ ములు నిత్యమననపాత్రములు. ఐహికాముష్మికఫలప్రదములు. ఈదృష్టితో నేను రచించి ప్రకటించిన "శ్రీమహర్షి జీవిత కథా మృత" ప్రథమభాగము నిపుడు పరిష్కరించి నాలవ ముద్ర ణముఁ గావింపఁగంటిని. వివిధపత్రికలు బహుపండితులు నీగ్రం థముపైఁ గురియించినప్రశంసాదులకు వినయవినమితుఁడనై వారి యాదరమునకు నాకృతజ్ఞతఁ దెలుపుకొనుచున్నాను.

ఇట్లు, బుధజనవిధేయుఁడు,

బులుసు వేంకటేశ్వరులు.

---

# శ్రీ మహర్షి జీవిత కథామృతము : కొన్ని అభిప్రాయములు.



1. Pandit Bulusu Venkateswarlu B. A has added another scholarly contribution to Telugu Literature. 'Sri Maharshi Jivitha Kathamritamu' is a Life history of our most important sages. This is an unusual work never attempted by any author. Nowhere in our literature do we find any chronological accounts of the Seers. The author has taken great pains to collect the materials for the Seers' life histories from the various Srutis, Smritis and Puranas and to present the lives in an analytical form which makes very pleasant reading." *"The Indian Express"*

2. "The author has read almost all the Puranas and Upapuranas and collected his material for the biographies of the Ancient Seers of India. The book is bound to be very useful for students of Puranas and may be prescribed in the colleges for study not only because it deals with the ancient Hindu Culture but because it is also written very well." *"THE HINDU"*

3. "...నూటిగా సుందరముగా సుగ్రహముగాఁ గథారచన సాగినది. తేలికగాఁ దెలియఁదగిన. వివేకపరిబోధకమైన సద్గ్రంథసంచయములో మీగ్రంథములు చేర్చుకొంటిని..." శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

4. "...ఒక్కొక్క మహర్షినిగురించి యిది యొక సర్వస్వ మని చెప్పవచ్చును. పుట్టినది మొదలు గిట్టువఱకు నాయామహర్షుల వర్ణించినగ్రంథములు సంస్కృతభాషలోనే లేవు. ఇఁక దక్కినభాషలసంగతి చెప్పనవసరములేదు. ఈలోపమును గుర్తించి రచింపఁబడిన యీగ్రంథము నాంధ్రు లాదఱు ప్రాచీనవిజ్ఞానావబోధముకొఱకు చదువవలెను." —భారతి.

5 పండిత శ్రీ బులుసు వేంకటేశ్వరులు బి. ఏ., గారి "శ్రీ మహర్షి జీవిత కథామృతము"యొక్క ప్రథమభాగమును జదివి ముద మొందితిని. అందు ద్వాదశమహర్షులచరితములు గలవు. దానిభాష నిర్దుష్టమును మంజులమును

అది అనేక పుస్తకపఠనజ్ఞానమువలన వికచితము. మఱి పౌరాణికేతిహాసరూపమగుచు నాంధ్రసాహిత్యవృద్ధికరము. తద్ద్వితీయభాగప్రకటన మవశ్య మపేక్షణీయము.

జయపురము. శ్రీ విక్రమదేవ వర్మ.

6. "మనది మహర్షిసంప్రదాయం. సంస్కృతిలోను విజ్ఞానంలోను నాగరకతలోను మనభారతీయులను ఉచ్చస్థానానికి తెచ్చింది మనప్రాచీన మహర్షులే. భారతీయులమైన మనకు ప్రపంచంలో ఇప్పటికీ ఉన్న గౌరవప్రపత్తులు వారిదయాధర్మభిక్షమే...వారు మనపాలిటి దేవతామూర్తులు.

అటువంటి ఆదర్శమూర్తు లయినమహర్షుల జీవితకథలను ఇంతవరకూ ఎవరూ తలపెట్టనిరీతిని ప్రకటించిన బులుసు వేంకటేశ్వరులుగారి ప్రాచీన సంప్రదాయాభిమానాన్ని అభినందింపకుండ నుండలేము. వారు స్థూలంగా వినవచ్చేగాథలనే నమ్ముకోక ప్రామాణికంగా ఉండవలె ననేఉద్దేశంతో వేదాలనుంచీ ఇతిహాసాలనుంచీ ఇంకా ఇతరగ్రంథాలనుంచీ ఆయాఋషుల జీవితవిశేషాలను పోగుచేసి వాటిని ఒకసూత్రక్రమంగా పేర్చి అసంబద్ధాలకు ఆస్కారంలేకుండా రచించడం వారిఅభిమానాన్ని మఱింతవిస్పష్టం చేస్తుంది.

ఆయాఋషులనుగూర్చి ఏవేవో కొన్నికొన్ని విశేషాలను ప్రసంగవశాత్తు వినియుండడమే కాని వీరిని గురించిన సమగ్రచరిత్రలు చాలామందికి తెలిసేఉండవు. ఇటువంటివి ఇంతవరకూ తెలుగులో లేనిలోటును ఈగ్రంథం మూలాన తీర్చి వేంకటేశ్వరులుగారు తెలుగువారికి చాలా మేలు చేసినారు." A. I. R.

7. "నవనాగరకతపేరుతో భ్రష్టమైన మానవత్వానికి ఈ యుగంలో గాంధిమహాత్ముడు ఏవిధంగా పునరుత్తేజకుడయ్యేడో అంతకంటెకోటిరెట్లుగా ఆయాయుగాలలో మహర్షులు ఉదయించి ధర్మప్రతిపాదకు లయ్యారు. మహాత్మునికి జీవితమే ఒక ధర్మం. తపస్సే జీవితం. అట్టిమహాత్ముల పన్నెండుగురి మహాజీవితాల పరామర్శతో పునీతమై ఉంది ఈసంపుటి.

భాష గ్రాంథికమై గౌతమీతరంగాలవలె నడుస్తున్నది. వివిధారణ్యకారణ్యపురాణప్రచ్ఛన్నాలైన ఇట్టిజాతిరత్నాల నేరి సామాన్యప్రజల అనుభవాలకు అందిచ్చిన శ్రీ వెంకటేశ్వరులుగారు మరీమరీ అభినందనీయులు.

వీరు ఇంకా ఇట్టి ఉత్తమగ్రంథాలను శతాధికంగా వెలువరించి ఆంధ్రభాషా భారతినలంకరించాలని కోరుతున్నాము." రాష్ట్రసమాచారము.

8. "నిర్దుష్టమైన తేటతెనుగున వచనముగా నిది రచింపబడినది. ఆస్తికత్వము అజ్ఞానమునకు తావొసంగుచు నాస్తికత్వము నలుదెసల ముసురుకొనుచున్న ఈకాలమున ఈవిద్యాధికులీమహర్షి జీవితములను వ్రాసి ప్రచురించి మనప్రాచీనఋషివర్యుల తపోబలము చాటి సనాతనహిందూధర్మమునకు వెలలేని సేవ చేసినారు. ఇది ప్రతియింట నుండదగిన పుస్తకము." —త్రిలిఙ్గ

9. "మహాఋషులచరిత్రలను పురాణములనుండి సేకరించి సంగ్రహముగా సులభశైలిలో శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు భారతబాలబాలికలకు ఉపయుక్తంగా వ్రాసినారు. ఆత్మసంయమనము, నిరంతరాధ్యయనతపోనిరతి, సదానైతికజీవనవిధానము, మనోవాక్కాయపవిత్రత పెంపొంది స్వతంత్రభారతజాతి తిరిగి తనపూర్వపుఔన్నత్యాన్ని చుంబించగలుగుటకు ఈమహాఋషుల జీవితములపఠనము అత్యవసరము. ప్రతిపాఠశాలలోను ఇది పాఠ్యంగా ఉండాలి." —విజయవాణి.

10. "మీరచనారుచుల్ గమగమించిన యార్షకథాసుధాధునీ
పూరములోన నాయెడఁద ముంచి తలంచితి మీసదాశనా
చారవిచారమున్ మధురశైలివిహారము వేంకటేశమి
త్రా! రసపూరమైయుభయతారకమైనవి మీమహాకృతుల్"

—సత్యనారాయణశాస్త్రి.

11. "మీ మహర్షులజీవితము లక్ష్మదాదుల కొజ్జబంతులు. వానినాంధ్రులు ఆబాలగోపాలము పఠించి తమతమజన్మములు చరితార్థము లొనర్చుకొనఁజేసిన మీయుదారాశయము స్తవనీయము."

—వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

12. "మీకు గలఆర్షభక్తియే యీగ్రంథస్వరూపము. ఈమహర్షులచరిత్రలు సజ్జనస్తుతిపాత్రములు. జ్ఞానభిక్ష పెట్టిన మనపురాణమహర్షుల నెవరు విస్మరింపగలరు ? యుగయుగస్రావితమహర్షిజన మహాతపఃప్రవాహమే తృష్ణాజగత్తునకు తాపవారక మగును." —స్వామి కేశవతీర్థ.

13. "తమ గ్రంథము చూచితిని. ఆనందాతిశయము పట్టలేక వ్రాయుచున్నాను. తా మచ్చటచ్చట వ్రాసిన జ్ఞానవిజ్ఞానాది బోధకవిషయములు మహార్ఘములవి చాలా చక్కగా వ్రాసినారండీ. ఎంతో సంతోషమైనది. రచన చక్కనివిమర్శాపూర్వకముగా ఉన్నది. ఆధునికమైన ఇంగ్లీషువిద్యాదౌర్గన్యము పొందినను ఇంత చక్కగా ఈవిషయములు మీకు బోధపడి ఈ రీతిని వ్రాయగలుగుట నిజముగా అసాధ్యమే. ఇవి మీ సద్గురువులు, ఇష్టదేవుల ఆశీఃఫలము కాని వేరు కాదు." —వి. శ్రీరామమూర్తి.

14 "మీ 'శ్రీమహాభక్తవిజయకథామృతము' మా చిరంజీవులకుఁ బఠనీయగ్రంథము చేసి పాఠము చెప్పుచున్నాను. పేరున కనుగుణముగా నది కేవల మమృత మని చెప్పుటలో నత్యుక్తి లేదు. అధార్మికవిషయవిషనిబద్ధగ్రంథములు వెలువడి ధార్మికజనులయుసురుల గ్రసించుచున్నతరుణమున నిటువంటి యమృతసేచనమే లేకున్నచోఁ బునరుత్థానము జరుగనేరదనియే నావిశ్వాసము. మీభాషయు సలక్షణముగా సహృదయహృదయాహ్లాదకముగా నున్నది." —విద్వత్కవిశేఖర ఓలేటి సూర్యనారాయణశాస్త్రి.

15. "మీ గ్రంథము సాంతముగఁ జదివి యెంతయో సంతోషితస్వాంతుఁడనైతిని. పుణ్యశ్రవణకీర్తను లయిన యీపురాణపురుషులపావనచరిత్రము లనునమృతము నాస్వాదించు పాఠకులయు శ్రోతలయు మానసము లానందాబ్ధి నోలలాడుటయే కాక వారిలో నొకకొందరయిన వారివలె వర్తించుటకు యత్నింపకపోవరు గాన 'సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే' యని మమ్మటాచార్యుఁడు చెప్పిన కావ్యలక్షణము దీని కలవడియున్నది.

భారతీయపుణ్యకథల నేర్చి గ్రంథరూపమునఁ గూర్చుట మీప్రాచీనాచారతత్పరతను, భిన్నభిన్నములుగా నున్నవిషయములకు సామరస్యమును గనఁబఱచుట మీసమన్వయశక్తిని జెప్పక చెప్పుచున్నవి. పసిఁడికిఁ బరిమళ మబ్బినట్లు పరమపవిత్రమైన యితివృత్తమునకు సరళమైన మీరచన మఱింత వన్నె తెచ్చినది..." — ప్రయాగ వెంకటరామశాస్త్రి.

16. "...అపూర్వమైన యీగ్రంథము అపూర్వరమణీయముగా రచియించిన యీగ్రంథకర్త అభినందనీయుఁడు." — ఆంధ్రప్రతిభ.

17. "వేంకటేశ్వరులుగారు పండితకవులు, సనాతన మగు ఆర్యధర్మములం దభినివేశ మున్నవారు. మంత్రద్రష్టలు, ధర్మకర్తలు నగు ప్రాచీన మహర్షులజీవితచరిత్రములను వీరు రచించుట ఎంతేని తగియున్నది. వీరి యీ కృతి శ్లాఘాపాత్రము లోకోపకారము నగును. ఇందలి వచనరచన సలక్షణము ధారాళము."

— కృష్ణాపత్రిక.

18. "శ్రీ మహర్షి జీవితకథామృతము పరమపావన మగు మహర్షి జీవితము. ఏతత్కృతికర్త లాధునికాంధ్రసారస్వతముతో వ్యాసములో సమర్థకర్షకులు అనూచానముగు పండితవంశమున నుద్భవించిన సుధీమణులు కాఁగాఁ ప్రస్తుత గ్రంథకర్తృత్వమున కెంతయుఁ దగినవారు.

తపస్విజనులయారణ్యజీవితములు, ఏకాంతవాసములు, ప్రకృతి సహవాసములు మున్నగునవి స్మరణమాత్రములై హృదయవీథులలోఁ జొరఁబాఱినప్పుడు క్షణమైనఁ దన్మయత్వము నందని భారతీయవ్యక్తి లేఁ డనుట సత్యము. మహర్షులు సౌందర్యోపాసకులు, ఆనందమయులు, జీవితసర్వస్వము తపశ్చరణములరహస్యము లెఱిఁగి భగవదారాధనమునకై సమర్పించిన ధన్యమూర్తులు. తపోనియతిచే సాధింపరాని కార్యములు లేవని సృష్టిని దఱచిఱచి తద్రహస్యముల సంపూర్ణముగా స్వానుభవమునకుఁ దెచ్చుకొన్న పరిణతప్రతిభాసంపన్నులు.

విరాగమున రాగము, విషమున నమృతము చూఱలాడిన యీజడదారుల సమగ్రజీవితములు ప్రాచీనసంస్కృతాంధ్ర పురాణేతిహాసములలో దాగియుండి సామాన్యజిజ్ఞాసువులకు దవీయములైనవి. ఈలోపము గుర్తెఱింగి ఆయామునిచంద్రుల జీవితము లనేకగ్రంథములనుండి సేకరించి శ్రీమహర్షి జీవితకథామృత మనుమనోహర నామమున రచించి మహోపకృతి నొనరించిన శ్రీ వేంకటేశ్వరులుగారిపట్ల నాంధ్రు లెల్లరుఁ గృతజ్ఞులు. ఇట్టిరచన లదృష్టశ్రుతపూర్వములు.

ఏకపత్నీవ్రతములో బ్రహ్మచర్యదీక్షలో తపోనియతిలో మహర్షులశక్తిసామర్థ్యములు మనయూహల కందక నిల్చినవి. ప్రాచీనమహర్షులు మనకంటె మహారసికులు.

ఇందలి కథాశైలి పురాతనసంప్రదాయముల నత్యున్నతముగా ననుసరించి సరళముగఁ బ్రవహించినది. వేదయోగసౌరభము శ్రీవేంకటేశ్వర హృదయమున నిండార వ్యాపించినది.''—బెన్నూరి శ్రీనివాసమూర్తి 'త్రిలిఙ్గ'లో

19. "ఇందలి మహాత్ముల జీవితచరిత్రలు చదువునపుడు పాఠకుల కనివార్య మగుమానసికపరిణామము కలుగుననుట నిశ్చయము. సకలపురాణసారమగునీగ్రంథరాజము సరసపదభూయిష్ఠము. గ్రంథకర్త యనుసరించిన ప్రాచీనార్వాచీనకవితాసంప్రదాయ సమ్మేళనమే ఏతద్రచనాప్రావీణ్యమును వేనోళ్ళఁజాటుచున్నది. సరళగంభీరశైలికిఁ దోడగుద్రాక్షాపాకము పసిపాపలకేనియు చిత్తసంస్కారము గావింప సమర్థమై యున్నది."

—శ్రీ చిరంతనానందస్వామి, 'రామకృష్ణప్రభ'లో

20. "శ్రీబులుసు వేంకటేశ్వరులుగారు మహాపురుషులచరిత్రలు మంచి భక్తిజ్ఞానదాయకములుగా వ్రాయనేర్చిన నేర్పరు లగుట ఆంధ్రులకు చిరపరిచితులే. మహాఋషుల జీవితఘట్టాన్ని అక్కడక్కడ చెదరుగా చదవడమే కాని అవి మనకొకగ్రంథరూపంగా లేకపోయే యన్నకొరత వీరమోఘరగా తీర్చేరు. మనోహరమైన గ్రాంథికభాష యిందు వాడేరు." —ఆంధ్రమహిళ.



ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీ మహర్షి జీవిత కథామృతము

మొదటిభాగము

## అగస్త్యమహర్షి

స్తుతి

“ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబుఁ
గడదాఁక నెఱిఁగిన కఱితలాని
వాతాపిదైత్యు నిల్వలునితోఁ గూడంగ
జఠరాగ్ని వేల్చినసవనకర్తఁ
గోపించి నహుషునిఁ గుంభినసంబుగా
హ్రాంకార మిచ్చినయుగ్రతేజు
వానకాలమునాఁడు వందువట్టిననీటి
కాలుష్య ముడివెడుకతకఫలము:
బాండుభసితత్రిపుండ్రాంకఫాలభాగు
భద్రరుద్రాక్షమాలికాభరితవక్షు”
వింధ్యగర్వాపహారి నాపీతజలధి
నయ్యగస్త్యమహర్షి నే నభినుతింతు.

[శ్రీకాశీఖండము ౨. ౧౬౦]

శ్రీమంత మగు భరతఖండము పుణ్యతపోనిలయము. కావుననే పరమ పవిత్రము. ఇందు జన్మించి నిజతపోమహిమచే సృష్టిస్థితిలయకారు లైనవారే మహర్షులు. వీరు విశ్వసంరక్షణమునకై త్రిమూర్తులకృత్యములు నిర్వహింప సమర్థులగుటే కాక త్రిమూర్తులకు నార్తసమయముల నుద్ధారకులు సంరక్షకులు నైనపరాత్పరులు. ఇట్టి మహామహులం గనియుండుటచేతనే భారతవర్ష మార్షభారత మనియు నార్యావర్త మనియు విఖ్యాతి గడించెను.

ఇట్టి పరమపవిత్రవర్తనులు బ్రహ్మవిద్యానవద్యులు పరమేశ్వరకల్పులు నగు భారతబ్రహ్మర్షులలో నగస్త్యమహర్షి యగ్రేసరుండు. ఈతండు వసిష్ఠమహర్షికి సహజన్ముండు, త్రికాలవేది, భక్తిజ్ఞానయోగవిరాగనిధి, గృహస్థరత్నము.

## అగస్త్యుని జన్మకథ.

ఈ పరమపురుషునిజన్మకథ కడుం జిత్రమైనది. మహాపురుషులయు మహానదులయు జన్మగాథలు చిత్రాతిచిత్రములేకదా! తొల్లి యొకనాండు మిత్రావరుణు లిరువురుం గలిసి సృష్టికర్త యగుపితామహుని దర్శించి నిజస్థానముల కేంగుచుండిరి. వారికి దారిలో జగదేకసుందరి యగునూర్వశి యెదురాయెను. వారిరువుర కొక్కసారిగా నామెపై మోహ ముదయించెను. లోకపాలు రగువా రిరువురును బ్రహ్మర్షుల సృజింపవలసినవారై యీశ్వరప్రేరణమున నిజతేజోంశవిలసితవీర్యములం బరమపవిత్రపర్ణముల నిక్షేపించి వానిని బూర్ణాంబు భాండమున నుంచి సంరక్షింప నూర్వశి కాజ్ఞాపించి తమదారిం బోయిరి. ఊర్వశియు నట్లు గాపాడం గాల

క్రమమున నందుండియే యగస్త్యవసిష్ఠు లుద్భవించిరి. ఈ కారణముచేతనే వీ రిరువురకును 'గలశజు' లనియుఁ 'గుంభ సంభవు' లనియు 'నౌర్వశేయులు,' 'మిత్రావరుణపుత్త్రు' లనియుఁ బేరువచ్చెను. *

## అగస్త్యుని బాల్యము

ఈరీతి జన్మించినయగస్త్యుఁడు క్రమముగా శుక్లపక్ష చంద్రునివలె దేదీప్యమానుఁ డగుచుండెను. ఆతఁడు బాల్యము నుండియు మహానిష్ఠాగరిష్ఠుఁడై బ్రహ్మచర్యము చేయుచు నిరుపమానతపస్సంపదచే విరాజిలఁ జొచ్చెను. బాల్యముననే యాతని కుపనయనాదిసంస్కారములను, బ్రణవపంచాక్షరీ మంత్రోపదేశమును దేవతలే యొనరించిరి. ఆతఁడు పిదప నిష్ఠాశిక్ష యమున బ్రహ్మచర్యపాలనము నుగ్రతపస్సు చేయుచుండెను. అందు నిరాహారుఁడు, నిర్జితేంద్రియుఁడు, నిర్ధూతకల్మషుఁడునై నానాఁటి కాతఁడు దివ్యతేజస్వి యయ్యెను.

## అగస్త్యునికిఁ బితృదేవతలయాదేశము

ఇట్లుండ నొకనాఁ డరణ్యములో సంచరించుచు నొక సల్లకీవృక్షశాఖ నధోముఖులై వ్రేలుచున్నకొందఱు మునీ శ్వరులం జూచి యగస్త్యుఁడు "మహాత్ములారా! ఇపుడు మీ రీదురవస్థలో నుండుటకుఁ గారణ మేమి? ఇంతకు మీ రెవరో యానతిం" డని వేఁడుకొనెను. అంత వారు విస్పష్టముగా "నాయనా! మే మనుష్యులము గాము, పితృగణదేవతలము. నీవు పుత్త్రులను బౌత్త్రులను గాంచి తప్పక మా కూర్ధ్వలోకముల

---

* భారతము-ఆరణ్యపర్వము. విష్ణుపురాణము.

నొసంగఁజాలుదు వని చిరకాలము నుండి కొండంతయాశతో మున్నాము. కాని,నీ వట్లు చేయక బ్రహ్మచర్యాశ్రమముననే యుండుట మా కిఁక భరింపరాని వేదనకు నిట్టిదుస్థితికిని గారణ మైనది. కావున,నీవు మాకోరికఁ జెల్లించి యూర్ధ్వలోకములఁ బ్రసాదింపవే” యని వేఁడుకొనిరి. ఈమాటలు విన్నయగస్త్యుఁడును దనపితరులదుస్థితికి జాలిగొని“మహాత్ములారా! పితృదేవతలారా! మీ కోరికసిద్ధింపఁజేసెదను. నమ్ముఁడు. కులమున నెప్పటికైన నొక యుత్తముఁడు జనించి యూర్ధ్వలోకగతు లొసంగు నని యెదురుచూచుపితరులఋణముఁ దీర్పని యావంశజునిజన్మ మేల ? కాల్పనా ? కావున, మీపం పొనర్చెద” నని యగస్త్యుఁడు వారియాశీస్సులఁ గొని యాశ్రమమున కేఁగెను.

## అగస్త్యుని వివాహము

పితృదేవతలయాదేశము శిరసావహింపఁ దీవ్రముగఁ గోరినయగస్త్యుఁడు తనతపశ్శక్తిచేఁ బుత్రికామ్యు డగువిదర్భరాజునకు జక్కని చుక్కయగు నొకకూఁతురు కలుగునట్లు వరమిచ్చెను. ఈవరమువలన విదర్భరాజునకుఁ గూఁతురు కలిగెను.

ఆమె లోపాముద్ర యనునామమునఁ దలిదండ్రుల గారాపుబిడ్డయై జలమున విలసిల్లునలినివలె, వినీతునం దొప్పు లక్ష్మిని బోలి, యుద్యుక్తునం దొప్పువిద్యరీతి దినదినవర్ధమానయై, రూపగుణసౌజన్యముల నప్రతిమానముగా ననురూపకన్యాకాశతమున నొప్పుచుండ నొకనాఁ డగస్త్యమహర్షి విదర్భరాజుకడ కేతెంచెను. ఉచితమర్యాదల నందిన పిదప లోపాముద్రను దన కిచ్చి వివాహము చేయు మని

యగస్త్యుఁ డాతని నడిగెను. అందుల కయ్యో!

"నారలుంగట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారముసం గృశుండయిన బ్రాహ్మణుఁడీలలితాంగిఁ బెండ్లియై
నారలుంగట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారము దాల్చియుండుమని పంపక మిన్నకయుండ నేర్చునే

ఎఱిఁగి యెఱిఁగి దీని నెట్లుఁగ నగు భోగ
యోగ్యయైనయది పయోజనేత్ర
యానినాఁడు శాపమిచ్చుఁగా కీపుని
యేల వైచు నింక నెట్టులొక్కొ ?

(భార. అర. ౨. ౩౨౬, ౩౨౭)

ముని విదర్భపరేంద్రుఁడు సంశయ భీతిచిత్తుఁడై యుండఁగా లోపాముద్ర వచ్చి యామునివరుని వివాహమగుటయే తన యభీప్సితమని తెలిపెను. అందులకు విదర్భధారుణీపతి యెంతయు సంతసిల్లి విధ్యుక్తముగా లోపాముద్రాగస్త్యమహర్షులవివాహ మతివైభవముతో జరిపెను. ఈవివాహప్రదేశము నాఁటినుండి "సిద్ధతీర్థ" మను పేర మహాతీర్థప్రదేశముగా లోకప్రసిద్ధి గాంచెను. పిమ్మట నగస్త్యుఁడు లోపాముద్రను వల్కలాజినధారిణిఁ జేసి తోడ్కొనిపోయి గంగాద్వారమున నొక్కయాశ్రమమును నిర్మించుకొని గార్హస్థ్యధర్మములు నిర్వర్తించుచుఁ దపోవృత్తి నుండెను.

ఆజన్మసిద్ధులై యావిర్భవించియు మనమహర్షులు లోకసంగ్రహమునకును సాధుసజ్జనుల కనువర్తనసాధనము లగునాదర్శజీవితములు చూపుటకును యథావిధిగా బ్రహ్మ

చర్యాద్యాశ్రమములు నిర్వర్తించుచునే నిరంతరదైవచింతన మున నెగడెడివారు. అట్లే యగస్త్యుఁడు విశ్వశ్రేయమునకే వివాహమాడి కాలక్రమమున సహధర్మచారిణి సతీతిలకము నగులోపాముద్రయందుఁ బుత్రులఁ బడసి పితరులఋణమును దనధర్మమును నిర్వర్తింపఁ దలఁచెను.

ఈకారణమున నొకనాఁ డగస్త్యుఁడు లోపాముద్రా సంగమ మపేక్షింప నామె తనకు సమస్తాభరణములు సున్నిత వస్త్రములు కావలయు నని యాతనిఁ గోరెను. అగస్త్యుఁ డాపనికై తపోధనమును వ్యయింప నొల్లక శ్రుతర్వుఁ డనురాజుకడ కేఁగి యాతనికి సరిపోఁగా నేమేని ధన మున్నఁ దన కిమ్మని కోరెను. ఆతనికడ నాతనికి సరిపోవుధనమే యుండుటచే నిరువురును గలిసి బ్రధ్నశ్వుఁకడ కేఁగి యర్థించిరి. ఆతనికడ నాతనికి సరిపడుధనమే యుండుటచే ముప్వురును గలిసి త్రసదస్యుఁ డను రాజుకడ కరుదెంచి యర్థించిరి ఆతఁడు నట్టిస్థితియందే యుండ నల్వురుఁ గలిసి యిల్వలుఁ డనురాక్షసునికడ కేతెంచిరి.

## వాతాపిల్వలమర్దనము

మణిమతీపురాధిపతి యగునిల్వలుఁడు విఖ్యాతబలుఁడు. ఆతనితమ్ముఁడు వాతాపి కామరూపి. ఒకనాఁ డిల్వలుఁ డుత్తమబ్రాహ్మణు నొకనిఁ దనకు సకలకామసిద్ధికం మగు మంత్ర ముపదేశింపు మని కోరి విఫలుఁడై తనతమ్ముని మేఁకను జేసి వధించి యామాంస మాబ్రాహ్మణునకు భోజనమునఁ బెట్టి భోజనానంతరము తమ్మునిఁ బిలిచెను. వాతాపి యాబ్రాహ్మణునికడుపు వ్రచ్చి బయటకు వచ్చెను. ఆద్విజుఁడు వెంటనే మరణించెను. ఈరీతి నది మొదలు

తనకడ కతిథులుగా వచ్చు బ్రాహ్మణులఁ జంపుట యిల్వలు నకుఁ బరిపాటి యాయెను.

నాఁ డగస్త్యుఁ డాముగ్గురురాజులతో నిల్వలున కతిథియాయెను. యథాపూర్వముగా నిల్వలుఁడు వాతాపిని మేఁకను జేసి చంపి వండి యామాంసము నగస్త్యునకుఁ బెట్టించెను. ఆముగ్గురురాజులు నీవిషయ మగస్త్యునకుఁ జెప్పినను వినక యాతఁడు నాఁడు కంఠముదాఁక భుజించెను. ఇల్వలుఁడును దా నెప్పటియట్లె తమ్ముని బిల్చి లేతెంగి యగస్త్యుఁడు "జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణ" మ్మని కడుపుఁ దడవికొనుచు గఱ్ఱుని త్రేన్చిన వాతాపి జీర్ణమైపోయెను. ఇల్వలుఁడు నాశ్చర్య మంది కుక్కినపేనువలె మాటాడక వచ్చినపని యడిగి యా రాజుల కపరిమితధనమును బసిఁడియు నిచ్చి యగస్త్యునకు విరావ సురావము లనుగుఱ్ఱములఁ బూన్చిన హేమమయరథము, ఇరువదివేల పాడియావులు, ఇరువదివేల గద్దెలబంగారము నిచ్చెను. ఆధనసంపదలతో, అగస్త్యునితో రాజులతో నిండిన రథమును గుఱ్ఱములు తాల్చి యగస్త్యాశ్రమమునకుఁ దత్క్షణమే వేగముగాఁ బోయి చేరెను. రాజన్యు లగస్త్యుని వీడ్కొని చనిరి.

వాతాపి నట్లును బ్రాహ్మణహంత యగునిల్వలుని దరువాతను నగస్త్యుఁడు రూపుమాపి 'వాతాపీల్వలమర్దనుఁ' డను నామమును ధరించెను. అగస్త్యుఁ డాధనముతో లోపాముద్ర కోరిన సమస్తాభరణములు నొసఁగి యనేకరమ్యవస్త్రములిచ్చి పిమ్మటఁ బదుగురఁ బోలు సుతులు నూర్గురు కావలెనా? నూర్గురఁ బోలుసుతులు పదిమంది కావలెనా? లేక వేవురకు

సరిపడు నొక్క కుమారుఁడు గావలెనా? యని సాదరముతో భార్య నడిగెను. ఆమె వేవురఁ బోలెడువాని నొక్కనిఁ గోరు కొనెను. ఆమెకోరిక ననుగ్రహించి యగస్త్యుఁడు తపో వ్రతమున నుండెను. పిమ్మట లోపాముద్ర గర్భవతి కాఁగాఁ గాలక్రమమున నామెకు ననవద్యుఁ డగుదృఢస్యుఁ డను కుమారుఁ డుదయించెను. దృఢస్యుఁడు పెరిగి పెద్దవాఁడైన పిదప నాతనికిఁ దేజస్వి యను కుమారుఁడు పుట్టెను. ఈప్రకార మగస్త్యుఁడు పుత్త్రపౌత్త్రవంతుఁడై పితరులకుఁ బుణ్యలోక గతుల నొనగూర్చెను. *

## అగస్త్యుఁడు కవేరకన్యను వివాహమగుట

తొల్లి యొకనాఁడు బ్రహ్మదేవుఁ డగస్త్యాశ్రమమున కేతెంచెను. అగస్త్యుఁడు శ్రద్ధాభక్తులతో విరించి కర్ఘ్య పాద్యాదు లొసంగి సుఖాసీనుఁ జేసి "చతురాననా! మహా తపఃప్రభావమున నైన నలభ్యదర్శనుఁడ వగునీవు నాయింటి కేతెంచుట నాయదృష్టము. మహాత్ము లూరక రారు గదా! ఇట్లు నీవు నాపైఁ గటాక్షము చూపినందులకు సదా కృతజ్ఞుఁడను.ఏమి యానతి ?" యని వినయవిధేయతలతో బ్రహ్మ నడిగెను. సృష్టికర్త "మహనీయతపోనిధీ! నీవంటి యు త్తమమహర్షుల మూలముననే కదా విశ్వస్థితి సాధ్యమైనది! మహర్షికల్పు లనవరతము మాకుఁ బూజ్యులు, స్మరణీయులుఁ గదా! ఇఁక నా వచ్చినపని యొకటి కలదు. పూర్వ మొక ప్పుడు కవేరుఁ డనురాజర్షి పరమశివునిఁగూర్చి మహాతపస్సు

* భారతము, అరణ్యపర్వము.

చేయఁగా నాతఁడు ప్రత్యక్షమై కవేరుని కోరిక యడిగెను. కవేరుఁడు భయభక్తితాత్పర్యములతోఁ దనకు ముక్తి నిమ్మని కోరెను. ఈశ్వరుఁ డాలోచించి యాపని విరించి సిద్ధింపఁ జేయును గాన నాతనిఁగూర్చి తపింపు మని చెప్పి వెడలిపోయెను. కవేరుఁ డానందముతో నన్నుం గుఱించి ఘోర తపస్సు చేయఁగా నేను బ్రత్యక్షమై యాతని వాంఛాసంసిద్ధికి నాకుమారి యగు విష్ణుమాయ యాతనికిఁ గూఁతురై జన్మించు నని చెప్పి పోతిని. తరువాతఁ గవేరునకుఁ బుత్త్రిక జన్మించినది. ఆమె యిపుడు తండ్రికి ముక్తి నొసఁగుటకై యుగ్ర తపస్సు చేయుచున్నది. ఆమెయొక్కయంశనే నీభార్య యగు లోపాముద్రగాఁ దొల్లి నేను సృష్టించితిని. లోపాముద్రను నీవు వివాహమాడితివి. ఈకవేరకన్యను సైతము నీవు వివాహ మాడవలయును. దానివలన నీకు నామెకును శ్రేయమగు" నని వేఁడుకొనెను. అగస్త్యుఁడు "చతుర్ముఖా! నీ వింతగాఁ జెప్పవలయునా? నీయాజ్ఞ నాకవశ్యానుష్ఠేయముకదా!" యని విరించిని బంపివైచి యగస్త్యుఁడు కవేరకన్యాన్వేషణమునకై బయలుదేఱెను.

తపఃకార్శ్యముచే దివ్యసుందరముగ నొప్పు కవేరకన్య నగస్త్యుఁడు సమీపింప నామె యగస్త్యునిపాదారవిందము లపైఁ బడి, "మహాత్మా! త్రిలోకపూజ్యు లగు తమదివ్య దర్శనమునఁ బునీత నైతిని. తమకృపాకటాక్షములఁ బఱపి నాయాతిథ్య మంగీకరించి ననుఁ గృతార్థను జేయువే!" యని వేఁడుకొనియెను. అగస్త్యుఁడు "తరుణీమణీ! నే నేతత్కార్యార్థమే నిను వలచి వచ్చియున్నాను. కాన నన్నుఁ బరిణయ

మాడు" మని యడిగెను. కవేరకన్య "తేజోనిధీ ! నాకంతటి భాగ్యమే కలిగినఁ గావలసినదేమి ! ఇంతకును దాము లోపాముద్రాపరిపూర్ణపార్శ్వులుగదా ! ఇఁక నా కెటఁ దావున్నది ? అదియునుగాక నే నసతికాలముననే నదినై పోవుచున్నాను. నావలనఁ దమ కెట్టిసుఖము గల్గు?"నని యడిగెను. అగస్త్యుఁడు "కాంతామణీ ! లోపాముద్ర నీయంశముచేతనే జనించినది. కావున నందు సంశయింపఁ బనిలేదు. ఇఁక నీవు నదివైనను నీపత్నీత్వము నా కాకాంక్షితమే" యని బదులు చెప్పెను. కవేరతనయ యనుమతించి యగస్త్యుని వివాహమైనవెంటనే నది యయ్యెను. అగస్త్యుఁ డామెను దనకమండలువున నుంచుకొనెను. ఈ కవేరతనయయే తరువాతఁ గొంతకాలమునకు వింధ్యగర్వాపహారణార్థ మగస్త్యుఁడు పోవుచుఁ దనకమండలువును శిష్యులఁ గొనితెమ్మని చెప్పి పోఁగా సహ్యపర్వతసమీపమున నగస్త్యుఁడు లేకుండుటఁ జూచి తనకార్యము జ్ఞప్తికి రాఁగా నామె నదియై నేలపైఁ బడి ప్రవహించి పోయెను. ఈనదియేఁ కావేరీనది ఈనదియందు స్నానముచేయుటతోడనే కవేరరాజర్షి సద్యోముక్తి నందెను. *

## అగస్త్యుఁడు సముద్రోదకము నాపోశనించుట

కృతయుగమున నొకప్పుడు వృత్రుఁ డనురాక్షసుఁడు కాలకేయాదులలోఁ గలిసి యింద్రుని జయించి వేల్పుల బాధించుచుండఁగా వారు బ్రహ్మకడ కేఁగి మొఱవెట్టుకొనిరి. బ్రహ్మవారితో దధీచికడ కేఁగి యాతనియస్థులఁ గొని వృత్ర

* స్కాందపురాణము. తులా కావేరీ మాహాత్మ్యము.

నిందు్రఁడు జయించు నని తెల్పఁగా సరస్వతీతీరమున కరిగి వారు దధీచిని బ్రార్థించిరి. దధీచి దేవహితార్థమై ప్రాణములు విడువఁగా నాతనియస్థులను దేవత లాయుధములుగా గ్రహించిరి. త్వష్ట యిచ్చిన వజ్రాయుధముచే నిందు్రఁడు వృత్రునిఁ జంపెను. కాని, కాలకేయగణములు పగ లెల్ల సముద్రములో దాఁగి రాత్రివేళల బ్రాహ్మణులఁ జంపివేయఁ దొడఁగిరి. విద్యాతపోయుక్తులై ధర్మచరితు లైనఋషులఁ జంపినఁగాని జగమున కపాయము వాటిల్ల దని కాలకేయాదులు వసిష్ఠాశ్రమమున నూటన్నెంబదియేగ్గురను, చ్యవనాశ్రమమున నూర్వురను, భరద్వాజాశ్రమమున నిరువదుండ్రను బ్రహ్మవిదుల భక్షించిరి. ఇట్లుపద్రవముఁ గొనితెచ్చు కాలకేయుల నెట్లు వధించుటో తెలియక యింద్రియమార్తి వరుణకుబేరాదు లెల్లరును విష్ణుమూర్తిని బ్రార్థించిరి విష్ణుమూర్తి వారిమొఱ లాలించి యగస్త్యమహర్షి యాసముద్ర జలములఁ బానము చేయఁగలఁ డనియు నప్పుడు రాక్షసులు బయలుపడఁగా వారిని జంపుఁ డనియుఁ జెప్పి పంపివేసెను. వెంటనే యమరు లగస్త్యుపాలి కేఁగి స్తుతించి తమవచ్చిన పని నెఱిఁగించిరి. అగస్త్యుఁడును దేవహితార్థమై యమరగణముఁ గూడి మహర్షి యక్షగణములు తన్ననుసరింప వచ్చి సముద్రము నొక్కసారిగా నాపోశనించెను. త్రిజగజ్జను లచ్చెరువందిరి. దేవయక్షగణము లభినందించెను. అంతఁ గాలకేయగణములు బయలుపడఁగానే దేవతలు విజృంభించి యసురులనిశ్శేషము చేసి "పీతసముద్రుఁ" డని యగస్త్యు నెంతయు గీర్తించిరి. పిదప వా రాతనిని

"మునినాథ ! నీయనుగ్రహ
మున నిగ్రహ ముడిగె నఖిల భువనంబుల కి
వ్వనధిఁ బయః పూర్ణముగా
నొనరింపుము నీవ కాని యొరు లోప రిలన్"

ఇది యనేకజంతువుల కాశ్రయము. కాన,రిక్తమై యుండరాదు.తిరిగి పూరింపు మని వేఁడుకొనిరి. కాని,అగస్త్యుఁడు "దేవతలారా! ఈసముద్రజల మంతయు నాకిదివఱకే జీర్ణమయి పోయినది. నే నిపుడు పూరింపఁజాలను. పొం"డని తనదారిం బోయెను. తరువాత భగీరథప్రయత్నమున సముద్రము పూరిత మయ్యెను. *

## అగస్త్యుఁడు శ్రీరామున కుపకరించుట

అగస్త్యుఁ డావిధ్యాటవి ఘోరతపోనియమమును బాటింప దండకావనమధ్యమున నొకయాశ్రమము నిర్మించుకొని యం దుండెను. ఆసమయముననే శ్రీరామచంద్రుఁ డరణ్యా వాసముచేయుచు శరభంగుఁడు మొదలగు మున్నగుమహర్షుల దర్శించి సీతాలక్ష్మణసమేతుఁడై వారిచేఁ బూజింపఁబడి సుతీక్ష్ణమునీశ్వరు నాశ్రమమున కేఁగెను. అచటఁ గొంతకాల ముండి తరువాత శ్రీరాముఁ డగస్త్యాశ్రమమునకు సతీసహోదరు లతో నేతెంచెను. అగస్త్యమహర్షి శ్రీరామలక్ష్మణులఁ గౌఁగిటఁ జేర్చి మూర్ధాఘ్రాణ మొనరించి యాశీర్వదించి, పురోభాగమున నున్నసీతామహాసాధ్వి నభినందించి మువ్వు

* "ఇది స్కాందపురాణము, భారతారణ్యపర్వములఁ గలగాథ. కాని నిశ్శేష పీతోజ్ఝితసింధురాజః అని రఘువంశమున కాళిదాసు అగస్త్యుఁడే తిరిగి పూరించెనని చెప్పెను."

రకు నతిథిసత్కారములఁ జేసి యానందించెను. అప్పటి కగస్త్యుఁడు వానప్రస్థాశ్రమమున నుండుటచేఁ దదుచితముగా శ్రీరామాదులఁ బూజించి శ్రీరామునకు దివ్యమైన ఖడ్గయుగ్మము, వైష్ణవ మైన విల్లు, అమోఘబాణములు, అక్షయమైనఅమ్ములపొది, నిచ్చి గౌతమీతీరమునఁ గల పంచవటియందాశ్రమము నిర్మించుకొనియుండుట శ్రేయస్కరమని సూచించెను. సీతాలక్ష్మణసహితుఁడగు శ్రీరాముఁ డగస్త్యు ననేక వందనములతో స్తుతించి ముందునకుఁ బయనమై పోయెను.

తరువాతఁ గొంతకాలమునకు శ్రీరామరావణులఘోర యుద్ధకాలమున రాముఁడు రావణతీవ్రబాణములచే నొంపఁబడి భావికర్తవ్యము మఱచి యున్నతరుణమున నగస్త్యుఁడు శ్రీరామునిసన్నిధి కేతెంచి శ్రీరాముఁడు విష్ణుమూర్తి యగుట జ్ఞప్తికిఁ దెచ్చి యాతనియనంతప్రభావమును గీర్తించెను. పిమ్మట శ్రీరామునకు నిఖిలజయప్రదమును నిఖిలైశ్వర్యమంగళసౌఖ్యావహమును సకలదురితదూరీకరణచణము నగునాదిత్యహృదయ మనుపుణ్యమహాస్తవమును సాదరముగా నుపదేశించి శ్రీరామున కుత్సాహము విజృంభింపఁ జేసెను.

"నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః ।
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్న మోఽస్తు తే॥
నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః ।
జ్యోతిర్గణానాంపతయే దినాధిపతయే నమః॥
జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః ।
నమోనమస్సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః॥

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమోనమః ।
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమోనమః॥

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయవపుషే నమః ।
తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః॥"

ఈ ఆదిత్యహృదయపారాయణముచే శ్రీరాముఁ డచిర కాలముననే శత్రునిర్మూలనమున విజయలక్ష్మి నందఁగల్గెను.

శ్రీరాముఁడు రావణుని జయించినపిమ్మట నయోధ్యా పురమునఁ బట్టాభిషిక్తుఁ డైనతఱిఁ గణ్వాదిమహర్షులతో నగస్త్యమహర్షియు శ్రీరాముని జూడ నేఁగి యాతని సంస్తుతించిన, శ్రీరాముఁడు రావణాదులజననవిజయాది వృత్తాంతముల నడుగఁగా నగస్త్యుఁ డాతని కెల్ల వినిపించెను. మఱి యొకప్పుడు సీతాదేవి వాల్మీక్యాశ్రమమునఁ గుశలవులఁ గన్న పిదపఁ బుష్పకవిమానారూఢుఁడై పోవుచు శ్రీరాముఁ డగస్త్యాశ్రమమున కేతెంచెను. అగస్త్యమహర్షి తాను జేయుచున్న యాగమును బూర్తిచేసి శ్రీరాముని బూజించి యొకవిచిత్రరత్నమయదివ్యవిభూషణము నొసఁగఁగా శ్రీరాముఁ డది యెట్లు వచ్చె ననియు దానిని దాను గ్రహింపవచ్చునా యనియు నగస్త్యు నడిగెను. అగస్త్యుఁడు శ్వేతుఁ డను రాజర్షి వృత్తాంతముఁ జెప్పి యాతఁడే యాభూషణమును దన కిచ్చె ననియు నృపాలున కెవ్వరే మిచ్చినను గైకొనవచ్చు నని యుఁ జెప్పెను. శ్రీరాముఁ డానందముతో దానిం గైకొని ధరించి దండకారణ్యవృత్తాంతము జనస్థానవృత్తాంతము నగ

స్త్యునివల్ల నెఱింగి యగస్త్యునిఁ గీర్తించి యయోధ్యకుఁ బోయెను.*

## అగస్త్యమహర్షి నహుషుని శపించుట

తొల్లి యొకానొకప్పుడు నహుషుఁ డనురాజు బ్రహ్మవిదుఁడై నూఱుయజ్ఞములు చేసి యుత్తము లగుకుమారులఁ గని దేవత్వము నొంది, యింద్రుఁడు విశ్వరూపునిఁ జంపిన పాపమునకు వెఱచి పాఱిపోఁగా, దేవతలయభిమానమును జూఱగొని యింద్రపదవి నధిష్ఠించెను. కాని, కాలక్రమమున నైశ్వర్యమదాంధతయు భోగలాలసతయు వృద్ధికాఁగా నహుషుఁడు శచీదేవితోడిపొత్తు నాకాంక్షించెను. ఉత్తమపతివ్రత యగుశచీదేవి యుపాయ మాలోచించి మునివాహనుఁడై తనకడ కేతెంచినచో నాతనియభీప్సితముఁ దీర్తు నని యాతనికి వర్తమాన మంపెను. నహుషుఁడును వివేకవిహీనుఁడు నార్యవృత్తిరహితుఁడునై సహస్రోత్తమబ్రాహ్మణధృతమైన బ్రహ్మరథము నెక్కి బ్రాహ్మణావమాన మొనర్చి ప్రసంగవశమున గోసంప్రోక్షణమందుఁ జెప్పఁబడిన బ్రాహ్మణములైన మంత్రములు తనకుఁ బ్రమాణములు కా వని ఋషులతో వాదించెను. పూర్వాచార్యులమంత్రములను నిందించుట యజ్ఞాన మని యగస్త్యుఁ డనఁగా నహుషుఁడాతనిఁ దలపైఁ దన్నెను. దాన నగస్త్యమహర్షి యట్టి ఘోరదుష్కృతమును జూచి యూరకుండలేక వెంటనే యత్యుగ్రాహివి క మ్మని నహుషునకు శాప మిచ్చెను. తత్క్షణమే నహుషుఁడు శక్రాసనమును బాసి క్రూరసర్పమై వచ్చుచు నగస్త్యునిపాదము

* రామాయణము

లపైఁ బడి "మహాత్మా! క్షమింపుము. నే నెంతయుఁ బశ్చాత్తప్తుఁడ నైతిని. బలవద్విధి వైపరీత్యముఁ దప్పింప నేరితరము! కావలసిన దైనది. కావున, నాకుఁ బూర్వస్మృతి చెడకుండను, బలవంతము లగు జంతువులు నన్ను ముట్టి బలహీనము లగునట్లును, శాపమోక్షమున కుపాయమును ప్రసాదింపు" మని కృతాంజలినై వేఁడుకొనెను. అగస్త్యుఁడు వెంటనే కరుణించి యాతనివరము లనుగ్రహించెను. ఆహా! మన మహర్షు లెంతదయార్ద్రహృదయులో కదా! పరమబ్రహ్మర్షుల నవమానించిన దుష్కృతమునకు ఘోరశాప మిచ్చి నహుషునిదార్ప్యమును బోద్రోలినయగస్త్యమహర్షి పశ్చాత్తప్తుఁడైన యానహుషునే వరమున ననుగ్రహించుట యాతని యనంత మహాత్మ్యమును జాటుచున్నది. ఇట్టిపవిత్రాత్ము లగు మహాశక్తి సంపన్నులఁ గడుపారఁగన్న భారతవర్ష మెంతపవిత్రమైనదో కదా!

## అగస్త్యమహర్షి ద్వాదశవార్షికయజ్ఞము

ఒకానొకప్పు డగస్త్యమహర్షి ద్వాదశవార్షికయజ్ఞ మారంభించెను. ఈమహాయజ్ఞము పండ్రెండు సంవత్సరములు జరిగెను. ఆయజ్ఞమున దివ్యానుభావము గల పరమమునులు ఋత్విజులై నిజప్రౌఢి నఖిలతంత్రములు నడపుచుండిరి కాని, కొండొకకారణమున నింద్రుఁడు వర్షింపకుండెను. ఓషధులు వికలత్వము నందెను. ఇది చూచి మునీశ్వరు లగస్త్యుని యన్నదానవిధి యెట్లు నెఱవేఱునో యని భయపడఁ దొడఁగిరి. న్యాయసమ్మత మైనద్రవ్యమునుగాని యొండుద్రవ్యముల నాతఁడు వినియోగింపఁడుకదా! మఱి వానలు లేనిచో మునుల కెట్లీతఁడు భోజనము పెట్టఁగలఁ డని వారు సంశయించిరి. అగస్త్య

మహర్షి యిది యెఱిఁగి యింద్రుఁడు సకాలమున సువృష్టిఁ గురియింపనినాఁడు తానే వెంటనే యింద్రపదవి వహించి జగమును బ్రోచెద ననియు లేనిచోఁ ద్రిజగముల నెచట బహుళోదారద్రవ్యకోటు లున్నవో వానినెల్లఁ దెప్పించెద ననియుఁ దనశక్తిసంపన్నతను విశదీకరింప మునివరు లెల్లరు నగస్త్యుఁడు తపోధనము వ్యయింప నక్కఱలేకయే తానే తెచ్చుకొందు మని నంతలు దక్క యాగకార్యము నెఱవేర్ప మొదలిడఁగానే దేవేంద్రుఁ డీసంగతిఁ దెలిసికొని భయభ్రాంతుఁడై కుంభవృష్టిఁ గురియ నంభోదములఁ బంపి వెంటనే బృహస్పతిని వెంట నిడుకొని వచ్చి వినయవినమితగాత్రుఁడై యగస్త్యుని శరణుచొచ్చి మన్నింప వేఁడుకొనెను. అంత నగస్త్యుఁ డాతనిని గారవించి యర్ఘ్యమిచ్చి శాంతప్రియవచనముల నెల్లరకుఁ బ్రమోదము గల్పించి యింద్రుని బృహస్పతిని బంపివైచెను. తరువాతఁ ద్రిలోకవినుతముగా జన్నము పూర్తియయ్యెను. అగస్త్యుఁడు వినయవిధేయతలతోఁ బరమమును లగుఋత్విజుల కెల్లర కర్ఘ్యమిచ్చి యామంత్రించి యపూర్వమాహాత్మ్యము నందెను. *

అగస్త్యుఁడు తారకబ్రహ్మోపదేశము నందుటకై అవిముక్తక్షేత్రమున కరిగి యచట విశ్వేశ్వరుని సేవించుచుండెను.

## దేవత లగస్త్యునికై వెదకుట

ఇటు లుండ, వింధ్యపర్వతము మేరుపర్వతముపైఁ గల యసూయ, సూర్యుఁడు తనచుట్టుఁ దిరుగక మేరుపర్వతము చుట్టుఁ దిరుగు ననుకోపము కారణముగా నొకప్పుడు మిక్కిలి

* భారతము, అరణ్యపర్వము.

పెరిగి సూర్యచంద్రనక్షత్రములగమనమున కవరోధము కలిగించెను. అందుచే రాత్రిందివము లేర్పఱుపరాక లోకవ్యవహార మాఁగిపోయెను. అపుడు దేవత లెంత ప్రార్థించినను వింధ్యకుఁ గోప ముపశమింపదాయెను. వా రంత బ్రహ్మపాలికరిగి యంతయుఁ జెప్పి తమ్ముఁ గాపాడఁ గోరిరి. బ్రహ్మ యాపని తనవలనఁ గా దని, అవిముక్తక్షేత్రమునఁ దపము చేసికొనుచున్న అగస్త్యమహాముని యే వారిని రక్షింప సమర్థుఁ డని పోయి యాతని సేవింపుఁ డని తెలిపెను. అది విని దేవతలు బ్రహ్మ చెప్పినచొప్పున బయలుదేఱి భూలోకమునకు దిగి కాశీ పట్టణముఁ జేరి పిదప:

"పంచాక్షరీమంత్రపారాయణమునకు
నెవ్వాని మానసం బేకగడయు
దర్పోద్ధతు లగువాతాపిల్వలులకును
కఠశిలాస్థాన మెవ్వానికుక్షి
ఆది నెవ్వానిదివ్యావతారమునకుఁ
బూర్ణాంబుభాండంబు పురిటియిల్లు
మెఱసి లోపాముద్ర మెఱుఁగుఁబోఁడిల్లాలై
బరఁగించు నెవ్వానిభవ్యమూర్తి
కసరి యెవ్వానికంఠహుంకారరవము
కొండచిలువకులములోఁ గూల్చె నహుషు
నట్టిపరమమహాతేజు నలఘుతేజు
వెదకి రానందరసములో విబుధమునులు.

(కాశీ. ౨. ౮౦)

పిమ్మట, నటఁ గొన్నైనపెద్దలవలనఁ గందువ యెఱిఁగి నెమ్మదిగా వా రగస్త్యమహర్షి యాశ్రమమును బ్రవేశించిరి.

## అగస్త్యాశ్రమవర్ణనము

అగస్త్యునిపుణ్యాశ్రమములో దివ్యమహిమము లెన్నో విరాజిల్లుచుండెను. అచట నాఁడేనుఁగు తొండమెత్తి సింహపుఁ బిల్లను లాలించును. తనవాఁడిగోళ్ళతోఁ బులి లేడిపిల్ల మొగ మెత్తి ముద్దాడును. తోడేలు చింబోతును బిగికౌఁగిటఁ జేర్చి ప్రేమచూపును. ఆశ్రమప్రాంతమునఁ గలచెట్టుతొఱ్ఱలలోనున్న ముంగిసతో నడవిపిల్లి చెలగాటమాడును. ఎండ తాఁకు వేళ ముంగికి త్రాచుపాము పడగ విప్పి గొడుగుగాఁ బట్టును. అచటి కొండ గొఱ్ఱెలు కోతులతోఁ బొత్తు గలిగి మెలఁగును. ఇట్టివింతలు గల అగస్త్యాశ్రమముఁ గన్న దేవతలు పొందిన యానందాశ్చర్యము లనంతములు.

## దేవత లగస్త్యుని గొలుచుట

ఇట్లు కాశీనగరమునకుఁ గ్రోశమాత్రదూరమందు గంగా నదీతీరమున బ్రహ్మలోకమును దలదన్నుచు వెలయు అగ స్త్యునిపర్ణశాలఁ జేరి లోపాముద్రాసహితుఁ డగుమహర్షిని దేవ తలు కాంచిరి. అగస్త్యమహర్షి యపుడు నిమిషనిమిషమునకు భక్తిపారవశ్యమునఁ బార్వతీవల్లభుని బహుమనోహరకంఠస్వన మునఁ బలుమఱు స్తుతించుచుండెను. కొంతసేపామహాత్ముఁడు యోగనిరూఢి నుండి విడవఁ బ్రసన్నుఁడై ప్రశాంతిముద్ర ధరించి యున్నసమయమున జయజయధ్వానములతో సుర లాతనిఁ జేరి మ్రొక్క నాతఁ డెదు రేఁగి వారందఱకు సత్కా రము లొనర్చి సుఖాసీనులఁ గావించి వచ్చినపని యడిగెను.

## బృహస్పతి అగస్త్యునితో వచ్చినపనిఁ దెల్పుట

దేవత లెల్లరికోరికపైని బృహస్పతి అగస్త్యునికి నమస్క రించి స్తుతించి ప్రక్కనున్న లోపాముద్రాసాధ్విని బ్రస్తుతించి

యిట్లనెను. "మునిచంద్రా! నీవు ప్రణవమవు. ఈమె వేదవిద్య. నీవు తపస్సువు. ఈసాధ్వి శాంతి. నీవు ఫలము. ఈమె సత్క్రియ. నీవు సూర్యుఁడవు. ఈమె చైతన్యలక్ష్మి. నీయందు బ్రహ్మతేజము, ఈమెయందుఁ బతివ్రతా తేజము ప్రజ్వరిల్లుచున్నది. ఈయుభయ తేజఃపుంజము మాకు క్షేమమొసంగును." అని వింధ్యవృత్తాంతము, సూర్యచంద్రాదులగమన మాఁగిపోవుట, దానివలన లోకములకుఁ గలిగినమహావిపత్తును సమస్తముఁ దెలిపి యావచ్చిన దేవతాధిపులను బేరుపేరఁ జూపి వింధ్యగర్వ మడఁచి యిందఱకు మేలుచేయు మని యర్థించెను.

ఆమాటలు విని అగస్త్యుఁడు 'దేవకార్యసిద్ధికి యత్నమొనరించెదను. కాశీపతి. యతిసతి మనపాలఁ గలుగుకదా! భయము లేదు పోయి రండని వారి నెల్లర వీడ్కొలిపెను. అగస్త్యుని యభయవచనమున వారెల్ల రమితానంద మంది యాతనికిఁ బెక్కునతులొనర్చి వీడ్కొని నిజనివాసముల కరిగిరి.

## వింధ్య గర్వాపహరణము

అగస్త్యుఁడు దేవకార్యనిమిత్తమే యైనను బుణ్యరాశి యగు కాశి విడువవలసివచ్చినందులకుఁ బరిపరివిధములఁ బరితపించి లోపాముద్రాసహితుఁడై యందఱి దేవతలయొద్ద సెలవు గైకొని యెట్టకేల కెట్లో కాశి విడిచి కొంత దవ్వరిగి యొక్కచోఁ జతికిలఁబడి "సాధ్వీ! సుఖదుఃఖములు కారణము లేక మానవులకుఁ గలుగవుగదా! పరమసుఖాకర మైనయీ కాశీక్షేత్రమును వీడిపోవలసిన దుఃఖప్రాప్తికి మన మేమి చేసితిమి? కాశ్మీరములందుఁ గుంకుమ మనునది దేశాపేక్ష; పగలు పద్మము రాత్రి కలువపూవు వికసించుట కాలాపేక్ష; పుణ్యాత్మునకు

సుఖము పాపాత్మునకు దుఃఖము అదృష్టాపేక్ష;సర్వము ఈశ్వరా యత్త మనునది ఈశ్వరాపేక్ష. ఈశ్వరప్రేరణమునఁ గర్మమే సుఖదుఃఖములఁ గూర్చు నని నాయుద్దేశము. ఈశ్వరుఁ డెవనిని రక్షింపఁదలఁచెనో వానిచేఁ బుణ్యకర్మములు చేయించు;ఎవనిని చెఱుపఁదలఁచెనో వానిచేఁ బాపకర్మములే చేయించును. ఈకర్మలకుఁ గారణ మన్న అవిద్యతోఁ గూడినరాగ ద్వేషాది క్లేశపంచకము. ఈకర్మఫల మిహపరలోకములఁ బ్రాణు లనుభవించెదరు. కర్మకు హేతువైన క్లేశపంచక మున్నంతకాలము జన్మము, సుఖదుఃఖభోగము, పునర్జన్మహేతుకరణము, ఇవి తప్పవు.'' అని పలుతెఱఁగుల వాపోయి, కాశిఁ దలఁచి తలఁచి దుఃఖించి తుదకు మరలఁ బ్రయాణము సాగించి వింధ్యపర్వతప్రాంతము సమీపించెను.

అగస్త్యమహర్షిని దూరమునుండి చూచి వింధ్యపర్వతము వెనుకటివలె నొదిగిపోయెను. వెంటనే లోకోపద్రవము తొలఁగిపోయి గ్రహగమనము సన్నియు మునుపటివలె జరిగెను. అపుడు పురుషాకృతిఁ దాల్చి వింధ్యపర్వతము అగస్త్యమహర్షికి సాష్టాంగము లొనర్చి, అతిథిసత్కారములు చేసి "మహానుభావా ! భృత్యు నాజ్ఞాపించి కటాక్షింపు"మని వేఁడుకొనెను. అగస్త్యుఁడు "పర్వతరాజా ! మాదంపతుల మిరువురము దక్షిణాపథమునఁ దీర్థములాడఁబోవుచున్నారము. పెద్దల మైతిమి కావున, నీశిరశ్శృంగముల నెక్కి దిగుట మాకుఁ గష్టము. కాన, మేము తిరిగివచ్చువఱకు నీవు భూమిసమముగ నుండవలయును.''అని పలికెను. "మహాత్మా ! చరాచరప్రపంచమున నీయాజ్ఞ చేయనివా రెవరు? అట్లే పడియుండెదను. నన్నుఁ

గటాక్షింపు"మని వింధ్యము పలుకఁగా అగస్త్యుఁడు సంతసించి వీడ్కొలిపి ముందునకుఁ బోయెను.

వింధ్యపర్వతము సహజముగఁ గలపెంపుకూడఁగోల్పోయి మద ముడిగి సిగ్గుపడి చచ్చినట్లు పడియుండెను. అసూయాగ్రస్తుల గతి యింతేకదా !

## అగస్త్యుఁడు దక్షిణకాశికిఁ బోవుట

ఈవిధముగా భువనోపద్రవము నరికట్టి అగస్త్యుఁడు దక్షిణకాశిఁ గన్నఁ గాని తనకాశీవియోగబాధ పోఁజాల దని భార్యాసహితుఁడై తీర్థయాత్రలు చేసికొనుచు మందమందప్రయాణముల గోదావరితీరమును బట్టి ఆంధ్రదేశముఁ జేరెను. పిదప, నాతఁడు పంపాసరోవరము, దండకారణ్యము దాఁటి పట్టిసము, కోటిపల్లి, పలివెల మున్నగుచోట్లు విడిచి దక్షవాటముఁ జేరి యట భీమేశ్వరుని భజించి సుఖించెను. పరోపకారపరాయణుఁ డైనవానికి సంపదలు పుంఖానుపుంఖము సంభవించును. తీర్థస్నానజపహోమదేవతార్చనాదులు పరోపకారమును బోల నేరవు. పరోపకారముకంటెఁ బరమధర్మము లేదు. లోకోపకారపరాయణుఁ డైన అగస్త్యుఁడు దక్షారామమునఁ బరమసౌఖ్యము లనుభవించెను.

పిదప నాతఁడు భార్యాసహితుఁడై వీరభద్రశిఖర మీక్షించి దాక్షివిశేషము లోపాముద్రకుఁ దెలిపి ముందునకుఁ బయనించికొల్లాపుర మేఁగి యట లక్ష్మీదర్శనముఁ జేసికొనెను.

## అగస్త్యకృత లక్ష్మీస్తోత్రము

కొల్లాపురమున అగస్త్యమహర్షి భక్తిభరితుఁడై లక్ష్మి నిట్లు స్తుతించెను. "తల్లీ ! నీవు చంద్రునియందు వెన్నెలవు.

సూర్యునియందుఁ బ్రకాశమవు. అగ్నియందు దాహశక్తివి. అట్టి కల్యాణమూర్తి వగు నీకు నమస్కారములు. అమ్మా! బ్రహ్మ విష్ణుమహేశ్వరులు నీకరుణాప్రభావముననే సృష్టిస్థితిలయములు జరపుచుందురు. ఇందిరా! పండితుఁడన్నను, శూరుఁడన్నను, వివేకి యన్నను, వదాన్యుఁడన్నను, ధన్యుఁడన్నను, మన్మథుఁడన్నను, కళావిదుఁడన్నను, ఏమన్నను నీకటాక్షకలితుఁడేకదా. నీయంశ విశేషమే పురుషునియందు భాగ్యముగను, స్త్రీలయందు విలాస రేఖగను, మఱిసమస్తమునందు సొంపుగను గానవచ్చుచుండును. దేవీ! నీవు కలచోటు రసవంతము, నీవు లేనిచోటు రసహీనము, నీవు కలవాఁడే సమస్తము కలవాఁడు. నీవు లేనివాఁడు ఏమియు లేనివాఁడే. అబ్ధికన్యా! జలపూర్ణము లగుబంగారుకుండలు తొండములతో నెత్తిపట్టి యిరువంకల నేనుఁగులు నిన్నుఁ గొలుచు చుండఁగా, శంఖపద్మమహాపద్మ మకరాదినిధులు నియమమున నిన్నర్చించుచుండఁగా, వింజామరలు తాల్చి దేవగంధర్వ గుహ్యకాంగనలు నీకు వీచోపు లిడుచుండఁగా, మఱియొకవంక నింద్రాదిదివిజపతులు చేతులు మోడ్చి స్తుతించుచుండఁగా, పద్మమధ్యమున నిండుకొలువుండి యఖిలలోకములను రక్షించు జగజ్జనని వగునీకుఁ గోటిమ్రొక్కులు" అని పెక్కుతెఱఁగుల స్తుతింప లక్ష్మి యాతనికిఁ బ్రత్యక్షమై "ఋషివరా! నీస్తుతికి సంతసించితిని. నీవు రాఁగల యిరువైతొమ్మిదవ ద్వాపరమున వ్యాసుఁడవై వారణాశిలో వేదశాస్త్రపురాణసంహితాధర్మశాస్త్రముల వక్కాణింపఁగలవు. నీ విపుడు తుంగభద్రాతీరమున కరిగి కిష్కింధప్రాంతమునఁ గలస్వామిమల యనునడవిలో నున్నకుమారస్వామిని దర్శించి యతనివలనఁ గాశీప్రశస్తిఁ దెలిసి

కొని యేఁగుము."అని పలికి లోపాముద్ర నాదరించి యామెకు బహువిధము లగుదివ్యాభరణము లిచ్చి వీడ్కొలిపెను.

ఇట్లు చరితార్థులైనయాదంపతులు పయనించిపయనించి శ్రీశైలముఁ జేరిరి. అట నొక్కచోఁ గూర్చున్నతఱి అగస్త్యుఁడు లోపాముద్రకు శ్రీశైలమహాత్మ్యముం దెలిపి యాపర్వతశిఖరమును జూచినంతమాత్రనే ముక్తి కలుగు నని చెప్పెను. అంత నామె చనవుబలిమిని "నాథా ! ఈశిఖరముఁ జూచినంతనే ముక్తికలుగుచుండఁగా నిఁకఁ జచ్చినఁగాని మోక్షము లేనికాశి కేఁగు టెందులకు"? అని పలికెను.

## లోపాముద్రాగస్త్య సంవాదము

మఱియు నామె"దేవా! కొందఱు కేవలవిజ్ఞానము చాలు నందురు.కొందఱు విజ్ఞానసహితమైనకర్మ ముఖ్యమందురు. వ్రత దానక్రతుయోగములు, తపోబ్రహ్మచర్యగార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసాశ్రమములు, వేని కవియే ముక్తిప్రదము లందురు. వీనియన్నిటిలో సులభముక్తిమార్గము సెలవీయుఁ"డని కోరెను. అగస్త్యుఁ డామె కిట్లు బదులుచెప్పెను. సాధ్వీ ! శ్రీశైలాదు లన్నియు ముక్తిప్రదములే. ఏలన,నివి కాశీప్రాప్తికరము లగుట వలన. ఇఁకఁ గాశియే సాక్షాన్ముక్తిహేతువు. అందుచే నదిగొప్పది.ప్రయాగ, నైమిశము, కురుక్షేత్రము, గంగాద్వారము అవంతిక, అయోధ్య, మధుర, ద్వారక, సరస్వతి, మున్నగున వెల్ల ముక్తికారకము లగుతీర్థములు. నీ కొకరహస్యము చెప్పెద. ఈశ్వరకటాక్షము లేకపోయినచోఁ దీర్థయాత్ర చేయవలె ననుబుద్ధియే పుట్టదు. తీర్థయాత్రాకాంక్ష లేనిచోఁ బ్రతి

బంధపాపము పోవదు. ఆపాపము నశింపనంతవఱకుఁ గాశీప్రాప్తి లేదు. కాశీవాస యోగము లేనిచో విజ్ఞానము విస్తరింపదు. జ్ఞానమునఁగాని మోక్షము లేదు. వేదాంతవాక్యములవలనఁ బుట్టినసుజ్ఞానమే జ్ఞానము. మిగిలిన దెల్ల అజ్ఞానము.

తరుణీ! మానసతీర్థములే మోక్షహేతువులు. బాహ్య తీర్థములకంటె నివి మేలు. అవి యేవందువా వినుము. సత్యము ఇంద్రియనిగ్రహము, అనసూయ, దానము, దయ, సంతోషము, బ్రహ్మచర్యము, ధైర్యము, యమము, సమత్వము, విజ్ఞానము, ఇవన్నియు మానసతీర్థములు. ఇవి యెఱుఁగనివారికి బాహ్య తీర్థము లాడుటవలన నించుకంతయైనను బ్రయోజనము లేదు. ఏల నందువా తీర్థజలములలో మునిఁగినంతనే మోక్షము కలుగునన్నచో నిత్య మందే యుండు చేఁపలకు, తాఁబేళ్ళకు, మొసళ్ళకు, ముందు మోక్షము కలుగవలెఁగదా! సుదతీ! కల్లు కుండ యెన్నిమాఱులు కడిగిన శుద్ధి యగును? అట్లే మానసిక తీర్థము లలవఱుచుకొన్నఁగాని బాహ్యతీర్థప్రయోజనము లేదు. దేహమునందలియంగములకువలెఁ దీర్థముల భేదము కలదు. ఎవ్వ రేమిచ్చినను బుచ్చుకొనకపోవుట, అహంకారము లేకుండుట, కోపముఁ జంపుకొనుట, ఆలస్యము చేయకుండుట, సత్యనిష్ఠ, సమాధానము, శ్రద్ధ, హేతునిష్ఠ మున్నగునవెల్ల సాంగోపాంగములై ఫలము లిచ్చును. కాని, ఎన్నితీర్థము లైనను కాశీప్రాప్తినే ఈయఁగలవు. కాశికాతీర్థ మాడనివాఁడు లక్ష తీర్థము లాడినను మోక్షలక్ష్మి నందలేఁ"డని యుదాహరణము నకుఁ గొన్నిపూర్వగాథ లామెకుఁ దెలిపెను.

ఆపిమ్మట సతీసహితుఁడై అగస్త్యుఁడు శ్రీశైలము నకుఁ బ్రదక్షిణనమస్కారము లొనరించి ముందున కేఁగి స్వామిమలఁ జేరి యందుఁ గుమారస్వామిని దర్శించెను.

### కుమారాగస్త్యసంవాదము

కుమారస్వామి పత్నీసహితుఁడైనఅగస్త్యమహర్షిని రమ్మని కుశలమడిగి కూర్చుండ నియమించి వచ్చినపని యడి గెను. అగస్త్యుఁడు కాశీమాహాత్మ్యమును దెలుపు మని కోరెను. కుమారస్వామి "అయ్యా! నన్నడిగితివి కాని కాశీమహాత్మ్య మెవ్వరును వర్ణింపఁజాలరు. యథాశక్తిఁ దెలిపెదను. నిన్నుఁ గొల్లాపురలక్ష్మి యిచటికిఁ బుత్తెంచుట యెఱుఁగుదును. కాన, నీ వేవి వినవలతునో కోరుకొ"మ్మనెను. అంత, అగస్త్యుఁడు కుమారస్వామికి నమస్కరించి కాశికిఁ గలనామములు, విశేష ములు తెలుపుమనెను. కుమారస్వామి యవి యెల్లఁ దెలిపెను. పిదప నాతఁడు మణికర్ణికామాహాత్మ్యము, కాశీతీర్థమాహాత్మ్యము కాలభైరవచరిత్రము, హరికేశచరిత్రము, జ్ఞానవాపికాతీర్థమాహా త్మ్యము, కళావతికథ, అగస్త్యునకుఁ దెలిపెను. పిదప, సదాచార నిరూపణముఁ జేయు మనఁ గుమారస్వామి "ఋషీంద్రా! మనువు, అత్రి, భృగువు, భరద్వాజుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, ఉశనసుఁడు, అంగిరసుఁడు, యముఁడు, ఆపస్తంబుఁడు, సంవ ర్తుఁడు, కాత్యాయనుఁడు, బృహస్పతి, శాతాతపుఁడు, శం ఖుఁడు, లిఖితుఁడు, పరాశరుఁడు మున్నగువారు సదాచారము నిరూపించిరి. అవి యెల్లఁ దెలుప సాధ్యము కా"దని దిఙ్మాత్ర ముగఁ దెలిపెను. పిదప, కాశీనగరమును గుఱించిన సమస్త విషయములు అగస్త్యునకుఁ గుమారస్వామి తెలిపెను. ఇవి

యన్నియు విని అగస్త్యుఁ డానందించి సభార్యుఁడై స్వామి నారాధించి సెలవుగైకొని ముందునకుఁ బయనమై పోయెను. *

## అగస్త్యవ్యాసులవృత్తాంతము

కాశీక్షేత్రమును శపింపఁబూనినకారణమున వ్యాసుఁడు శిష్యసమేతుఁడై వారాణసీపురమునుండి విశ్వేశ్వరునిచేఁ ద్రోలివేయఁబడి వచ్చుచుండఁగా లోపాముద్రాసహితుఁడగు నగస్త్యమహర్షి యాతని కెదురయ్యెను. ఆఋషిపుంగవు లొకరి నొకరు కౌఁగిలించుకొని పరస్పరము కుశలప్రశ్నము లొనరించుకొనిరి. పిదప, సశిష్యు లగువారు తుల్యభాగాతీరమునఁ గలబిల్వవనమునందలి చలువరాతిన్నెలపైఁ గూర్చుండి కొంతకాల మిష్టకథావినోదములఁ బ్రొద్దుపుచ్చిరి. అనంతరము వ్యాసుఁడు కాశిఁ బాసి వచ్చుటకుఁ గారణ మే మని యగస్త్యుఁ డడుగఁగా నాతఁ డంతయుఁబూసగ్రుచ్చినట్లు చెప్పి యన్నపూర్ణయాజ్ఞవలన దక్షిణకాశి యగుదక్షారామమునకు విచ్చేసితి ననియు భీమేశ్వరుఁడు తన్నుఁగాపాడుఁగదా యని పలికెను. అగస్త్యుఁడు వ్యాసునోదార్చి దక్షారామమహిమఁ దెలిపి వ్యాసునికోరికపైఁ దనతపోమహత్త్వముచే నాకాశమున కెగయించి వ్యాసాదుల కగస్త్యుఁడు భీమమండలమును జూపి ఇంద్రేశము, సిద్ధేశ్వరము, యోగీశము, కాలేశ్వరము, శమనేశము, వీరభద్రేశము, బ్రహ్మేశము, కపాలేశ్వరము, కుక్కుటేశము, సోమనాథేశ్వరము, శ్రీమహేశము, రామతీర్థము అను ద్వాదశక్షేత్రతీర్థములఁ దెలిపి వానినెల్ల వేర్వేఱ నిరూపించి దక్షాధ్వరానలము, అఖిలేష్టసంసిద్ధి, సోమేశ్వరము, హైమవతము, సప్తగోదావరము అను పంచతీర్థములఁ

* స్కాందపురాణము, భీమఖండము.

జేర్చి-ని వానియందెల్ల వ్యాసు నోలలాడించెను. ఆతరువాత నాతఁడు వ్యాసునితో భీమేశ్వరాలయముం బ్రవేశించి దాని మహత్త్వమును వేయినోళ్ళఁ దెలిపెను. వ్యాసుఁడు శివు నర్చించి బ్రహ్మానంద మందెను. పిదప, అగస్త్యుఁడు సగౌరవ ముగా నాతని వీడ్కొని భార్యాసహితుఁడై తనయాశ్రమమునకు వెడలి సుఖముండెను.

పరశురాముఁ డొకప్పు డగస్త్యమహర్షిని దర్శించి యాతని చేఁ గృష్ణామృత స్తోత్రమును విని కృష్ణకవచధరుఁడై యిరువది యొక్క-మారు రాజులఁ జంపెను.

## అగస్త్యుఁడు భూభారము తగ్గించుట

తొల్లి హిమగిరిపైఁ బార్వతీపరమేశ్వరుల వివాహము జరుగుచుండఁగా నాకల్యాణమును జూచుటకు యక్షకిన్నర సిద్ధ కింపురుషులు, మహర్షులు నెల్లరు వచ్చి బ్రహ్మానందసముద్రమున నోలలాడుచుండిరి. అప్పుడు భూదేవి దక్షిణదిక్కు-నఁ బైకి లేచుటయు నుత్తరదిశను లోనికిఁ గ్రుంగిపోవుటయు సంభవించెను. అందఱును భయపడసాగిరి. అంతఁ బరమేశ్వరుఁ డగస్త్యమహర్షిని బిల్చి "కుంభసంభవా! ఈయుపద్రవమునుండి కాపాడుటకు నీవు దక్క- నన్యులెవ్వరును గానవచ్చుటలేదు. కావున, నీవు సశిష్యుఁడవై దక్షిణదిక్కు-నకుఁ బొమ్ము. అంత భూమి సమమగును. అచటనుండియే నీవును నీశిష్యులును నా కళ్యాణమహోత్సవము చూడఁ గలశక్తి యనుగ్రహించితిని. ఆలసింపక పొ'' మ్మనెను. అంత నగస్త్యమహర్షి శివునానతిని లోపాముద్రాపరిపూర్ణపార్శ్వుఁడై శిష్యసమేతముగా దక్షిణదిశకుఁ బోయెను. అంత భూదేవి భారము

తగ్గుటచే యథాపూర్వము సమవర్తిని యాయెను. అగస్త్య మహర్షి యట్లు సర్వేశ్వరకటాక్షముం బడసి సశిష్యుండై లోపాముద్రతో నట నుండియే దివ్యచక్షువులచేఁ బార్వతీ పరమేశ్వరుల కల్యాణమహోత్సవమును గాంచి యానందాంబుధి నోలలాడెను. *

## అగస్త్యుఁ డింద్రద్యుమ్నుని శపించుట

పూర్వ మొకప్పుడు ద్రవిళాధీశుఁ డగు నింద్రద్యుమ్నుఁడు నైష్ఠికోత్తముఁడై సర్వాత్ముఁ డగు నారాయణు నారాధించుచు నొక శైలాగ్రమునఁ బూజాపరతంత్రుఁడై యుండెను. ఒకనాఁ డటకుఁ గలశజుఁ డరుదెంచి నిలిచియుండెను. ఇంద్రద్యుమ్నుఁ డాతనిఁ గాంచియు నేమఱిపాటున నిర్లక్ష్యముగా నూరకుండెను. అగస్త్యుఁ డాతని నిర్లక్ష్య బుద్ధికిఁ గినిసి యాతఁడు నీచగజయోనిం బుట్టుఁగా కని శాపోదకమును విడిచెను. ఇంద్రద్యుమ్నుఁ డప్పటి కొడలెఱిఁగి భక్తితాత్పర్యములతో నగస్త్యునిపాదములపైఁ బడి "మహాత్మా! నేను నిర్లక్ష్యబుద్ధితో లేను. ఈ శైలాగ్రభాగమున నుండి గృహీతమౌననియతితో సర్వాత్ముఁ డైననారాయణు నూహించుచు దేహస్మృతి వీడి యుండుటచే నిన్నుఁ గనఁజాలకపోయితిని. అంతియకాని మఱియొకభావమున నున్నవాఁడను గాను. నన్నుఁ గరుణింపవే !" యని ప్రార్థించెను. అగస్త్యమహర్షియు "నృపాగ్రణీ ! నీవిషయము నే నెఱుఁగుదును. ఎట్టిపుణ్యాత్ముఁ డైనను విప్రులఁ గని యిచ్ఛామాత్రమునఁ గాని పరిచర్యాకారణమునఁగాని యేమఱి గాని యవమానించి రేని యది మహత్త్వ

* శివపురాణము.

తమే యగును. నీవు పుణ్యాత్ముఁడవు. నేఁటివిప్రావమానదోషము నిలిచియున్నచో ముందుముందు నీ కది ప్రమాద హేతు వగును. ఏతద్దోషపరిహరణార్థమై నీవు గజజన్మము నెత్తక తప్పదు. ఇదియ విధివిలసితము. కాని, నీవు నారాయణ భక్త వరిష్ఠుఁడవు. కనుక గజజన్మ మెత్తియు నీవు నారాయణచరణ సేవ నేమఱనికతమున నే ముక్తి నందఁగలవు. పొ”మ్మని కల శజుఁడు దనదారిఁ బోయెను. ఇంద్రద్యుమ్నుఁ డేనుఁగై పుట్టి యొకకాసారమున జలమును గ్రోలుతఱి నొకమకరముచేఁ బట్టువడి యితఃపర మెఱుఁగక విష్ణుమూర్తి నిఁ బ్రార్థింపఁగా నాతఁడు ప్రత్యక్షమై శాపవిమోచనముఁ జేయ నాతఁ డజ్ఞాన రహితుఁడై విష్ణురూపుఁడై వెలసెను. ఈగజేంద్రమోక్షమే శ్రీమద్భాగవతమందలి గజేంద్రమోక్షణము. *

అగస్త్యుఁడు మణిమంతుని శపించుట

తొల్లి యొకప్పుడు కుశవతి యనుపుణ్యనదితీరమున నమరులు సత్రయాగము చేయుచుండిరి. దాని కాహూతుఁడై కుబేరుఁడు పుష్పకవిమానమున శతమహాసంఖ్యల యక్షరాక్షస బలములతో ప్రియసఖుఁడైన మణిమంతుఁ డనువానితోఁ గూడి యాకాశమార్గమునఁ బోవుచుండెను. దారిలో యమునానది గలచోట నాకసమునఁ బోవు విమానమునుండి మణిమంతుఁ డుమ్మివైచెను. అది యమునానదీతీరమున నూర్ధ్వబాహుఁడై యుగ్రతపము చేయుచున్న అగస్త్యునిపైఁ బడెను.

అగస్త్యుఁడు వెంటనే విమాన మాఁపుచేయ దిగి వచ్చి నమస్కరించిన కుబేరుఁ జూచి 'మూర్ఖుఁడగు నీ మిత్రుఁడు

* భాగవతము.

న్నాపై నుమిసెఁ గావున నాతఁ డొకమానవునిచేతఁ జచ్చును. ఆతనిపరివార మైన యీ యక్షరాక్షసగణములెల్ల నా నరుని చేతనే చచ్చు'నని శపించి పొందనెను. కుబేర మణిమంతు లగస్త్యుని గటాక్షింపు మని ప్రార్థించి సెలవుగైకొని పోయిరి.

ఈ యగస్త్య శాపముకతమున నే సౌగంధికప్రసవాప హరణసమయమున మణిమంతుఁడు నాతనిపరివారము భీమ సేనునిచేతిలోఁ జచ్చిరి. *

## అగస్త్యుఁడు భద్రాశ్వు ననుగ్రహించుట

కృతయుగమున నవవర్షములలో నొకవర్షమునకుఁ దన పేర భద్రాశ్వనామధేయంబుఁ గల్పించిన భద్రాశ్వుఁడను రాజు నిజభార్య యగు కాంతిమతీదేవితో నుండ నగస్త్యమ హర్షి యేతెంచి యాతనిచే నెన్నోమన్నన లంది పద్మనాభవ్రత సంబంధ మగుదీపమాలికలం గాచినఫలమున వా రాజన్మమున నంతయైశ్వర్యము గాంచి రని వారిపూర్వజన్మ వృత్తాంతమును దెలిపి వారి కేతద్వ్రతవిధానమును దత్ఫలమును బోధించి యనుగ్రహించెను.

మఱికొంతకాలమున కాతఁడు పుష్కరతీర్థమున కేఁగి కుమారస్వామిని భజించి వచ్చి భద్రాశ్వునకు మఱికొన్ని వృత్తములఁ దెలిపెను. అం దిలావృతవర్షమున నున్నతఱిఁ దనకు నారాయణుఁడు వైకుంఠపురమున నిజభవనమును జూపి "వత్సా! ఈచరాచరము జలరూపమున నావరించి వరుణాభి ధేయుఁడ నగునారాయణుఁడను నేనే. నీవు మద్భక్తుఁడ వగుట దీనిని గంటివి. ఏతద్దర్శనఫలముకతన నీ కేకాల

---

* భారతము. అరణ్యపర్వము.

మునను జేటు లేదు. హా" మ్మని వీఁడోర్కలుపుటను దెలిపి వాని నాశ్చర్యమగ్ను నొనర్చెను.*

అగస్త్యగీత; అగస్త్యసంహిత.

అగస్త్యమహర్షి లోకోత్తరపురుషుఁడై యాజీవితాంతము జగద్ధితమునకై పాటుపడినవిశ్వశ్రేయస్కరుఁడు. మహాభారతమందలి శాంతిపర్వమున వెలయు నీతని ప్రసిద్ధ మహావిద్యాబోధనమే యగస్త్యగీతానామమునఁ జిరస్థాయియై నిల్చినది. మఱియు, నీమహర్షి రామచంద్రవిష్ణువామనాద్యవతారపూజావిధానము శాస్త్రోక్తముగాఁ దెలిపియుండెను. ఇదియే యగస్త్యసంహిత యనఁ బరుగుచున్నది.†

అగస్త్యమహర్షి జీవితమంతయుఁ బ్రసిద్ధబ్రహ్మవిద్యాబోధకనే యైయున్నది. ఈతనితత్త్వసారమంతయు:

"శివుఁడే దాత శివుండెభోక్త శివుఁడే
చేయుస్ మఖాదిక్రియల్
శివుఁడే విశ్వము నే శివుండ..."

నను సద్భావాద్వైతానుసంధానమునఁ బ్రవ్యక్తమైన దసఁ జెల్లును. సతీసహితుఁడై సమస్తతీర్థములఁ గ్రుంకివచ్చి యగస్త్యమహర్షి దేహశుద్ధికి యమనియమాదులకు నవి యవసరములే యైనను:

"తీర్థములు పూనసములు ముక్తిప్రదములు"
"బాహ్యతీర్థావళులు ముక్తిఫలము నీవు"

అని తనసాధ్వీమణికిఁ దీర్థపరమార్థమును వెల్లడించినాఁడు.

---

* కరావాపురాణము. † సంస్కృతివాచస్పత్యము.

## అగస్త్యార్ఘ్యప్రదానవిధానము

అగస్త్యమహర్షి జగజ్జేగీయమానుఁడై నేఁటికిని భాద్రపదమాసమున భూలోకమునకు నక్షత్రరూపమున దర్శన మొసఁగుచు వండువట్టిననీటికాలుష్య ముడిపెడుకతక ఫలమై మనస్మృతిపథమునకు వచ్చుచుండును.

అగస్త్యనక్షత్రోదయము కాఁగానే విప్రులు సుస్నాతులై కాశపుష్పములతో నగస్త్యప్రతిమను జేసి పుష్పగంధాదులతో నర్చించి యగస్త్యమహర్షి నుద్దేశించి యర్ఘ్యప్రదాన మొసఁగి పూజావిధానము నెఱవేర్చి రాత్రిజాగరము చేసిన, వారి కిష్టకామ్యసిద్ధియు మోక్షపదప్రాప్తియు నాతఁ డొసఁగుచుండును.

తదితరు లగస్త్యమహర్షిని మనమున ధ్యానించి :

"కాశపుష్పప్రతీకాశ వహ్నిమారుతసంభవ,
మిత్రావరుణయోఃపుత్ర కుంభయోనే నమోస్తుతే.
వింధ్యవృద్ధిక్షయకర మేఘతోయవిషాపహ,
రత్నవల్లభదేవేశ లంకావాసన మోస్తుతే,
వాతాపిర్భక్షితో యేన సముద్రశ్శోషితః పురా,
లోపాముద్రాపతి శ్శ్రీమాన్యోఽసౌ తస్మై నమోనమః
యేనోదితేనపాపాని విలయం యాంతి వ్యాధయః,
తస్మై నమోస్త్వగస్త్యాయ సశిష్యాయ చ పుత్రిణే"

అని యర్ఘ్యము విడువవలెను. పిమ్మట లోపాముద్రాసాధ్వి నుద్దేశించి :

"రాజపుత్త్రి మహాభాగే ఋషిపత్ని వరాననే,
లోపాముద్రే నమస్తుభ్య మర్ఘ్యం మే ప్రతిగృహ్యతామ్"

అని యర్ఘ్యమిచ్చి యగస్త్యప్రతిమను బూజించి విప్రులకు గోదానాదికము నొసంగి, యాదిన ముపవసింపవలెను. ఈరీతి నొనరించినవారికి లోపాముద్రాగస్త్యులు భుక్తిముక్తులు కరతలామలక మొనరింతు మని శపథముపూనిరి.

## ఉ ప సం హా ర ము

లోకైకపూజ్యుఁ డగునగస్త్యమహర్షి త్రికాలస్మరణీయుఁడు. త్రిభువనవిఖ్యాతబ్రహ్మర్షి. ఆచంద్రార్క-చిరస్థాయి. ఆమహాత్మున కిట్లంజలి ఘటించి నమోవాకము లర్పించుట భారతీయులమగు మనవిధి:

"అగస్త్యాయ నమస్తేఽస్తు అగస్త్యేఽస్మిఁ ఘటేస్థితః
అగస్త్యో ద్విజరూపేణ ప్రతిగృహ్ణాతు సత్కృతః"
"అగస్త్యస్సప్తజన్మాఘం నాశయిత్వాఽవయోరయం,
అపత్యం విమలం సౌఖ్యం ప్రయచ్ఛతు మహామునిః" *



* సంస్కృతవాచస్పత్యము.

ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీ మహర్షి జీవిత కథామృతము

## అత్రిమహర్షి

### స్తుతి

అంభోజగర్భహృదంభోజసంభవు
జంభాదిదైత్యసంస్తంభయుతుని,
వనితాజనానీకఘనశిరోరత్న మా
యనసూయఁ జెట్టపట్టినగృహస్థుఁ,
జంద్రదుర్వాసోమునీంద్రదత్తాత్రేయు
ఋషిచంద్రములఁ గన్న ఋషివతంసు
ధర్మశాస్త్రానేకమర్మజ్ఞు, నిర్మల
కర్మరహస్య సత్కర్మనిరతు
బహుతపోధనసంయుతు, నిహతనిఖిల
కామరోషాదిశత్రు, దివ్యామలాత్మ
తత్త్వమూర్తిని, సప్తర్షిసత్త్వమహితు,
నత్రిఋషిఁ గొల్తు నెపు డిహాముత్రములకు.

అత్రిమహర్షి సప్తమహర్షులలో నొకఁడు, అనసూయామహాసాధ్వికిఁ బ్రాణనాథుఁడు, నిజతపఃప్రభావమున లోకోత్తరుఁ డైనమహాపురుషుఁడు.

## అత్రిజననము

సృష్టికర్త యగుబ్రహ్మదేవుఁడు తనకు సహాయుఁడుగా నుండి ప్రపంచమునఁ గొంతసృష్టికిఁ గారకుఁ డగు నను నుద్దేశముతోఁ దన మానసమునుండి యత్రిని బుట్టించెను. అత్రి జన్మించి తండ్రికి నమస్కరించి "తండ్రీ! నీవు న న్నేనిమిత్తమై సృజించితివి? నీ యాజ్ఞ నాకు శిరోధారణ మగును గాక!" యని పలుకఁగా బ్రహ్మదేవుఁడు సంతసించి "నాయనా! నీవు మహాతపస్సు చేసి లోకసంరక్షణమునకై కొందఱను సృజింపవలయును. నీకు వలసినసాహాయ్యము నేను చేయుచుందు" నని చెప్పి యత్రిని దపోవనమునకుఁ బంపి బ్రహ్మదేవుఁడు తన నివాసమున కేఁగెను. *

## అత్రి తపోనియతి

బ్రహ్మదేవుని యాజ్ఞానుసార మత్రి బయలుదేఱి యొకవనమున కేఁగి యందుఁ దపోవృత్తి నుండెను. పంచభూతములచే నేర్పడి రక్తమాంసాస్థికలచే హేయమై వినశ్వర మగు దేహముపై నిర్మమత్వము గలిగి యా దేహముకాని యాత్మను దర్శించి తదంతర్లీనత నానందసుస్థిరచిత్తమున నెగడఁ గనుటకే యమనియమములు, దానధర్మములు, తపోవ్రతములు నేర్పడినవి. తాను కాని దేహముపై మమత్వము నశింపఁ జేసికొనుటకుఁ దానైన యాత్మవలనియానంద మనుభవించు శక్తిఁ గనుటకు దేహము నుపవాసాది కఠిననియమములచేఁ గృశింపఁ జేయవలయును. అట్టి దేహకార్శ్యమువలన దుఃఖము నందక యాత్మ

---

* భాగవతము.

నందస్థితిని పిలువఁగలిగినవారే మహర్షులు. ఈశాశ్వతస్థితికి సత్యతపోనిరతియే మార్గము. ఈస్థితియున్న వా రనంత శక్తిమయులు. దీనినే యత్రి సాధింప దొరకొనెను. ఇట్టిమహోగ్రతపస్సంపన్నుఁ డగు నత్రిమహర్షి నేత్రగోళములనుండి కొంత కాలమున కొకదివ్యతేజ ముదయించును. ఆమహాతేజ మంతు లేనిదై భూనభోంతరమంతయు వ్యాపించెను. దశదిశలు నా తేజము భరింప నెంచి యాహ్వానించెను. కాని యా తేజోవిశేష మత్యంతమై నిర్భర మగుటచేఁ గొంతకాలమున కా దశదిశలును మోయఁజాలక వెడలఁగ్రక్కెను. అంత నాదీధితి సముద్రగర్భమునఁ బడెను. ఈసంగతి బ్రహ్మదేవుఁ డెఱింగి యాప్రదేశమునకు వచ్చి యా తేజమును దాను ధరించెను. దేవత లిది చూచి యావిరించిని సోమమంత్రములచే స్తుతించిరి. అంత బ్రహ్మ యా తేజోంశమునకుఁ బురుషరూప మొసఁగి యత్రిమహాముని వివాహ మైనపిమ్మట నాతని కనసూయయందుఁ దనయంశముచేఁ జంద్రుఁడై జన్మించుననియు నా తేజోంశమే యొకటి తరువాత క్షీరసాగరమథనసమయమున జనించి యా శశాంకునిఁ గలియు ననియు దేవతలకుఁ జెప్పి యాచతుర్ముఖుఁ డంతర్హితుఁ డయ్యెను. అత్రి యథాపూర్వము తపోవిధ్యానవద్యుఁడై బ్రహ్మచారియై యుండెను. *

### అత్రిమహర్షివివాహము

కొంతకాలమునకు దేవహూతీకర్దములకు విష్ణుమూర్తి కటాక్షముచేఁ దొమ్మండ్రుకూఁతులును నొకకుమారుఁడును

---

* మార్కండేయపురాణము.

జన్మించిరి. కర్దమప్రజాపతి తనకూఁతుండ్రను బ్రహ్మర్షులకే యిచ్చి వివాహము చేయ నెంచి వారిలో నొకతె యగు ననసూయకుఁ దగినవరుఁ డత్రిమహర్షి యే యని యాతనిఁ బిలువ నంపెను. అత్రిమహర్షియుఁ గర్దమునియొద్దకు వచ్చి యాతని కోరికపై ననసూయను వివాహమాడి యత్తమామల యాశీర్వచనము లంది తనయాశ్రమమునకు సభార్యుఁడై వెడలి పోయెను.

ఈప్రకార మత్రిమహర్షి గృహస్థాశ్రమమును స్వీకరించి యనసూయాసాధ్వితోఁ గాపురము చేయుచుండెను. అనసూయ తనయద్వితీయభర్తృసేవలో సమస్తమును విస్మరించుచుండెను. భర్తనే దైవముగా నెంచి యాతనికి సకలోపచారములను జేయుచు నాతనిహృదయమును జూఱగొని జ్ఞానోపదేశము, ననంతమహత్త్వము నాతనివలనఁ బడయఁ గల్గెను. ఆహా! ఆహారవిహారనిద్రాసంగమవ్యామోహాదులచే నపవిత్రమై యత్యంతదుఃఖప్రద మగుసామాన్యసంసార జీవనమునకు, నాత్మానవద్యవిద్యానందముచే వినశ్వర దేహసుఖవిదూరము విశ్వమంగళార్థము విరియుక్తము మమకారరహిత మగుమహర్షుల సంసారజీవనమునకు నెంతదవ్వు!*

**త్రిమూర్తు లనసూయకు వరము లొసఁగుట**

అందుచే నత్రిమహర్షిదయవలన ననసూయకు నానాఁటికి గొప్పతనము హెచ్చుచుండెను. ఒకనాఁడు బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనసూయమాహాత్మ్యమును బరీక్షింప నెంచి

---

* భాగవతము. తృతీయస్కంధము.

యత్రిమహర్షి యాశ్రమమునకు వచ్చి యాతిథ్యము కోరిరి. అత్రి మహాప్రసాద మనెను. కాని, యాత్రిమూర్తులును దమ కొకవ్రతము కల దనియు దానిప్రకార మాహారము తమకు వడ్డించుస్త్రీ నగ్నయై వడ్డింపవలె ననియుఁ జెప్పిరి. అత్రిమహర్షి యనసూయతో నీవిషయమును జెప్పెను. అనసూయ యంగీకరించెను. త్రిమూర్తులు స్నానము చేసి వచ్చి కూర్చుండ వారిపై ననసూయ మంత్రాక్షతములు జలమును జల్లంగా వారు ముగ్గురు నామె మాహాత్మ్యమునఁ జంటిబిడ్డ లైరి. ఆమె నగ్నయై వడ్డించి పిమ్మట వస్త్రము ధరించి తిరిగి వారిపై జలము చల్లి యథాపూర్వముగాఁ ద్రిమూర్తులఁ జేసి భుజింపుఁ డని కోరుకొనెను. వారు భుజింపఁగనే మరల వారిని శిశువులఁ జేసి తనగృహముననే యుయ్యేలలోఁ బరుండఁ బెట్టి యూఁచుచుండెను. సరస్వతీ లక్ష్మీ పార్వతులు భర్తలను వెదకికొనుచు వచ్చి యనసూయను బతిభిక్షము వేఁడిరి. అనసూయ వారి నాదరించి యాముగ్గురుబిడ్డల నిచ్చెను. వా రాశ్చర్యపడి తమ భర్తలను బ్రసాదింపు మని యామెను బ్రార్థించిరి. అనసూయ వారికి మ్రొక్కి మంత్రాక్షతములతో నాబిడ్డలఁ ద్రిమూర్తులఁ జేసి యాత్రిమాతలకు నిచ్చెను. అంతఁ ద్రిమూర్తులును భార్యాసహితులై యనసూయామహాత్మ్యమునకు మెచ్చుకొని తమయంశములచే లోకోద్ధారకు లగు ముగ్గురు పుత్రు లుదయింతు రని వరమిచ్చి యనసూయాత్రిమహర్షుల నాశీర్వదించి వెడలిపోయిరి.*

---

* భారతము. మార్కండేయపురాణము.

మఱియొకపర్యాయము కౌశికపత్ని శాసనమున సూర్యుఁ డుదయింపకుండఁగా లోకోపద్రవము కలిగెను. అప్పుడు బ్రహ్మాదులగు దేవత లాయుపద్రవమును బాపు మని యన సూయను గోరిరి. అనసూయ కౌశికపత్ని నంగీకరింపఁ జేసి సూర్యోదయ మగునట్లు కావించి మరణించిన యామె భర్తను వెంటనే బ్రదికించెను. అప్పుడును ద్రిమూర్తులు ప్రత్యక్షమై యామెకుఁ దమయంశములఁ బుత్త్రత్రయ ముదయించు నని యాశీర్వదించిరి. †

అత్రిమహర్షి సంతానమునకై తపము చేయుట.

అటుపిమ్మటఁ గొంతకాలమున కత్రిమహర్షి భార్యా సహితుఁడై ఋక్షపర్వతముపై నిలిచి దేవదేవుని గుఱించి శత వర్షములు ఘోరతప మొనర్చెను. ఆతపోనలముచేఁ ద్రిజగ ములును గలఁగుచుండఁగా బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముువ్వు రును బ్రత్యక్షమైరి. అత్రి వారిని బూజించి "నేను సత్సంతా నార్థమై దేవాదిదేవునిగుఱించి తప మొనర్ప ముువ్వు రేల వచ్చితిరి? మీలో నధికు లెవ?" రని వారిని బ్రశ్నించెను. అత్రిమూర్తులును దమ కభేద మని చెప్పి తమయంశములచేఁ ద్వరలోనే యాతనికి సత్పుత్త్రోదయ మగు నని వర మిచ్చి యదృశ్యులైరి.

అత్రిమహర్షికి లోకోత్తరపురుషు లుదయించుట.

కాలక్రమమునఁ ద్రిమూర్తులవరమున నత్రిమహర్షి నేత్రగోళమునుండి చంద్రుఁడును ననసూయాగర్భమున దత్తా

---

† మార్కండేయపురాణము.

త్రేయ దుర్వాసులును క్రమముగా బ్రహ్మవిష్ణుమహేశ్వరాం శములలో నుద్భవించిరి. ఆమువ్వురు బిల్లలు జన్మించి దినదిన వర్ధమానులై తల్లిదండ్రుల కధికామోదమును గూర్చుచుండిరి.

ఇట్లు పుత్త్రులు పెరుఁగుచుండఁగా నత్రిమహర్షి తపోధ్యాననిమగ్నుఁడై యనసూయను బిలిచి "సాధ్వీ! నీవు కోరినట్లు సత్పుత్త్రులఁ బడయించినాను. నే నికఁ దపోజీవనము నభిలషించుచున్నాను. నీవు నాతో నుందువా? లేక యీ బిడ్డలకడ నుందువా!" యని యడిగెను. అనసూయ వినయవిధేయతలతో "మహాత్మా! పుత్త్రులింకను బెరిఁగి పెద్దవారు కాలేదు. అగుట నిపుడే యాశ్రమాంతరమున కరుగుట ధర్మము కాదు. కావునఁ బుత్త్ర పోషణార్థమై పృథుచక్రవర్తికడ కరిగి యర్థముఁ గొనితెండు. వారలఁ బెంచిన పిమ్మట మన మిరువురము వానప్రస్థాశ్రమమున కరుగుట లగును. తమకుఁ జెప్పుటకు నేనెంతదానను! ఐనను, దమ యభీప్సితమే యొనరింతు" నని వాక్రుచ్చెను. అత్రిమహర్షియు నామెవాక్యములందలి ధర్మము నౌచిత్యము గ్రహించి ధనార్థియై పృథుచక్రవర్తి చేయుచున్న యశ్వమేధయాగమును జూడనేఁగెను.

## అత్రిమహర్షి పృథుచక్రవర్తికడ కేఁగుట

అచటఁ బృథుచక్రవర్తి యాగాశ్వమును విడిచి తత్సంరక్షణమునకై పుత్త్రుని బంపుచు నత్రిమహర్షి నాతనికి సాహాయ్యము గమ్మని ప్రార్థించెను. అత్రిమహర్షి యంగీకరించి వెడలెను. పృథుచక్రవర్తి యాగవైభవమును జూడలేక యింద్రుఁడు పాషండవేషమునఁ దిరోహితుఁడై యాగాశ్వము నప

హరించి యాకాశమున కేఁగెను. పృథుపుత్త్రుఁ డత్రిసాహాయ్య మున వాని ననుసరించి దేవేంద్రునిపై బాణమేయ సంశయించు చుండఁగా నత్రిమహర్షి యజ్ఞహంత నెంతవానినైనఁ జంపవచ్చు నని యాతనికి బోధించెను. అంతఁ బృథుపుత్త్రుఁ డింద్రునిపై బాణము లేసి నొప్పింప నింద్రుఁ డశ్వమును విడిచి పాఱిపోయె ను. అత్రిసహితుఁడై రాజకుమారుఁ డశ్వమును దోలి తెచ్చు చుండఁగా నింద్రుఁడు మరల దాని నపహరించెను. ఈసారి పృథుపుత్త్రున కిది గోచరము కాలేదు. అత్రిమహర్షి దివ్యనేత్ర ములఁ జూచి యాతనికిఁ జెప్పఁగా నాతఁడు మరల నింద్రుని దరిమి యాగాశ్వమును గొనితెచ్చెను. అశ్వమేధయాగ మాపై నిర్విఘ్నముగాఁ బూర్తి కాఁగా నే పృథుచక్రవర్తి బ్రాహ్మణుల కనేక దక్షిణ లిచ్చి సంతృప్తి పఱచుచుండెను. ఆసమయమున నత్రిమహర్షి పృథుచక్రవర్తి నింద్రుఁ డనియుఁ జంద్రుఁ డనియు విధాత యనియుఁ గీర్తించెను. అట నున్న గౌతమమహర్షి యిది విని "యొకమానవమాత్రు నింతగా నేల నుతింతు" వని యా తనిపైఁ గలుషించెను. అత్రియుఁ దనవాక్యముల దోషము లే దనెను, క్రమముగా నిరువురకు వాదము ప్రబలెను. నాఁటి సభాంగణమునఁ గలఋషిపుంగవు లాధర్మనిర్ణయముఁ జేయఁ జాలకుండిరి. అంతఁ గాశ్యపమహర్షి లేచి సనత్కుమారుఁడు దక్క నన్యు లీసమస్యఁ దేల్ప లే రని వక్కాణించెను. అంత నాసదస్యు లందఱితో నత్రిగౌతములు సనత్కుమారుపాలి కేఁగి యావాదమును దెలియఁబఱచిరి. సనత్కుమారుఁడు అత్రివాక్య ములందు దోషము లేదనియు "నావిష్ణుః పృథివీపతిః" అను

భావమున నవి ధర్మయుక్తములే యని తీర్మానించెను. అంత సదస్యు లందఱును బృథుచక్రవర్తితో నీనిర్ణయమును నివేదింప నాతఁ డత్రిమహర్షిని గీర్తించి యనేక ధనకనకవస్తువాహనము లిచ్చి సత్కరించెను. అత్రిమహర్షియు వానిని దీసికొని వెళ్లి పుత్త్రులకుఁ బంచి యిచ్చి వారలు వయసు గన్నంతనే భార్యాసహితుఁడై ధర్మసంహితబుద్ధితో వనమున కేఁగెను.*

## అత్రిమహర్షి సూర్యచంద్రుల రక్షించి రాక్షసుల భస్మము చేయుట

ఒకప్పుడు దేవతలకు జంభాది దైత్యులకు గొప్పయుద్ధము సంభవించెను. అందు రాహువస్త్రసమితిచే సూర్యచంద్రులు సోలిపోఁగా వెలుఁగు నశించి లోక మంతయు నంధకారబంధుర మయ్యెను. అప్పుడు రాక్షసులు విజృంభించి దేవతల నొప్పింపఁదొడగిరి. దేవతలు భయార్తులై యత్రిమహర్షికడ కరుదెంచి దమదుస్థితిని।సూర్యచంద్రుల పాటును జెప్పి తమ్ము రక్షింపవలె నని వేఁడుకొనిరి. అత్రిమహర్షియు వెంటనే వారి కభయమిచ్చి సూర్యచంద్రుల శరీరముల నక్షతము లగునట్లు చేసివైచెను. పిమ్మట నాతఁడు తీక్ష్ణదృష్టిమాత్రము ననే రాక్షసు లెల్లరు మడియునట్లు చేసెను. అంత దేవతలెల్ల రత్రిమహర్షికటాక్షమునఁ బ్రతికితి మని యాతని నెంతయు శ్లాఘించి వెడలిరి. ఆహా! మహర్షులమహాత్త్వము వర్ణనాతీతము గదా! జగద్ధితార్థము దేవకార్యనిమిత్తము నత్రిమహర్షి యనంతములగు నిట్టిమాహాత్మ్యము లెన్నిటినో చూపి యుండెను.†

* భారతారణ్యపర్వము. † బ్రహ్మాండపురాణము.

## అత్రిమహర్షి సీతారాములకాతిథ్యమిచ్చుట

భరతుఁడు సపరివారుఁడై యరణ్యమున నున్న సీతా రామలక్ష్మణులకడకు వచ్చి శ్రీరామునిపాదుకలు గొని నంది గ్రామమున కేఁగినపిదప శ్రీరాముఁడు భార్యానుజులతో నత్రి మహర్షి యాశ్రమమున కేతెంచెను. అత్రిమహర్షియు వారిని మిగుల మన్నించి యనసూయాదేవిమాహాత్మ్యము వారల కెఱిఁగించెను. సీతాదేవి యనసూయవలనఁ బతివ్రతాధర్మములు విని యామెకుఁ దనవివాహవృత్తాంతమును దెల్పెను. అనసూయయు సీతకు నూతనాంబరభూషణములతో శశ్వదలంకృతి యగు కుంకుమనిచ్చి యాశీర్వదించెను. ఆరాత్రి సీతారామలక్ష్మణు లత్రి మహర్షియాశ్రమమునఁ గడపి మఱునాఁ డుదయమున బయలు దేఱి ముందున కేఁగిరి. *

## అత్రిమహర్షి యపరిగ్రహవ్రతపాలనము

అత్రిమహర్షి మొదటఁ గొంతకాలము కశ్యప విశ్వామిత్రాదులతోఁ గలిసి భూమిపైఁ జరించుచుఁ దపశ్చరణ పరుఁడై యుండెను. కొంతకాలమున కొకమహాక్షామము సంభవించెను. ప్రతిగ్రహముచేయ మని వ్రతము ధరించినసప్తర్షులు నాఁకలిదీర్చుకొనుటకై యొకశవమును దినఁదొడఁగిరి. వృషాదర్భి యనురాజు వారికడ కేఁగి భోజనపదార్థములఁ బంపెద ననెను. కాని, వారు గ్రహింపమనిరి. రహస్యముగా నాతఁడంపఁగా వా రంగీకరింపకుండిరి. కొంతకాలము వారు తామర తూండ్లు తిని బ్రతుక నెంచి యొకకొలనుఁ జొచ్చి కొన్ని

---

* రామాయణము.

బిసనాళములను ప్రోగుచేసి కట్టఁ గట్టి గట్టుపైఁ బెట్టి సుస్నాతులై వచ్చుసరికి, దేవేంద్రుఁడు ప్రచ్ఛన్నవేషుఁడై యా తామరతూండ్లను దాఁచివేసెను. సప్తర్షులు నెవరు దాఁచినది తెలియక తామరతూండ్ల నపహరించినవానికిఁ గల్గుదోషముల నిర్వచింపఁ దొడఁగిరి. అంత నింద్రుఁడు వారి యపరిగ్రహమునకు వ్రతపాలనక్షుదపశ్రప్రధానజీవితమునకు మెచ్చిస్వస్వరూపియై మహర్షులతో నత్రిమహర్షిని స్వర్లోకమునకుఁ దీసికొనిపోయి యనేకవిధములఁ బూజించికృతార్థుఁడయ్యెను. *

## అత్రి సంహిత

ఒకమారు ధర్మసంసక్తు లగుఋషు లత్రిమహర్షిని దర్శించి "మహాత్మా! నీవు విశ్వవిదుఁడవు. ఋషిశ్రేష్ఠుఁడవు. విశ్వహితోదయుఁడవు. కావున, మాయందుఁ గటాక్షముంచి దైవములలో నుత్తమమైన మెవరు ? ఏది పరమధర్మము ? ఏది పరమవిధి ? పరమేశ్వరు నర్చించువిధాన మేది ? అను సంశయములను దీర్పు'' మని వేఁడుకొనిరి. అత్రిమహర్షియు సంతసించి వారి నెల్లరఁ దగురీతి సమ్మానించి యిట్లు వలికెను. "ఋషులారా ! సర్వదేవతలలోను శ్రీమన్నారాయణుఁడే యుత్తమోత్తమదైవము. ఆతఁడే పరంధాముఁడు, పరంజ్యోతి, సర్వకారణకారణుఁడును. ఉపవాసవ్రతదానస్వాధ్యాయాదులచే నాతని నర్చించుటే పరమధర్మము, పరమవిధి. ఇహాముత్ర సుఖముల కాతని నర్చించుట- అమూర్తార్చనము, సమూర్తార్చనమని-ద్వివిధము. అగ్న్యాహుతి యమూర్తార్చన

* భారతము. ఆనుశాసనిక పర్వము.

మనియుఁ బ్రతిమాద్యర్చనము సమూర్తార్చన మనియుఁ దెలి యవలెను. వైఖానసమతము ననుసరించిన యర్చనమే యుత్త మము. సాయంప్రాతలయందు గృహమునఁ గాని దేవాలయ మునఁ గాని ద్విజులు భక్తిభావముతో నగ్నిహోత్రాదిహో మాంతముగాఁ బరమేశ్వర ప్రతిమను బూజించుటే సమూర్తా ర్చనము. భృగుఁడు, కాశ్యపుఁడు, మరీచి, నేను దీని నభినం దింతు" మని యత్రిమహర్షి యామూలాగ్రముగా నుపదేశిం చెను. ఇదియే 'యత్రిసంహిత' యను పేర విఖ్యాతిగాంచినది.

ఇం దత్రిమహర్షి కర్మ, ప్రతిష్ఠ, పూజన, స్నపనో త్సవ, ప్రాయశ్చిత్తము, లనువిభాగముల క్రిందఁ దనవిషయ మును విభజించెను. ఇందు మొదటిభాగమున దేవాలయస్థల పరిశీలనము, దేవాయతనరూపము; దైవప్రతిమానిరూప ణము మున్నగు విషయములును, రెండవభాగమునఁ బ్రధాన పరివార దేవతా ప్రతిష్ఠాదికము, మూఁడవభాగమునఁ బూజా విధానమును, నాల్గవభాగమున మహాభిషేకవివరణము, నైదవభాగమున నుత్సవవిశేషములుఁ బ్రత్యేకోత్సవములుఁ దన్నిబంధనములును, నాఱవభాగమునఁ బూర్వోక్తవిధా నములందలి దోషాదికమునకుఁ బ్రాయశ్చిత్తమును వివరింపఁ బడినవి. ఈప్రకార మత్రిమహర్షి దేవతార్చనావిధాన మును లోకమునకుఁ జాటి పరమేశ్వరోపాసనమును దన్మూ లమునఁ దరణోపాయమును మనకుఁ బ్రసాదించెను.

## అత్రిస్మృతి

అత్రిస్మృతి లేక ఆత్రేయధర్మశాస్త్రమను పేర అత్రి మహర్షి ప్రోక్తమగు ధర్మశాస్త్రము కలదు. విప్రుఁడు శూద్రి

స్త్రీని వివాహమాడినచోఁ బతితుఁడే యగు నని యత్రి పేర్కొన్నట్లు మనుస్మృతి (iii-16) లోఁ గలదు. ఈధర్మశాస్త్రమునఁ దొమ్మి దధ్యాయములు కలవు. దానధర్మములఁ గూర్చియు జప తపములఁ గూర్చియు, రహస్యప్రాయశ్చిత్తాదులను గుఱించియు, యోగము యోగాంగములు మున్నగు వానిని గుఱించియు నెన్నో విషయము లిందుఁ గలవు.

ఇది కాక అత్రిసంహితలు అత్రిస్మృతులను పేర* నెన్ని యో స్మృతి గ్రంథములు కాన నగుచున్నవి. వీనిలో ప్రాయ శ్చిత్తములు, దానములు, పితృమేధము, ఆచారములును; గురు ప్రశంస, చాతుర్వర్ణధర్మములు, జపమాలాపవిత్రత, బ్రాహ్మ ణుల కుండవలసిన శౌచాన సూయాది సుగుణములు, ఇష్టా పూర్త నిర్వచనము, యమనియమములు, పుత్త్రులు, దత్త పుత్త్రులు, ప్రాయశ్చిత్తములు, అశౌచము, చాంద్రాయణ కృచ్ఛ్ర శాంతపనములు, మున్నగు విషయములు కలవు.

దత్తపుత్త్ర స్వీకృతి విషయమున అత్రి యనుశాసనమే మొట్టమొదటి దని దత్తకమీమాంసలోఁ గలదు.* అత్రి నను సరించి యంత్యజు లేడు జాతులవారు. రజకులు, పాదరక్షలు తయారు చేయువారు, నటకులు, బురుడులు, కైవర్తకులు (వల్లెవారు) మేదరులు, భిల్లులు. కాని,యాత్రా వివాహయజ్ఞా

---

* Jivananda's Collection (Part 1. 13–46)

* "అపుత్త్రేణైవ కర్తవ్యః పుత్త్రప్రతినిధిస్తదా,
పిండోదక క్రియా హేతోర్యస్మాత్తస్మాత్ప్రయత్నతః" అత్రిస్మృతి. పుట. ౧౭.

దులలోఁ దాఁకఁదగినవారు తాఁక రానివారు ననువిషయమునఁ బట్టింపు లేదు.*

మఱియు, లఘ్వత్రిస్మృతి, వృద్ధాత్రేయస్మృతి † యను రెండుస్మృతులు అత్రిమహర్షి పేరఁ గానఁబడుచున్నవి.*

---

* "దేవయాత్రా వివాహేషు యజ్ఞప్రకరణేషు చ
ఉత్సవేషు చ సర్వేషు స్పృష్టాస్పృష్టిర్న విద్యతే."

† Jivanandas' Collection (Part I)

* ఇందు "అగ్నేరపత్యం ప్రథమం సువర్ణం
భూర్వైష్ణవీ సూర్యసుతాశ్చ గావః
లోకాస్త్రయస్తేన భవంతి దత్తా
యః కాంచనం గాం చ మహీం చ దద్యాత్"
"సర్వేషామేవ దానానామేకజన్మానుగం ఫలమ్
హాటక క్షితి ధేనూనాం సప్తజన్మానుగం ఫలమ్"
మున్నగు శ్లోకములు గలవు. ఇవి
"సర్వాన్ కామాన్ ప్రయచ్ఛంతి
యే ప్రయచ్ఛంతి కాంచనమ్;
ఇత్యేవం భగవానత్రిః
పితామహసుతోఽబ్రవీత్"
అన్న సంస్కృతభారతానుశాసనికపర్వశ్లోకభావముతో సరిపోవుచున్నవి.

ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీమహర్షి జీవితకథామృతము

## అష్టావక్రమహర్షి

స్తుతి

మాతృగర్భమునందె మహితవేదవ్రాత
 మరసె నెవ్వాఁ డట్టి యురువివేకి
యేకపాదసుజాత లేమహాత్ముని గని
 ధన్యాత్ములై రట్టి తపసిదిట్ట
జనకరాజర్షి యేజ్ఞానిబోధనము చే
 విజ్ఞుఁడై వెలసె నా విబుధవరుఁడు
సద్బ్రహ్మచర్యదీక్షాదక్షుఁడై యెవ్వఁ
 డలఘుకీర్తిని గాంచె నామహర్షి

సుప్రభాకాంతపతి యెవ్వఁ డాప్రభావుఁ
డమలవిజ్ఞానమూర్తి గృహస్థరత్న
మణి పవిత్రుఁ డష్టావక్రుఁ డామహర్షి
కంజలి ఘటించి స్మరియింతు నహరహంబు.

పూర్వ మొకప్పు డేకపాదుఁ డనుసద్బ్రాహ్మణుఁ డొకఁడు నిరంతరతపోనిరతుఁడై యుండెను. అతనికి సుజాతయను నుత్తమకన్య భార్యయై సకలోపచారములు సంతోషముతోఁ జేయుచుండెడిది. సద్గృహస్థుఁడు వేదవేత్త యగు నేకపాదుని కడకు వటువరులు వచ్చి యధ్యయన మర్థించిరి. ఏకపాదుఁడు వటువులయధ్యాపనము కూడఁ దపోంగముగా భావించి శిష్యులచే నెల్లవేళల వల్లింపఁ జేయుచుండెను.

## ఏకపాదుఁ డష్టావక్రుని శపించుట

ఇటు లుండఁ గొంతకాలమునకు భర్తయనుగ్రహమున సుజాత గర్భము ధరించెను. ఏకపాదుఁడు నిరంతరశిష్యాధ్యాపనముతోఁ గాలముఁ గడపుచుండెను. సుజాతగర్భమున నున్న బాలునికి గర్భమున నుండఁగనే పుణ్యవశమున వేదము లలవడెను. ఒకనాఁ డాతఁడు మాతృగర్భము నుండియే స్వరము తప్పిన దని తండ్రికిఁ జెప్పెను. మఱియొకపర్యాయ మాతఁడు "నిద్రాహారములైన లేకుండ శిష్యుల నెల్లపుడును జదివింతు వేల? మాతృగర్భమున నుండి యొక్కసారి వినఁగానే నాకు వేదములు వచ్చినవి. వారి నింతగా బాధించు చుందు వేల ?" యని తండ్రి నడిగెను. అంత నేకపాదుఁడు తనకు జన్మించు కుమారుఁడు దివ్యమహిమోపేతుఁ డని గ్రహించి యానందించెను. కాని యింతబాల్యముననే తండ్రికిఁ దప్పు దిద్దుటయు నధ్యయనమునుగూర్చి వక్రముగఁ బల్కుటయు శిక్షార్హములే కాని క్షమార్హములు గా వనియు శిక్షింపవలసినపుడు పుత్రభావ మడ్డు రారాదనియు నెంచి యాతని నెనిమిదివంకరలతోఁ

బుట్టు మని శపించెను. పిమ్మట నాబాలుఁ డగ్నికల్పుఁడై తల్లి కడుపునఁ బెరుఁగుచుండెను.

## ఏకపాదుఁడు జలమజ్జితుఁడగుట

ఒకనాఁడు సుజాత ప్రసవభారమునకు వెఱచి ఘృత తైలధాన్యములఁ దెం డని యేకపాదునిఁ గోరెను. ఏకపాదుఁడు నట్లే యని ధనార్థియై జనకచక్రవర్తిపాలికిఁ బోయెను. అప్పుడు జనకచక్రవర్తి వరుణపుత్త్రుఁ డగువందితో వాదము చేసి గెలిచిన వారికి సమస్తము నిచ్చెద ననియు నోటుపడినవారు జలమజ్జితులై యుండవలె ననియుఁ బ్రకటించెను. ఏకపాదుఁడు విజయకాంక్షియై వందితో వాదమునకు దిగి దైవవశమున నోటువడి జలమజ్జితుఁడై యుండెను.

## అష్టావక్రుఁ డుదయించి తండ్రిని రక్షించుట

ఇట్లుండఁగా సుజాత యింటియొద్దఁ బుత్త్రినిఁ గనెను. ఆపుత్త్రుఁడు తండ్రిశాపకారణమున నెనిమిదివంకరలతోఁ బుట్టి యష్టావక్రనాముఁ డయ్యెను. ఆసమయముననే సుజాత తల్లి- ఉద్దాలకునిభార్య- కూడ నొకపుత్త్రునిఁ గనెను. ఆతఁడు శ్వేతకేతుఁ డనునామమునఁ బెరుఁగుచుండెను. మాతులభాగినేయు లగునష్టావక్ర శ్వేతకేతు లిరువురును బాల్యమునుండియు నుద్దాలకునికడ నేకసంథాగ్రాహులై చదివి యధ్యయనపారులైరి. ఉద్దాలకుఁడు తండ్రి యనియు శ్వేతకేతుఁడు భ్రాత యనియు నష్టావక్రుఁ డెంచుచుండెను. ఒకనాఁడు శ్వేతకేతుఁ డష్టావక్రుని "మీతండ్రికడకుఁ బొ"మ్మని కసరెను. అట్లవమానింపఁబడి తల్లి యగుసుజాతకడ కేఁగి యష్టావక్రుఁడు తనతండ్రి

సంగతిఁ జెప్పు మనెను. సుజాత యేకపాదుఁడు జనకనృపాలు నగరమున కేఁగి వందితోడి వాదమున నోడి జలమజ్జితుఁ డగుటఁ దెల్పెను.

అష్టావక్రుఁడు వెంటనే మాతులుఁ డగు శ్వేతకేతునిఁ దీసికొనిపోయి జనకమహారాజు నాస్థానమునఁ బ్రవేశింపఁజూడ విద్వాంసు లగువృద్ధులే కాని బాలు రట రాఁ గూడ దని ద్వారపాలకుఁడు నివారించెను. అష్టావక్రుఁ డట ద్వారపాలునితో సంవాదము చేసి "జ్ఞానము కలిగినవాఁడే వృద్ధుఁడు కాని వయోవృద్ధు వృద్ధా? బాలుఁడైనను జ్ఞాని వృద్ధసమానుఁ డగుట మీరాజు నన్ను నివారింపఁడు. మఱియు, నంధుని తోవకును, బధిరునిమార్గమునకును, స్త్రీపథమునకును, రాజు వర్త్మమునకును, బ్రాహ్మణునియధ్వమునకును, ప్రతిబంధకము కలిగింపరా"దని యాతఁడు శాస్త్రసమ్మతముగ వాదించెను. ఆద్వారపాలుఁ డాతని శక్తిసామర్థ్యముల కచ్చెరువంది ప్రవేశ మొసఁగెను. జనకునిపాలి కేఁగి యష్టావక్రుఁడు వందితో వాదింతు ననెను. జనకుఁ డా చిఱుతవానిసాహసమునకు మెచ్చియు "నీవంటిబాలుఁడా వందిని గెల్చుట?" యని హేళనము చేసెను. అష్టావక్రుఁడు జనకునితో సంవాదము చేసి తనశక్తిఁ గొంత యాతనికిఁ జూపెను. జనకుఁ డాశ్చర్యపడి వందితో వాదింప నాతని కనుజ్ఞ నిచ్చెను. నాఁడు మహాసభాంగణమున బ్రాహ్మణశ్రేష్ఠులనడుమ నష్టావక్రుఁడు వాదమున వందిని గెలిగొనెను. "అగ్ని యొక్కఁడే ప్రజ్వలించు; సూర్యుఁ డొక్కఁడే ప్రకాశించు; శివుఁ డొక్కఁడే సర్వవ్యాపి"యని వంది ప్రారంభించెను. "ఇంద్రాగ్ను లిద్దఱు మిత్రులు నారదపర్వతు లిద్దఱు

దేవతలు; ఆశ్వినేయు లిద్దఱు రూపవంతులు. భార్యాభర్త లిద్దఱు సంసారమూలము"లని యష్టావక్రుఁడు బదులుచెప్పెను. ఈప్రకారమిరువురు ద్వాదశసంఖ్యవఱకు సమానముగా వాదించుచువచ్చిరి. కాని, యష్టావక్రుఁడింకను వాదించి వంది నోడించెను. వెంటనే జనకచక్రవర్తి యష్టావక్రు నభినందించి యాజ్ఞాపింపుమనెను. అష్టావక్రుఁడు తనతండ్రిని నాతనిచే జలమజ్జితులై యున్న బ్రాహ్మణులను విడిపించి వందిని జలమజ్జితునిఁ జేయింపుమనెను. వంది తనతండ్రియగు వరుణదేవునియజ్ఞమునకై యామిషచే బ్రాహ్మణప్రవరుల నటకుఁ బంపితినే కాని బాధింపలేదని చెప్పి యష్టావక్రు నభినందించి వెడలిపోయెను. నాఁటినుండి యష్టావక్రునికీర్తి చంద్రిక లెల్లెడల వ్యాపింపఁజొచ్చెను.

జనకచక్రవర్తి యష్టావక్రుని నేకపాదుని గడుంగడు బూజించి యష్టావక్రునినుండి యద్వైతవేదాంతరహస్యములఁ నెల్లగ్రహించెను. అష్టావక్రజనకుల యీసంవాదమే యష్టావక్రసంహితయై యద్వైతవేదాంతరహస్యముల నద్భుతముగా వెల్లడించుచున్నది. అంత జనకుఁ డాత్మానందమును జూఱగొని యష్టావక్రుని సమ్మానించి వీడ్కొలిపెను.

## అష్టావక్రుఁడు నిర్వక్రుఁడై సుందరుఁ డగుట

ఏకపాదుఁడు కుమారుని గొప్పతనమునకును బితృభక్తికిని సంతసించి యష్టావక్రునిఁ జూచి "నాయనా! నీయీ యంగవైకల్యమునకుఁ గారకుఁడను నేను. నీ పితృభక్తి, పాండిత్యమాహాత్మ్యములకు సంతసించితిని. నీవు వెంటనే పోయి సమంగానదియందు సుస్నాతుఁడవై యింటికి ర"మ్మని చెప్పి తా నింటికి వెడలిపోయెను. అష్టావక్రుఁడు జనకు నానతిని దిన్నఁగా

సమంగానదీజలముల కేఁగి యందు మునిఁగి తేలఁగానే తన దేహావక్రితలు నశించుటఁ గని యాశ్చర్యపడి యది తనతండ్రి మాహాత్మ్య మని యేకపాదు నెంతయు స్తుతించెను. అతఁ డంత దివ్యసుందరవిగ్రహుఁడై గృహమున కేఁగి తలిదండ్రుల కమితానందముఁ జేకూర్చి వారికి శుశ్రూష చేయుచు ఘనతరతపోవృత్తి యం దుండెను.*

అష్టావక్రుని వివాహవృత్తాంతము.

కొంతకాలమున కేకపాదుఁడు కుమారునిఁ బిలిచి "నాయనా! సద్విద్యాపరిగ్రహమున, ననుపమానబ్రహ్మచర్యాశ్రమమున, నీయశోలతిక మనోహరమై వ్యాపించినది. నీ విఁక గృహస్థాశ్రమమును స్వీకరించి యుత్తమగార్హస్థ్య ధర్మనిర్వహణమున నాకును మీతల్లికిని ముదము చేకూర్పు" మని వచించెను. అష్టావక్రుఁడు తండ్రియాజ్ఞ శిరసావహించి వివాహమాడఁ గృతనిశ్చయుఁ డాయెను. అంత నష్టావక్రుఁడు దనకుఁ దగినకన్నియ యెవతె యని యాలోచించి వదాన్యమహర్షి తనూజ యగుసుప్రభను వివాహము గాఁదలఁచి వదాన్యునాశ్రమమునకుఁ బోయెను.

వదాన్యుఁ డష్టావక్రునికీర్తిచంద్రికలు గాంచినవాఁ డయ్యు నాతని నింకను బరీక్షింపఁ గోరియుండెను. తనకడకు రాఁగానే యష్టావక్రు నాతఁడు గారవించి వచ్చినపని యడిగెను. అష్టావక్రుఁడు సుప్రభను వివాహ మొనరింపఁ గోరెను. వదాన్యుఁ డంగీకరించెను. కాని, యాతనిఁ బరీక్షింపఁ గోరి "అష్టావక్రా! నీవంటియుత్తమునకుఁ బిల్ల నిచ్చుటకంటెను

* భారతము. వనపర్వము.

నాకుఁ గావలసిన దేమున్నది ? కాని, నాకూఁతును వివాహ మాడఁగోరువాఁడు ముందుగా నుత్తరదిశకుఁ బోయి కుబే రునినగరమును దాఁటి హిమగిరిపై నున్న పార్వతీపరమేశ్వ రులఁ బూజించి మఱియు నుత్తరమునకుఁ బోఁగాఁ గాననగు నీపవనముఁ గని యందు సువర్ణనిర్మిత మైనసౌధములతో నున్న నగరమును బరిపాలించురమణిని జూచి యామె యాశీర్వచనమంది రావలయును. అప్పుడు సంతోషముతో నాకొమార్తె యగుసుప్రభ నిచ్చి వివాహము చేయుదు" నని చెప్పెను. ఇది యెంతపని యని పలికి యష్టావక్రుఁ డాపనికై బయలుదేఱి పోయెను.

అష్టావక్రుఁడు పర్వతములను నదులను దాఁటుచుఁ బయ నించుచుండెను. ప్రకృతిరామణీయకముఁ దిలకించు నతఁడు నిజమానసబంభరమును బరమేశ్వరుని పాదారవిందములపై వ్రాలఁజేయుచు బాహుదానదిఁ గాంచి యం దవగాహితుఁడై యొకదిన మందుఁ గడపి యలకాపురమార్గమును బట్టెను. కుబేరుఁ డష్టావక్రునిరాక యెఱిఁగి వాని కెదురువచ్చి సమాద రముతోఁ బుష్పకారూఢునిఁ జేసి యలకానగరమునకుఁ దీసి కొనిపోయెను. అచ్చట బహురమణీయ స్వర్ణసౌధము నష్టా వక్రునకు విడిదిగా నిచ్చి రంభాద్యప్సరోభామల నాతనికిఁ బరి చారికలఁగా నేర్పఱిచెను. వా రనుదినమును నృత్యగీతవాద్య ములచే నాతని నానందింపఁజేయుచుండిరి. కాని, యష్టావక్రుఁ డేమాత్రమును వారిమోహవాగురలకు లోనుగాక యొక్క వత్సర మలకాపురమునఁ గడపెను. కుబేరుఁడు నాతనిఁ బలు విధములఁ గీర్తించి వీడుకొలిపెను. అంత నష్టావక్రుఁడు

హిమాలయ సమీపమునకుఁ బోయి యటఁ గాన నగు మహర్షులకు నమస్కరించుచు నానందతన్మయుఁడై హిమశైల తట మధిష్ఠించెను. అందుఁ బార్వతీపరమేశ్వరులకుఁ బ్రమథ గణములకుఁ బలువిధములఁ బూజ లర్పించి సర్వేశ్వరస్తోత్రి ముఖాఁ గొంతకాల మటఁ గడపెను. పిమ్మట నింకను నుత్తరమున కేఁగ వదాన్యుఁడు చెప్పినకడిమి లేమాత్రికుల యడవి జొచ్చెను. అం దాతఁడు ప్రవేశింపఁగా దివ్యసుందర స్త్రీవిలసితము లగు హేమసౌధములు గోచరించెను. వానిని జూచి యాశ్చర్య మందుచు నస్తావకుఁడు లోనికిఁ బోయి యటఁ గానవచ్చిన నారీజనానీకమునకు వశుఁడు గాక వారల రాజ్ఞిఁ జూపు మనెను. అంత వారు భవనాంతర్భాగమున కాతనిఁ గొనిపోయి దివ్యదీధితిఁబో నొప్పు నొకమదవతిఁ జూపిరి. ఆమె యనంతవిలాసహాసములతో నస్తావక్రుని నాహ్వా నించి యర్ఘ్యపాద్యాదు లొసఁగి యాదరించెను. పిమ్మట రాత్రిపడఁగా నాతని నిష్టమృష్టాన్నముల సంతృప్తునిఁ జేసి యాతఁడు నిద్రించుతఱి నాతనిశయ్యఁ జేరి యామె యాతనిఁ గవయఁగోరెను. తా నస్ఖలితబ్రహ్మచారి ననియుఁ బరసతి నపేక్షించుట పాపహేతు వనియుఁ జెప్పి నాఁటి కాతఁడు తప్పించుకొనెను. కాని మఱునాఁడు మరల నాతని కామె యభ్యంగనాదు లొసర్చి షడ్రసోపేతముగా నధికాదరమున విందుచేసెను. మమకారరహితుఁడై యాతఁ డన్నిటి కంగీక రించెను. కాని, యా రాత్రి తిరిగి యాతనిఁ దన్నుఁ గలియ వలయునని యామె బలవంతముచేసెను. ఆమె యెన్ని చెప్పి నను వినక యాతఁడు స్త్రీలకు స్వాతంత్ర్యము లే దనియు

బాల్యమునఁ దండ్రి యౌవనమున భర్త వార్ధక్యమున సుతుఁడు రక్షించును గాని స్త్రీ యెన్నఁడు స్వతంత్రించి యే కార్యమును జేయరా దని యుపదేశించెను. కాని, యామె మన్మథబాధావివరణము చేయుచుఁ దనశక్తి ప్రభావముచే ననుక్షణాతిశయసౌందర్యశోభిత యయ్యెను ఐన, నష్టావక్రుఁ డేమాత్రమును జలింపక స్థిరప్రజ్ఞుఁడై యుండెను. అప్పు డామె స్వస్వరూపమునఁ గాననై తాను వదాన్యుని ప్రార్థనమున నష్టావక్రుఁ బరీక్షింప నంతయుఁ బన్నినయ దిశాంగన నని చెప్పి యాతనిదీక్షావిజయమున కెంతయుత్తర సభినందించి సుప్రభాకన్యను వివాహమై త్రిభువనవినుతముగా గృహస్థాశ్రమమును నిర్వహింపు మని యాశీర్వదించెను. అష్టావక్రుఁ డట్లు పరీక్షావిజయ మంది వదాన్యునింటికేఁగి యావద్వృత్తాంతము నివేదించెను. వదాన్యుఁడు నానందించి వివాహముహూర్త మేర్పఱిచెను. ఏకపాదుఁడు సుజాతయుఁ గుమారుని విజయమున కభినందించి యానందముతో సబంధుమిత్రపరివారముగా నష్టావక్రుని వివాహమునకుఁ దరలివచ్చిరి. సుప్రభాష్టావక్రులవివాహము పరమవైభవముతోఁ జరిగెను. కుబేరాదులు వివాహము చూడవచ్చిరి. దేవతలు వధూవరులపైఁ బుష్పవృష్టిఁ గురిసిరి. కిన్నరు లాకసమున నాట్యమాడిరి. బ్రహ్మర్షులు వధూవరుల నాశీర్వదించిరి. అష్టావక్రుఁడు పిమ్మట సుప్రభాసహితుఁడై యాశ్రమమున కేఁగి తపోవృత్తి నుండెను.*

* భారతము. అనుశాసనికము

## అష్టావక్రుఁడు రంభాదులను శపించుట

అష్టావక్రమహర్షి గృహస్థాశ్రమము నద్వితీయముగా నాదర్శప్రాయముగాఁ గడపి సుప్రభాదేవిమూలమున నుత్తమ మగుపుత్రసంపదఁ బడసెను. తరువాత, నాతఁడు జలమధ్యముఁ జేరి ఘోరతపస్సు చేయుచుండెను. ఒకనాఁడు రంభాద్యప్సరస లాతనికడకు వచ్చి నమస్కరించిరి. "మీరేల వచ్చితి"రని వారి నాతఁ డడిగెను. "మానృత్తగీతములను దాము విని చిరకాల మైనది. ఒకసారి తమకుఁ జూపి మెప్పుపొంద వచ్చితి" మని వా రనిరి. అట్లైనఁ బ్రదర్శింపుఁ డని యష్టావక్రుఁడు జలములోనే కూర్చుండెను. రంభాదు లద్భుతముగాఁ దమ నైపుణ్యముఁ జూపిరి. అందుల కష్టావక్రుఁ డానందించి మీ కేమి కావలెనో కోరుకొం డనెను. అంత వారు విష్ణుమూర్తితోడి సంభోగము కావలె నని కోరిరి. అష్టావక్రుఁ డాలోచించి శ్రీవిష్ణుమూర్తి కృష్ణావతారముఁ దాల్చినపుడు మీరు గోపికలై జనింతురు. అప్పుడు మీకోరిక సిద్ధించును. పొం"డని చెప్పి బయటకు వచ్చెను. ఆతనియాకారముఁ జూచి రంభాదులు వెంటనే నవ్విరి. అష్టావక్రుఁడు వారి యవినయమునకు గర్వమునకు నసహ్యించుకొని "మీకోరిక సిద్ధింప వర మిచ్చిన నన్నుఁజూచియే మీరు నవ్వితిరి. కాన, మీరు శ్రీకృష్ణునిపరోక్షమున బోయవాండ్రచేఁ జుట్టుముట్టఁబడి ఘోరావమానముల నందుదురుగాక" అని శపించి యాశ్రమమున కేఁగెను.*

---

* విష్ణుపురాణము.

## అష్టావక్రుఁడు భగీరథుని దీవించుట

అష్టావక్రమహర్షి ఘోరతపఃకార్శ్యముచే దేహజవసత్త్వములఁ గోల్పోయి యస్థిపంజరము మాత్రము మిగిలినదా యనునట్లుండెను. ఈస్థితిలో నొకనాఁ డష్టావక్రుఁ డొకచోటికిఁ బోవుచుండెను. దారిలో భగీరథుఁ డితని కెదురువచ్చెను. సగరపుత్త్రులు కపిలమహర్షి కనుమంటచే భస్మీభూతులై పోవ వారిభార్యలు నారాయణు నారాధించి "వంశోద్ధారకుఁ డగుసత్పుత్త్రు నీయక యే భర్తలు చనిపోయిరి. ఇఁక మాగతి యే" మని నారాయణుఁడు ప్రత్యక్షమైనపుడు డడిగిరి. విష్ణుమూర్తి వారిపై జాలిగొని "కాంతలారా! మీరు భర్తృవిహీన లైనను వైధవ్యదోషము మీకుఁ గలుగకుండున ట్లనుగ్రహించితిని. మీకు నుత్తమోత్తముఁ డగుకుమారుఁ డుదయించు" నని యొక యుపాయము చెప్పి యంతర్హితుఁ డయ్యెను. వా రట్లు చేయఁగ భగీరథుఁడు జన్మించెను. కాని, యాతఁడు శుక్రము లేకయే జన్మించినకతమున బాల్యమునుండియు నర్భకుఁడై పడుచు లేచుచు నుండువాఁడు. ఈభగీరథునిఁ గాంచి యష్టావక్రుఁడు దనకృశశరీరమును గాంచి యాతఁ డపహాసము చేయుచుండె నని భావించెను. కాని, స్థిరముగా నిశ్చయము చేసికొననివాఁ డగుట నాతఁ డపహాసమున కట్లు తూలుచు నడచుచున్నచో వెంటనే భస్మ మగునట్లును గానినాఁడు దృఢశరీరుఁడై సుందరాకారుఁ డగునట్లును శపించెను. వెంటనే యాశాపము భగీరథునికి వరప్రసాదము కాఁగా భగీరథుఁడు దృఢగాత్రుఁడై సుందరాకారుఁడయ్యెను. అష్టా

ఎఱుఁ డది చూచి యోగదృష్టివలన నాతని జన్మాదుల నెఱిఁగి యాతఁడు గంగను భూమికిఁ దీసికొని వచ్చి యాతని పితృపాదులను స్వర్గమునకుఁ బంపు ననియు నాఁడు మొదలాతఁ డమలకీర్తి గడించు ననియు వానితోఁ జెప్పి యాశీర్వదించి తన దారిని బోయెను.

## అష్టావక్రుని పూర్వజన్మకథ

అష్టావక్రమహర్షి యనేకసంవత్సరములు పుష్కర తీర్థమునను మాల్యవంతమునను బరమవైష్ణవుఁడై పరమ జ్ఞానియై మహాతపస్సు చేసెను. పిమ్మట నొకనాఁడు శ్రీకృష్ణుఁడు రాధాదిభార్యలు, బలరామప్రభృతులుఁ గూడ రాఁగా బృందావనమున విహరించుచు జలక్రీడలఁ దనిసి యొకమఱ్ఱిచెట్టుక్రిందఁ గూరుచుండి సరససల్లాపము లాడుచుండఁగా, నష్టావక్రమహర్షి వచ్చి శ్రీకృష్ణునకు సాష్టాంగ నమస్కారము లొనర్చి యాశ్చర్యదత్తమగు స్తోత్రమున నిట్లని కీర్తించెను.

"క. గుణబీజ గుణాత్మక ని
ర్గుణగుణి బీజాప్రమేయ గుణనాథ మహా
గుణశోభిత గుణరూపక
గుణనిరాధారదేవ గుణివరవినుతా.

క. సిద్ధేశ సిద్ధరూపక
సిద్ధిప్రద సిద్ధిబీజ సిద్ధాధారా
సిద్ధస్వరూప కేవల
సిద్ధాచార్యవర నిన్నుఁజేరి భజింతున్.

క. వేదజ్ఞ వేదబీజక
వేదాత్మక వేదవేద్య వేదాధారా
వేదాతీత గుణాత్మక
వేదజనక నిన్ను భక్తి వినుతింతు నొగిన్.

క. సర్వేశ సర్వరూపక
సర్వోత్తమ సర్వబీజ సర్వాధారా
సర్వజ్ఞ సర్వవందిత
సర్వాతీత నిను భక్తి సన్నుతిచేతున్.

క. ప్రకృతీశ ప్రకృతి వందిత
ప్రకృతి పురుషరూప ప్రాజ్ఞ ప్రకృతివిదూరా
ప్రకృతి తరుబీజ కేశవ
ప్రకృతిస్థిర నిన్ను భక్తిఁ బ్రణుతింతు మదిన్.

క. సృష్టీశ సృష్టికారణ
సృష్టి స్థిత్యంతబీజ సృష్ట్యాధారా
సృష్టి విరాట్తరు బీజక
సృష్టీశ్వరజనక నిన్ను సేవింతు మదిన్.

సీ. ప్రకృతియు మూలంబు బ్రహ్మేశవిష్ణువుల్
శాఖలు సురలుపశాఖ లఖిల
తపములు పుష్పముల్ విపులసంసారాది
కంబులు ఫలసమూహంబు లగుచుఁ
దనరు బ్రహ్మాండపాదపమున కధి నా
ధారుఁడ వటునిరాధారుఁడవు
కడిమి సర్వాధారకుఁడవు తేజోరూపుఁ
డవును నిరాకారుఁ డవు మహాత్మ
సర్వమయుఁడవు మఱియుఁ స్వేచ్ఛామయుఁడవు
ముక్తిమయుఁడవు నఖిలముముక్షులకును
ముక్తిదాయకుఁడవు జగన్మాత నీవు
నీకు నతులాచరించెద నీరజాక్ష!

[బ్రహ్మవైవర్తము-(శ్రీకృష్ణఖండము]

పిదప, అష్టావక్రుఁడాపరమాత్మునియందు పవిత్రమగు తనమనస్సు లయ మొనర్చి శ్రీకృష్ణుని పాదములపైఁ బడి మరణించెను. వెంటనే యాతని తేజము దివ్యరూపమును ధరించి పుష్పకవిమాన మధిష్ఠించి గోలోకమున కేఁగి ముక్తి నందెను. అప్పుడు శ్రీకృష్ణుఁడాతని దేహమునకు దహనాదికృత్యములు స్వయముగా నొనర్చి యాతని కశ్రుతర్పణము లొసఁగి క్రియాకలాపములు పూర్తి చేసెను. ఇది యంతయుఁ జూచి యాశ్చర్య నిమగ్నయైన రాధ యాతనివృత్తాంతముఁ దెలుపు మని శ్రీకృష్ణునిఁ బ్రార్థించెను.

అప్పుడు శ్రీకృష్ణుఁడు వారందఱు సావధానమనస్కులై వినుచుండఁగా నష్టావక్రమహర్షిని గుఱించి యిట్లు చెప్పెను; "ఈమహర్షి యష్టావక్రుఁ డనునాపరమభక్తుఁడు. జితేంద్రియుఁడు. మహాతపస్సంపన్నుఁడు. బ్రహ్మవంశస్థుఁడు. తొల్లి సృష్ట్యాదిని నానాభికమలమునుండి బ్రహ్మను బుట్టించి విశ్వసృష్టి చేయ నియోగించితిని. ఆతఁడు సనకసనందనసనత్కుమారసనాతననామధేయు లగునలువురుకుమారులఁ దన మాననమునుండి సృజించి వారిని సృష్టింపుఁ డని కోరెను. వారు స్త్రీసంపర్క మొల్లక పరబ్రహ్మానుసంధానమున నిత్యతపస్వు లైరి. తరువాత వసిష్ఠాంగిరోమరీచి ప్రచేతసులు మున్నగు మానసపుత్త్రులఁ బుట్టించి వారిని జగత్సృష్టికై యజుఁడు నియమించెను. వా రందఱు మహాతపస్సంపన్నులై తండ్రి పనుపున వివాహమాడి పలువురపుత్త్రులఁ బడసిరి. అందుఁ బ్రచేతునకుఁ గొంతకాలమున కసితుఁ డనుకుమారుఁడు

జన్మించి విష్ణుభక్తుఁడై తపోవృత్తి నుండెను. కొంతకాలమున కాతఁడును వివాహితుఁడై తనసతికి సంతానము కలుగనికారణమున విచారించుచుండఁగా నాకాశవాణి యీశ్వరునిగుఱించి తపింపు మని ప్రబోధించెను. అసితుఁడు నీశ్వరునిగుఱించి మహాతపము చేయ నాతఁడు ప్రత్యక్షమై రాధామంత్ర మనుస్తోత్రరాజము నుపదేశించి యంతర్హితుఁడయ్యెను. అసితుఁ డేకాంతమునఁ జిరకాల మామంత్రము జపించి రాధాకారుణ్యమునఁ దనభార్యయం దొకపుత్త్రునిఁ గని దేవలుఁ డని నామకరణము చేసెను. దేవలుఁడును మాలావతి యనురాజకుమారిని వివాహమై సంతానమును బడసి మహావిరాగియై తపోవృత్తి నుండెను. ఆతని తీక్ష్ణతపోబలము త్రిలోకములను వేధింపఁజొచ్చెను. ఆతని తపోభంగమునకై యింద్రుఁడు రంభను బంపెను. ఆమె యెంతప్రయత్నించిన నాతనిహృదయము చలింపదాయెను. అందుచే నామె కోపించి "ఓ దేవలా! నీవు నన్నష్టకష్టములపాలు చేసితివి. నాయభీష్టము దీఱకుండఁ జేసితివి. కావున, నీవు మఱుజన్మమున నష్టావక్రుఁడవై జనింతు" వని శాపమిచ్చెను. అంత నామె వెడలిపోవుచు "దేవలా! నిన్ను నే ననవసరముగ శపించితిని. ఐన, నాశాప మమోఘము. నీ వష్టావక్రుఁడవై జనించియు నీతండ్రికృపవలన దివ్యశరీరుఁడవై మహాజ్ఞానివై ముక్తినందఁ గల" వని రంభ స్వర్లోకమున కేఁగెను. ఆతఁడే యేకపాదసుజాతలకు జన్మించి సమంగానదీస్నానమున దివ్యశరీరియై మహాతపోధనుఁడై నేఁ

డిట్లు ముక్తి నందినాఁ" డని శ్రీకృష్ణుఁ డష్టావక్రుని చరిత్రముఁ జెప్పి యందఱితో నిజగృహమున కేఁగెను. *

అ ష్టా వ క్ర సం హి త

ఇట్లు ప్రత్యక్షముగా శ్రీకృష్ణుని పాదారవిందములఁ బ్రాణములు వీడఁ గనిన యష్టావక్రమహర్షి సుకృతవిశేషము వర్ణనల కందనిది. ఈమహర్షి జనకరాజర్షితోఁ జేసిన వేదాంతవిచారణ మద్వైతవేదాంతసారము నద్భుతముగా వెలిపుచ్చునదై యష్టావక్రసంహిత యనుపేర శాశ్వతమై వెలసినది. ఈయష్టావక్రసంహితయందు ఆత్మోపదేశము, ఆత్మానుభవోల్లాసము, ప్రత్యాక్షేపద్వారోపదేశము, ఆత్మజ్ఞానసంకీర్తనము, లయయోగము, జ్ఞానయోగము, అనుభవపంచకము, బంధమోక్షవ్యవస్థ, నిర్వేదము, ఉపశమము, జ్ఞానము, స్వరూపసంస్థితి, ఆత్మసౌఖ్యానుభూతి, శాంతి, తత్త్వోపదేశము, విశేషోపదేశము, తత్త్వజ్ఞస్వరూపము, శాంతిశతకము, ఆత్మస్థితుని యనుభవము, జీవన్ముక్తి యను నిరువదియధ్యాయములలో నాయావిషయము లద్భుతముగా వివరింపఁబడినవి. ఈసంహిత నిత్యపారాయణయోగ్యము. అష్టావక్రుని బోధామృతమును గ్రోలి జనకరాజర్షి పొందిన యాత్మానంద మనిర్వాచ్యమైనది. ఈసంహితయందలి "ఆకాశవదనంతో౾హం,ఘటవత్ ప్రాకృతం జగత్." "మహోదధిరివాహంస ప్రపంచో వీచిసన్నిభః" "అహంవా సర్వభూతేషు, మున్నగు నద్వైతవేదాంతఘీంకారములు అష్టావక్రమహర్షిని ధన్యాతిధన్యుని జేసివైచినవి.

—oo※oo—

* బ్రహ్మవైవర్తపురాణము-శ్రీకృష్ణఖండము.

ఓం

శ్రీగురుభ్యో నమః

# శ్రీమహర్షి జీవితకథామృతము

## ఋష్యశృంగమహర్షి

స్తుతి

సంగతమైనభక్తిని బ్రశంస యొనర్తు “నధీత వేదవే
దాంగుని సర్వసంయమిముఖాబ్జపతంగుని నిర్జితేంద్రియా
సంగుని లిప్తభూతిలసదంగుని సద్గుణసంగునిన్ వ్రతా
భంగుని సంతతోదితతపఃకృతిరంగుని ఋష్యశృంగునిన్.”

[భాస్కరరామాయణము. బాల. ౫౨]

తొల్లి కశ్యపుఁ డనుమునిచంద్రునకు విభాండకుఁడను కుమారుఁ డుదయించెను. విభాండకుఁడు బాల్యమునుండియు నస్ఖలితబ్రహ్మచర్యదీక్షతోఁ దపము చేయుచుండెను. ఒక్కనాఁ డాతఁ డొక్కమడువున నీళ్లాడుచున్నసమయమున సురుచిర సురూపసుగుణసుందరి యగునూర్వశి యాతనిఁ గానవచ్చి తన విలాసహాసములఁ బ్రదర్శించినంతఁ గామకృతమునఁ బతనమైన యాముని యమోఘవీర్యముతో మిశ్రమైనజలము నొకమనుఁ బెంటి త్రావి గర్భము ధరించెను.

## ఋశ్యశృంగుని జననము

ఈమృగము పూర్వము చిత్రరేఖ యను నొకయప్సరస. ఆమె యింద్రసభలో నాట్యమాడుచుండఁగాఁ గొన్నిలేళ్ళచ్చటకు వచ్చెను. చిత్రరేఖ నేత్రములపై దృష్టి నుంచి యానందించు చున్నయింద్రుని జూడక యామె యాలేళ్ళఁ జూచెను. తన యానందమునకు విశేషభంగము గలిగించిన యాచిత్రరేఖ నింద్రుఁడు మృగివై పుట్టు మని శపించెను. అప్పుడామె శాపవిమోచనోపాయము కోరుకొనఁగా నింద్రుఁడు కనికరించి విభాండకుఁ డనుమహర్షి వీర్యమువలనఁ బుత్త్రునిఁ గనినపిమ్మట శాపవిమోచన మగు నని తెల్పెను. ఆచిత్రరేఖయే మృగియై దాహము తీర్చుకొనుటకు విభాండకుఁడు స్నానము చేయుజలాశయమునకు వచ్చి జలముతోపా టాతనివీర్యమును గ్రోలి చూలా లయ్యెను.

కొంతకాలమున కామృగము మనుష్యరూపము గల యొకపుత్త్రునిఁ గని యరణ్యమున విడిచి తనశాపమోక్షణము కాఁగా నింద్రలోకమున కేఁగెను. ఆబాలుఁడు మనుఁబెంటికి జన్మించినవాఁ డగుట నాతని నొసట నొకశృంగము నుండెను. దానిమూలమున నాతనికి ఋశ్యశృంగుఁ డను నామము కలిగెను. అతఁ డచటఁ బెరుఁగుచుండఁగా నొకనాఁడు విభాండకుఁడు చూచి దివ్యదృష్టివలన నాతఁడు తన పుత్త్రుఁడే యని గ్రహించి వానిని దనయాశ్రమమునకుఁ దీసికొని పోయి పెంచుచుండెను. బాల్యమునుండియు ఋశ్యశృంగుఁడు తండ్రి యాశ్రమము దక్క నన్య మేమియు నెఱుఁగక పరమస్వాధ్యాయవిదుఁడు నద్వితీయ బ్రహ్మచారియు నై ఘోరతపము చేయు

మండెను. ఆతనితపోవి శేషమున కచ్చెరు వందినయింద్రుఁ డాతఁ
డెచ్చట నున్న నచ్చట సువృష్టి కలుగు ననియుఁ బ్రజ లాధి
వ్యాధిరహితులై సుఖ మందు రనియు ననుగ్రహించెను.

## రోమపాదుని వృత్తాంతము

ఇట్లుండఁగా నంగ దేశమును బరిపాలించు రోమపాదుఁ
డనురాజునకు సంతానము లేకపోయెను. ఈతఁడు దశరథుని
మిత్రుఁడు. ఒకనాఁ డతఁ డయోధ్య కరుదెంచి దశరథునకు
సురభియనుగ్రహమునఁ గలిగినశాంత యను కూఁతుఁ గాంచి
ముద్దాడి యామెను బెం పిమ్మని యడిగెను. కాని, దశరథున
కును బిడ్డలు లేనికారణమున నాతఁ డంగీకరింపఁ డాయెను.
అంత దగ్గఱ నున్న వసిష్ఠమహర్షి త్రికాలవేది యగుట దశర
థునితో శాంతను రోమపాదున కిమ్మనియు నామెవలనఁ
ద్వరలో నిరువురకును బుత్రసంతానము కలుగు ననియుఁ
జెప్పెను. అందులకు వా రుభయులు నానందించిరి. సగ
కాలుమాసములు దశరథునింట నాలుమాసములు రోమ
పాదునింట శాంత యుండున ట్లంగీకరించి రోమపాదుఁడు
శాంతను దీసికొని యంగదేశమున కేఁగెను. తరువాత
నాతఁడు పుత్త్రికామియై బ్రాహ్మణుల కనేక దానధర్మములు
చేయుచుండెను. ఒకనాఁ డొక బ్రాహ్మణుఁడు బహుధనధాన్య
ములు గైకొని తిరిగి తనకుమారునితో వచ్చి యా బాలుని కొక
గోవు నిమ్మని రోమపాదునిఁ గోరెను. అంత నాతఁడు బ్రాహ్మ
ణులు దురాశాపరు లని నిందించెను. ఒక్కగోవు నిచ్చుటకు
బదులు సద్ద్విజజాతిని బుద్ధిపూర్వకముగాఁ దెగడిన యారాజును
దండించఁదలఁచి యిరువురును గోపించి యంగరాజ్యము దుర్భిక్షమై

యనావృష్టిదోష మందుఁ గాక యని శపించి యారాజ్యము నుండి వెడలిపోయిరి. తరువాత రోమపాదుఁడు పశ్చాత్తప్తుఁడై గత్యంతర మే మని మిగిలినబ్రాహ్మణుల నడుగఁగా వారు ఋశ్యశృంగునిచరిత్రము వినిపించి యాతఁ డిటకు వచ్చిన నీ యవగ్రహదోషము వాయు నని చెప్పిరి. పిమ్మట రోమపాదుఁ డాబ్రాహ్మణులను బూజించి వారి యనుమతిని గొందఱు వారాంగనలను సర్వకలాపూర్ణ యను నామెయాధిపత్యమున ఋశ్యశృంగునిఁ దోడ్కొని రాఁ బంపెను.

## సర్వకలాపూర్ణాదివేశ్యలు ఋష్యశృంగుని గొనిపోవుట

నవయౌవనలు నతివిలాసినులు నగు నావారాంగనలు విభాండకుఁ డాశ్రమమున లేనితరుణమున ఋశ్యశృంగునిపాలి కరుదెంచిరి. స్త్రీముఖము చూచి యెఱుఁగని ఋశ్యశృంగుఁడు వారలు మునికుమారు లని యెంచి యర్ఘ్యపాద్యాదు లీయ వారు స్వీకరింపక తాము తెచ్చిన దివ్యగంధ మాల్యములు సరసభక్ష్యములు విచిత్రవస్త్రములు నిచ్చిరి. వారు పిమ్మటఁ దమనృత్యగీతముల నాతని నానందింపఁజేసి వానిఁ గౌఁగిలింతల నొడలిపుడికిళ్ల మోసపుచ్చి తమయాశ్రమము సమీపముననే యున్న దనియు నందుఁ దపముచేయ రమ్మనియు నాహ్వానించిరి. పిమ్మట వారు విభాండకునకు భయ మొంది నాఁటికి వెడలిపోయిరి. ఋశ్యశృంగుఁడు తండ్రిచెప్పిన యగ్నిహోత్రము వేల్వ మఱచి వారియొప్పునఁ దగిలి వారితోఁ దపముచేయ నాసక్తుఁడై యుండెను. ఇంతలో విభాండకుఁడు వచ్చి సుతు నగ్నిహోత్రము వేల్వకుండుటకుఁ గారణ మడిగెను. ఆతఁ డద్భుత సుందరాకారు లగుముని బాలురు వచ్చి రనియు వారు కట్టినచీర

లతిమృదులము లనియు, వారిశరీరములు రమ్యసౌరభయుతము లనియు వారి కలకూజితము లానందప్రదము లనియు నం దొక మునిబాలుఁడు తన్నుఁ గౌఁగిలించుకొని నిజాస్య మాసన్నము చేసి యొకమృదుమధురశబ్దము చేసె ననియుఁ జెప్పి వారితోఁ దపము చేయుట కిష్టపడియుంటి నని పలికెను. విభాండకుఁ డవి రాక్షసమాయ లనియు వారిదానములు వర్జనీయము లనియుఁ బ్రబోధించెను.

మఱునాఁడు విభాండకుఁ డెప్పటియట్ల వన్యఫలముల కరిగినవెంటనే వేశ్యాంగన లరుదెంచి ఋశ్యశృంగుని డాయు డాతఁ డమితానందము నంది వారితో వారివనమున కేఁగు టెర నంగీకరించెను. వారును దమకోరిక యీడేఱినందుల కానందభరితలై మచ్చికతోడి కౌఁగిలింతలతోడను మేలము లగుముద్దులతోడను నాముగ్ధుఁగొని నంగదేశమునకుఁ దోడ్కొని వచ్చిరి. అతఁడు రాజాశ్రయ మగుదివ్యభవన మును జేరఁగనే యాతనినివాసశక్తిచే సర్వజనప్రమోద ముగాఁ గుంభవృష్టి కురిసెను. రోమపాదుఁ డమితానందము నంది శాంత నాతని కిచ్చి వివాహము చేయువెఱ వాలో చించుచు నాతనిఁ బూజించుచుండెను.

## శాంతా ఋశ్యశృంగుల వివాహము.

ఒకనాఁడు ఋశ్యశృంగుఁడు పరమసౌందర్యనిధియు వినయవిద్యావివేకశీలయు నగు శాంతను జూచి యామె యద్వితీయసౌందర్యమునకు ముగ్ధుఁడై రోమపాదునిఁ బిలిచి యామె యెవ రని యడిగెను. రోమపాదు డామె దశరథుని పుత్త్రి యనియు దశరథుఁడు దనమిత్త్రుఁ డగుట నామెను

బెంచుకొనఁ దీసికొని వచ్చితి ననియుఁ జెప్పెను. అంత ఋశ్యశృంగుఁడు దశరథుని వృత్తాంత మడిగెను. రోమపాదుఁ డాతనిచరిత్రమును దెల్పి తొల్లి దశరథుఁడు శాంతాస్వయంవరముఁ జాటుటయుఁ బరశురాముఁ డరుదెంచి యెల్లరురాజులతో దశరథుఁ జంప నుంకించుటయు వసిష్ఠమహర్షి కోరికపై దశరథునికొమార్తైను బ్రాహ్మణునకే యిచ్చి వివాహము చేయవలె నని శాసించి చంపక విడిచి వెడలుటయుఁ జెప్పెను. ఋశ్యశృంగుఁ డానందించి శాంతను వివాహమాడఁ గోరెను. రోమపాదుఁ డానందతరంగముల నోలలాడి వెంటనే వివాహవైభవమును బురమం దెల్లఁ జాటఁ బంపెను. తరువాత మహావైభవముతో శాంతాఋశ్యశృంగుల వివాహము జరిగెను. ఋశ్యశృంగుఁడును రోమపాదునివలన బహువిధసమ్మానముల నందుచుఁ గాంచనమయశయ్యాసనముల శాంతాసహితుఁడై రాజమందిరమునఁ జిరకాలము నివసించెను.

ఈసమయమునందే రోమపాదునకుఁ బుత్త్రోత్పత్తినిమిత్తమై ఋశ్యశృంగుఁ డంగదేశమున నింద్రుని గూర్చి యొక యిష్టి చేయించెను. దానిమూలమున నింద్రుఁడు ప్రీతుఁడై రోమపాదునకుఁ బుత్త్రుఁ డుదయింప వర మిచ్చెను. తరువాత ఋశ్యశృంగుని యాశీర్వచనముచే రోమపాదునకుఁ బుత్త్రసంతానము కలిగెను. నాఁటినుండి రోమపాదుఁడు దినదినవర్ధమాన మగుభక్తితాత్పర్యముతో ఋశ్యశృంగుని శాంతను బూజించుచు వారియడుగులకు మడుఁగు లొత్తుచుండెను. *

* భారతము-అరణ్యపర్వము.

## శాంతా ఋశ్యశృంగు లయోధ్య కేఁగుట.

ఇంతలో నయోధ్యానగరమున దశరథునిచేఁ బుత్త్రి కామేష్టిఁ జేయింపఁ దలఁచి వసిష్ఠమహర్షి సనత్కుమారుఁడు తొల్లి చెప్పినవృత్తాంత మంతయుఁ జెప్పి దశరథునిఁ బ్రేరేచెను. దశరథుఁ డానందముతో వసిష్ఠుని బూజించి చతురంగబలసమేతుఁడై యంగ దేశమునకు ఋశ్యశృంగుని గొనివచ్చుటకు బయలు దేఱెను. సచివులును దాను నంగదేశము సొచ్చి దశరథుఁడు రోమపాదునింటికి కేఁగి దీప్తాగ్నివలెఁ దేజరిల్లుచున్న ఋశ్యశృంగుని దర్శించి యనేకవిధములఁ బూజించెను. రోమపాదుఁడు దశరథు ననేకవిధముల సమ్మానించెను. అంత దశరథుఁడు, శాంతాసహితుఁడై ఋశ్యశృంగుఁడును భార్యాసమేతుఁడై రోమపాదుఁడును దన గృహమునకు విచ్చేయవలయు నని ప్రార్థించెను. శాంతా ఋశ్యశృంగు లంగీకరించిరి. రోమపాదుఁడు తరువాత వచ్చెద నని కృతాలింగనుఁడై దశరథుని శాంతాఋశ్యశృంగులను వీడ్కొలిపి యయోధ్యకుఁ బంపెను.

శాంతాఋశ్యశృంగులతో దశరథుఁ డయోధ్యఁ బ్రవేశించుసరికి నగర మంతయు నద్భుతముగా నలంకరింపఁబడి యుండెను. పురసతులు లాజలు, అక్షతములు దళత్కుసుమములు వారిపైఁ జల్లిరి. నానాజయవాదు లైనజనులు మ్రొక్కిరి. అంతలో రాజప్రాసాదమును సమీపింపఁగానే రాజనిభాననలు మహితరత్నసమాజవిరాజమాననీరాజనరాజితో నెదురువచ్చి వారికి హారతులిచ్చిరి. అంత దశరథుఁడు రథము దిగి ఋశ్యశృంగుని గౌరవముతో మంగళ తూర్యఘోషములతో లోనికిఁ

దీసికొనిపోయెను. పుణ్యస్త్రీలు శాంతాదేవి నంతఃపురమునకుఁ గొనిపోయిరి. కౌసల్యా కైకేయీ సుమిత్రాదు లమితానంద ముతో 'అమ్మా! శాంతా! ఇఁక నీవు మాబిడ్డవు కావు. మాకుఁ బూజనీయ వైనమహర్షి పత్నివి. వందనము లమ్మా' యని మేలమాడిరి. శాంత చిఱునగవుతో వారిని గౌఁగిలించుకొనెను. శాంతాఋశ్యశృంగుల కట ననుక్షణము నధిక పూజలు జరుగు చుండెను.

## ఋశ్యశృంగుఁడు దశరథునిచే నశ్వమేధ పుత్రకామేష్టులఁ జేయించుట

ఇట్లుండఁగా యజ్ఞనిర్వాహణానుకూల మగువసంతకాల మరుదెంచెను. బహుపాదపములతోఁ పాటు దశరథుని మనో వృక్షమును జక్కఁగాఁ జిగిర్చెను. అంత నాతఁడు ఋశ్య శృంగుని జేరఁ బిలిచి పుత్రకామేష్టిచేయు నుద్యమముఁ దెలుపఁగా నాతఁ డంగీకరించెను. పిమ్మట వసిష్ఠమహర్షి యాదరమున దశరథుఁడు సరయూనదీప్రాంతమున నుత్తర ముగా యజ్ఞశాల నిర్మింపించెను. అధ్వరసంభారము లన్నియు వెంటనే సమకూరెను. ఉత్తమోత్తము లగుఋత్విజుల తోడను మహాత్ము లగు మంత్రకోవిదులతోడను యజ్ఞము ప్రారంభ మాయెను. మంత్రు లధిపునానతిని సర్వము నిర్వ హించి యాగాశ్వమును విడిచిరి. సంవత్సరము గడచి తిరిగి వసంత మాసన్నమగుసరికి యజ్ఞాశ్వము సురక్షితముగా వచ్చి చేరెను. అంత దశరథుఁడు గురువరుఁ డగువసిష్ఠునిఁ బూజించి యజ్ఞభారము సమస్తముఁ బూనవలె నని ప్రార్థిం

చెను. వసిష్ఠునియాజ్ఞచే నశిల్పకర్మకులు నుత్తమోత్తములగు బ్రాహ్మణు లిష్టకాసహస్రములు దెచ్చిరి. కుండమండపవేది కాదులు, సత్రాగారములు, కాయమానములు మున్నగున వన్నియు నిర్మింపఁబడెను. జనకమహారాజు కేకయరాజు సింధుదేశవిభుఁడు మున్నగువా రాహూతులై వచ్చిరి. ధరణీసురు లెల్లరు విచ్చేసిరి. అంత వసిష్ఠప్రముఖులును భూసురోత్తములును ఋశ్యశృంగునిఁ బురస్కరించుకొని యజ్ఞకర్మారంభమున విహితక్రమమున నాయశ్వమేధమును సమాప్తినొందించిరి. దశరథుఁ డనేకభూరిదక్షిణల బ్రాహ్మణోత్తముల సంతసింపఁ జేసెను. అంత దశరథుఁడు ఋశ్యశృంగునిఁ జేరి "మహాత్మా! మీదయావిశేషమున నధ్వరము పూర్తియైనది. ఇఁకఁ దాము పుత్త్రకామేష్టిఁ గ్రియమునఁ జేయుఁ" డని ప్రార్థించెను. ఋశ్యశృంగుఁడు నంగీకరించి నానామంత్రపూతముగా నాహుతుల నగ్నికిడుచుఁ బుత్త్రకామేష్టి చేయుచుండ నాపావనహోమాగ్నివలనఁ బ్రాజాపత్యపురుషుఁడు దేవనిర్మితము నారోగ్యవర్ధనమును బుత్త్రోత్పత్తికరమును నగుపాయసము నొకపవిత్రహేమపాత్రమునఁ దెచ్చి దశరథున కొసఁగి యంతర్హితుఁ డయ్యెను. ఋశ్యశృంగుఁడు దశరథునిఁ బ్రియమారఁ బిలిచి యాపాయసము నాతనిభార్యలకుఁ బంచి యిమ్మని చెప్పెను. దశరథుఁడమందానందకందళిత హృదయారవిందుఁడై యాపాయసము కౌసల్యకు సగమును, మిగిలినసగములో సగము సుమిత్రకును మిగిలినదానిలో సగము కైకకును బ్రావ నిచ్చి యవశిష్టమయిన యష్టమాంశమును మరల సుమిత్రకు నీయ దానిని

వారు ముప్పురుఁ బ్రీతిమెయిఁ గొలిరి. దీనిమూలముననే తరువాతఁ గొంతకాలమునకు వారికిఁ గ్రమముగా శ్రీరామ భరతలక్ష్మణశత్రుఘ్ను లుదయించిరి. పరమశోభాయమానమైన యాగము సాంతము కాఁగా ఋష్యశృంగుఁడు శాంతా సహితుఁడై విభాండకుని యాశ్రమమునకుఁ బోయెను. విభాండకుఁడు పుత్రునిజగద్ధితమతి నానాఁడే దివ్యదృష్టిఁ దెలిసికొని యుండెఁ గావునఁ గొమరుని గోడలి నెంతయు నాదరించెను. వసిష్ఠుని కరుంధతివలె, నత్రి కనసూయవలె, నగస్త్యునకు లోపాముద్రవలె శాంతయు ఋష్యశృంగుని సేవించి చతురంగుఁ డనునుత్తమపుత్రునిఁ గనెను. *

## ఋష్యశృంగుని ద్వాదశవార్షికయాగము.

తరువాత ఋష్యశృంగుఁడు కొంతకాలమునకు ద్వాదశవార్షికయజ్ఞము నిర్వర్తించెను. ఆయజ్ఞమునకుఁ జూలాలైన సీతయు నామెప్రియమునకై శ్రీరాముఁడు నతనికై లక్ష్మణుఁడు నుండిపోవుటచే వారుదక్క నందఱును విచ్చేసిరి. శుభయజ్ఞపరిసమాప్తియైనవెనుక నందఱు వెడలిపోయిరి. †

## ఋష్యశృంగస్మృతి

ఋష్యశృంగమహర్షి యొక్కస్మృతి కర్తగాఁ గానవచ్చుచున్నాఁడు. ఆచారాశౌచ శ్రాద్ధ ప్రాయశ్చిత్తములకు మితాక్షరాపరార్కస్మృతి చంద్రిక లీస్మృతినుండి తత్సంబంధశ్లోకముల నుదాహరించినవి. మితాక్షరమున శంఖుని దని పేర్కొనఁబడినయొక శ్లోకమును అపరార్కము ఋష్యశృంగ

---

* రామాయణము. † ఉత్తరరామాయణము.

స్మృతిలోనిదని పేర్కొన్నది.* స్మృతిచంద్రిక "అపి వాససా యజ్ఞోపవీతార్థే కుర్యాత్. తదభావే త్రివృతాసూత్రేణ" అన్నవచనము ఈస్మృతిలోని దని పేర్కొన్నది. సమగ్రమగు స్మృతి యింకను లభింపవలసియున్నది.

ఋశ్యశృంగుఁడు మహోత్తమతపశ్శాలియై శ్రీరామాదుల లోకమునకుఁ బ్రసాదించిన పరమపుణ్యాత్ముఁడు. కావున నాతని నామస్మరణ మతిపవిత్రము.



* "పూర్వనష్టం తు యోభూమి మేకశ్చేదుద్ధరేత్ క్రమాత్
యథాంశంతులభం తేన్యే దత్త్వాంశంతు తురీయకమ్."

ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీమహర్షి జీవిత కథామృతము

## కపిలమహర్షి

### స్తుతి

కపిలమహర్షి రూపమునఁ
గర్దమునకు దేవహూతియం
దపరిమితప్రభావమున
నర్మిలిఁ బుట్టి తరింప వారు సాం
ఖ్యపథము లోకమందుఁ బర
మాత్మననుగ్రహపాత్ర మంచుఁ జూ
పి పయిని భక్తిమార్గమును
బెంపుగఁ జేసినవిష్ణుఁ గొల్చెదన్.

తొల్లి కర్దమప్రజాపతి కృతయుగమున విశ్వసృష్టికై బ్రహ్మచే నియోగింపఁబడి సరస్వతీనదీతీరమున కేఁగి పదివేల దివ్యసంవత్సరములు తపము చేసెను. ఆతఁ డొకనాఁడు జప సమాధి నేకాగ్రచిత్తుఁడై విష్ణుమూర్తిని ధ్యానింపఁగా నాతఁడు ప్రత్యక్షమై దేవహూతివలనఁ దొమ్మండ్రుకూఁతులును దన యంశముచే నొకకుమారుఁడును నాతనికి జన్మించునని వరమిచ్చి యంతర్హితుఁ డయ్యెను. తరువాతఁ గొంత కాలమునకు దేవ

హూతికిఁ గర్దమునివలనఁ గళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతి యను తొమ్మండ్రు కూఁతుం డ్రుద్భవించిరి. పిమ్మటఁ గర్దముఁడు సన్న్యసింప నెంచఁగా దేవహూతి యాతనిపదములకు మ్రొక్కి "దేవా! కూఁతుండ్రకు యుక్తకాలమున వివాహముచేసి యాపై నాకు జ్ఞానోపదేశము చేయఁగల సుకుమారుని దయచేయుఁడు. నేను తరించిన పిమ్మటఁ గాని తాము సన్న్యసింప వల"దని వేదనాభరమునఁ బలికెను. కర్దముఁ డామెగర్భమున నచిరకాలముననే జనార్దనుఁడు సుతుఁడై పుట్టును గాన నాతనిపాదపద్మములు పూజించుచుండు మనియు నాకుమారుఁడే యామెకు సంశయగ్రంథివిచ్ఛేదము చేయు ననియుఁ జెప్పి గృహముననే యుండెను.

## కపిలుని జననము

దేవహూతి భర్తవాక్యానుసారము భగవంతునిఁ బ్రార్థించుచుండఁగాఁ గొంతకాలమునకుఁ గార్దమ మైన తేజమున విష్ణుమూర్తి దేవహూతిగర్భమును బ్రవేశించి కాలక్రమమున దనుజారిశమీతరుకోటరమున వైశ్వానరుఁ డావిర్భవించిన ట్లామెగర్భమునఁ గుమారుఁడై జన్మించెను. అప్పు డాకసమున దేవతూర్యఘోషములు తుములమయ్యెను; దేవతాబృందములు మందారవృష్టిఁ గురిసిరి; గంధర్వకిన్నర గానములు నప్సరోవనితల యాటపాటలు నొప్పెను. పిమ్మట నారాయణుని దర్శించుకొఱకు మరీచిప్రముఖమునిగణసేవితుఁడై చతుర్ముఖుఁడు వచ్చి కపిలుని దర్శించి దేవహూతీ కర్దముల కాతని నెఱింగించి మరీచిని దిగవిడిచి సనకసనందన నారదాదులతో నంతర్హితుఁ డయ్యెను.

## కపిలమహర్షి తండ్రికిఁ గర్తవ్యము బోధించుట

పిమ్మటఁ గర్దమప్రజాపతియుఁ దనదుహితల వివాహ మాడుటకు మహర్షులఁ బిలువఁ బంచి వారు వచ్చినవెంటనే మరీచికిఁ గళను, అత్రిమహర్షి కనసూయను, అంగిరసునకు శ్రద్ధను, పులస్త్యునకు హావిర్భువును, పులహునకు గతిని, క్రతువునకుఁ గ్రియను, భృగువునకు ఖ్యాతిని, వశిష్ఠుం కరుంధతిని, అధర్వునకు శాంతిని నిచ్చి సజకులాచారానుసారముగా మహా వైభవముతో నుద్వాహము లొనర్చి యల్లుండ్రను గూఁతుండ్ర నాశీర్వదించి సంభావనాసంభావితులఁ జేసి వారివారిగృహముల కంపివేసెను. తరువాతఁ గుమారుఁ డగుకపిలమహర్షి నేకాంత మునకుఁ దీసికొనిపోయి వందన మాచరించి. "మహాత్మా! పరమేశ్వరుఁడ వగునీవు నీమాటలు తప్పకుండ నాగృహమునఁ బుట్టితివి. సంసారచక్రపరిభ్రామ్యమాణుల మగుచు గ్రామ్యుల మగుమావర్తనములు గణింపక యనుగ్రహించి నాకు ముద మొదవించితివి. దాన నేను ఋణత్రయములనుండి తొలఁగి తిని. ఇఁక యోగసమాధినిరతి నీపాదారవిందములు డెంద మునఁ జేర్చి శోకములఁ బాసి యేకాంతస్థలమున సంచరించెద" నని పలికెను. అంతఁ గపిలమహర్షి "వరమునీంద్రా! సత్యా త్మకదయాగుణమున నావాక్యముల ననుసరించి నీయింటఁ బుట్టి తిని. నేను సన్మునివేషము ధరించుట నాకొఱకుఁ గాదు. మహా త్ములైన మునులకుఁ దత్త్వబోధము చేయుటకే యని తెలిసి కొనుము. సన్న్యస్తసకలకర్ముండవై నన్నే భక్తితో భజింపుము. మోక్షము నొందెద" వని కర్తవ్యము బోధించెను. అంతఁ గర్ద ముఁడు నాతని కధికభక్తి ననేకవందనములు చేసి మునిగణ

సేవిత మగువనమున నిస్సంగుఁడై, యాత్మైకశరణతత్పరుఁడై పరబ్రహ్మమును జిత్తమున నిలిపి సమస్తశాంత శేముషీగరిష్ఠుఁడై, ధీరుఁడై, నిఖిలప్రపంచము వాసుదేవమయముగాఁ నెంచి భక్తిభావమున భాగవతగతిఁ జెందెను. ఇటుఁ గపిల మహర్షి బిందుసరమునఁ దీవ్రతపోనిరతి నుండెను.

## కపిలమహర్షి దేవహూతికి మోక్ష మొసఁగుట

అంత దేవహూతియుఁ గొమరుని దర్శించి యాతని శరణంబు వేఁడి రక్షింపు మని యాశ్రయించెను. కపిల మహర్షి యాత్మ నలరి దేవహూతికి జీవునిచిత్తము సంసారమునఁ దగులుకొని త్రిగుణాసక్త మగు ననియు, నదియే నారాయణాసక్త మైనచో మోక్షకారణ మగు ననియుఁ జెప్పెను. పిమ్మట నాతఁ డామెకు సాంఖ్యయోగమును, భక్తియోగమును, సర్వలోకవిరక్తయోగమును బోధించెను. తరువాత దేవహూతి కపిలోక్తమార్గమున గురుయోగశక్తిచే నంబరతలమున కెగసి వాసుదేవచరణాంబు జన్యస్తచిత్తయై శ్రీహరియందుఁ గలిసెను. ఆమె మోక్షమున కేఁగిన క్షేత్రము "సిద్ధిపద" మని ప్రసిద్ధికెక్కెను. అంతఁ గపిలమహర్షియు సిద్ధచారణాదులు గొలువ సముద్రునిచేఁ బూజాదు లందెను. ఆతఁ డనంతరము సాంఖ్యాచార్యాభిష్టుత మగుయోగము నవలంబించి శాంతిసమాహితుఁడై పిత్రాశ్రమమును వీడి యుదగ్భాగమున కేఁగెను. *

---

* భారతము; హరివంశము.

## కపిలమహర్షి వేదప్రామాణ్యబుద్ధి.

ఒకప్పుడు కపిలమహర్షి యుత్తమాకృతి యగుగోవును జూచి వేదస్వరూపమని పలికియు నిర్లక్ష్యముగ నుండెను. కొంతదూరమున నున్నస్యూమరశ్మి యనుసంయమి కపిలునకు వేదములయం దేభావ మున్నదో యెఱుఁగఁ గోరి సూక్ష్మరూపమున నాగోవును బ్రవేశించి "మహర్షివర్యా! వేదములు దాంభికత్వాపాదకము లని యతులు పల్కుదురు. నీవు నాయభిప్రాయముతో నుంటివా?" యని యడిగెను. అందులకుఁ గపిలమహర్షి "వేదములయందు నా కాదరానాదరణభావములు లేవు. కాని, సంసారు లెల్లరకు వేదవిహితాచారము వలయును. పాణి యుపస్థము నుదరము వాణి యనునవి మూయరానివాకిళ్ళు. వానిని మూయఁగల్గిన బుధునకుఁ దపోదానవ్రతాదులుగాని వేదప్రామాణ్యముకాని కావలసిన పని లే"దని చెప్పెను. అంత స్యూమరశ్మి సంతసమున గోగర్భము నుండి బయటపడి కపిలునకు నమస్కరించి 'సత్యమెఱుఁగఁ గోరి యట్లు గోగర్భమునఁ జొచ్చి ప్రశ్నించితిని. మన్నించి వేదప్రామాణ్యమును గుఱించి నా మనశ్శాంతికొఱకు కింకను జెప్పు' మని వేఁడుకొనెను. అంతఁ గపిలమహర్షి వానిభావ మెఱిఁగి "వేదములే లోకమునకుఁ బ్రమాణములు. శబ్దబ్రహ్మ పరబ్రహ్మలలో శబ్దబ్రహ్మముమూలమునఁ బరబ్రహ్మము గ్రహింపవచ్చును. బ్రాహ్మణు లుత్తములై వేదచోదితకర్మములఁ జేయుచు శాశ్వతపదముఁ నందవచ్చును. వేదతాత్పర్య మరసి వేదితవ్య మెఱుఁగువారలే వేదజ్ఞులు. ఇట్లు కానివారు వేదపాఠకులు; సర్వము వేదపరినిష్ఠితము. కావున,

నేను వేదమానిత బ్రాహ్మణులకు నమస్కరింతు" నని పలికెను. ఈమాటలు విని స్యూమరశ్మి యానందించి వెడలిపోయెను. *

## కపిలమహర్షి పుండరీకు ననుగ్రహించుట

తొల్లి పుండరీకుఁ డనుమహారాజు మృగయావినోదార్థము సపరివారుఁడై వనముఁ జొచ్చి యథేచ్ఛము మృగముల వేఁటాడి డప్పిగొని కపిలమహర్షి యాశ్రమప్రాంతమునఁగల సరోవరమునందు చల్లనివి,తియ్యనివి, స్వచ్ఛమైనవియగు నీళ్లుద్రాగి యట నొక చెట్టునీడను విశ్రమించెను. ఆసమయమున నొక లేడి యాప్రాంతమునఁ బరుగిడుట చూచి యారాజు దానిపై నొక బాణమును విడిచెను. ఆబాణము తగిలి యాలేడి కపిలముని యాశ్రమముకడకు వచ్చి పడి మరణించెను. అది చూచి కపిలుఁడు తనయాశ్రమమున నిట్టిహింస కావించిన మూఢుఁ డెవఁ డని లేచి యటుఁ దిరిగి యొకచెట్టునీడను విల్లమ్ములతో నున్న రాజును జూచెను.

కపిలుని గాంచి పుండరీకుఁడు గడగడ వడఁకుచు లేచి వచ్చి భక్తితో నమస్కరించి కులగోత్రములు చెప్పుకొని తన తప్పిదమును మన్నింపు మని కోరెను. అంత నామహర్షి యాతని కిట్లనెను. "ఓయీ! క్షణభంగుర మగుజీవితము గల మానవుఁడు పశువులకన్న బుద్ధిబలమున మిన్నయయ్యు, ఏపాప మెఱుఁగని, నోరులేని, సాధుజంతువులఁ జంపుటవలన మహాపాపము గడించును.నీవిట్లు దారుణకర్మ మొనరించుటకుఁ గారణ

* భారతము- అనుశాసనికపర్వము.

నేమి ! రక్తమాంసాదిమయ మగునీ దేహముపై నీకెట్టి మమత కలదో ఆ లేడికి దాని దేహముపై నట్టిమమత యుండదా? తుచ్ఛ మగు నీ విలాసమునకై పసికందు, పుణ్యజీవ, యగు నీ లేడి నిండు ప్రాణములను బలిగొంటివే? నిన్నిప్పు డేమి చేసినఁ దప్పులే”దని యాతని నెంతయు నిందించి వైరాగ్య ముపదేశించెను.

పుండరీకుఁ డామహామహునిమాటలు శూలములవలెఁ గ్రుచ్చుకొనఁగా సిగ్గుపడి పశ్చాత్తాపమంది తాను జేసిన దోష మున కామహర్షియెదుటనే ప్రాణత్యాగము చేసికొనఁ దలఁచి వాఁడి యగుకత్తి నొరనుండి తీసి తనశిరముఁ ద్రుంచుకొనఁ బోవునంతఁ గపిలుఁడు కనికరించి యాతని నాత్మహత్యనుండి కాపాడెను. పుండరీకుఁడు కపిలునిపాదములపైఁ బడి జ్ఞానభిక్షఁ బెట్టు మని ప్రార్థించెను.

అంతఁ గపిలమహర్షి యాతని కిట్లు బోధించెను. “రాజా! మోక్ష మపేక్షించు మానవుఁడు పూర్వదానఫలమునఁ గలిగిన సంపదలు క్షణికము లనియు, పరహింసా వ్యాపారములు పాపహేతువు లనియు, నెఱిఁగి భయపడుచు గురుపాదము లాశ్రయించి తత్త్వ మెఱిఁగి దృఢనిశ్చయుఁడై మెలఁగవలయును. అట్లు మెలఁగువారు మూఁడురకములు: అంకురితులు, పుష్పితులు, ఫలితులు. మోక్షధర్మాపేక్షగలవా రంకురితులు; తదాచారనిరతులు పుష్పితులు; జీవన్ముక్తులు ఫలితులు. వీరు గురుబోధితజ్ఞానమున మోక్ష మందుదురు.” ఇట్లు బోధించి కపిలుఁ డాతనిని వీడ్కొలిపి నిజాశ్రమమునకు విచ్చేసెను.

తదనంతరము పుండరీకుఁడు సర్వసంపదలను రోసి వైరాగ్య యుతుఁడై కపిలమహర్షియాశ్రమమునకు విచ్చేసి తన్ను శిష్యు

నిగా ననుగ్రహించి తపముచేయ ననుమతింపు మని యాతనిఁ గోరెను. కపిలుఁ డాతనిఁ గన్నెత్తిచూడక నోటఁ బలుకక తృణీకరించెను. కాని, పుండరీకుఁడు పదుమూఁడుదినము లటనే జలాంజలిత్రయపానమాత్రమునఁ గదలక మెదలక కపిలునే ధ్యానించుచు నుండెను. పదునాలవదినమునఁ గపిలుఁడు శిష్య సహితుఁడై సంధ్యాద్యనుష్ఠానములఁ దీర్చి యాతనిఁ బలుకరించి యాతనిమనసు రాజ్య సతీ పుత్త్రాదులపై మరలింప యత్నించెను. కాని పుండరీకుఁడు నిజమగు విరాగమున నుండుటచేఁ జలింపఁడాయెను. కపిలుఁ డపుడు సంతసించి యాతనికిఁ గర్మ భక్తి వైరాగ్య జ్ఞానయోగములు బోధించి

"పరాయ పరరూపాయ
పరమాత్మన్ పరాత్మనే
నమః పరమ తత్త్వాయ
పరానందాయ ధీమహి"

అను మహామంత్రము నుపదేశించి యనుగ్రహించెను.

పుండరీకుఁ డట్లు కపిలమహర్షినే గురువుగా భావించి యాతని యుపదేశామృతమునఁ బునీతుఁడు శ్రద్ధా భయభక్తి యుక్తుఁడై చిరకాల మా మంత్రమును జపించి విష్ణుదేవుని బ్రత్యక్షము చేసికొని యాతనికటాక్షమున మోక్షమునందెను.*

## కపిలమహర్షి సగరపుత్త్రుల భస్మము చేయుట

మఱియొకప్పుడు సగరచక్రవర్తి విష్ణుప్రీతికొఱకై యనేకాశ్వమేధయాగములఁ జేసి తృప్తిగనక మఱియొక మఖమును జేయ హయమును విడిచెను. అసూయాగ్ర

* మత్స్యపురాణము.

స్తుఁడై యింద్రుఁ డాగుఱ్ఱమును నాగలోకమునకుఁ దీసికొని పోయి యట నొకచోఁ దపోనియతి నున్నకపిలమహర్షి యాశ్రమసామీప్యమునఁ గట్టివైచి వెడలిపోయెను. యాగాశ్వ సంరక్షణమునకై సగరుఁడు నిజపుత్త్రులఁ బంపెను. వారు నిల యేడుదీవులు వెదకి యశ్వముఁ గానక భూమిఁ ద్రవ్వి పాతాళలోకమున కేఁగిరి. అందుఁ దిరిగి తిరిగి వారు కపిలమహర్షి యాశ్రమప్రాంగణమున నున్న యశ్వముఁ జూచి యాతఁడే దానిని హరించియుండె నని భావించి యాతనిఁ జంప నేఁగిరి. కపిలమహర్షి కనుదెఱచి చూచెను. వెంటనే సగరపుత్త్రులరువదివేలమందియు భస్మీభూతులై పోయిరి. తరువాత సగరుఁడు మనుమఁ డగు నంశుమంతునిఁ బంప నాతఁడు పాతాళమున కేఁగి యందుఁ గపిలాశ్రమసామీప్యమున భస్మరాసుల పొంత నున్న యశ్వమును జూచియు నాకపిలమహర్షికిఁ బ్రణమిల్లి యనేకవిధములఁ బ్రార్థించెను. కపిలుఁడు "బుద్ధిమంతుఁడా ! గుఱ్ఱమును దోలుకొనిపోయి మీ తాతజన్నముఁ బూర్తి సేయింపుము. వెఱ్ఱులై నీతండ్రులిట భస్మమైరి. గంగాజలములు వీరిపైఁ బ్రవహించిన వీరికి ముక్తి కల్గు" నని యనుగ్రహించెను. అంశుమంతుఁడు కపిలు ననుగ్రహమునకుఁ బాత్రుఁడై తండ్రులదుఃస్థితికి విచారించి యాగాశ్వమునుం గొని పోయి తాత యశ్వమేధమును బూర్తి చేయించెను. తుదకు భగీరథుఁడు గంగాజలమును బాఱింపఁజేసి సగరపుత్త్రులకుఁ బుణ్యలోకము లొసఁగెను. *

* భారతము, భాగవతము, బ్రహ్మాండపురాణము.

## కపిలమహర్షి యశ్వశిరునకు విశ్వరూపము చూపి కటాక్షించుట

పూర్వ మొకప్పు డశ్వశిరుఁ డనుమహారా జనేక యాగములఁ జేసి యనేకవిధముల బ్రాహ్మణులను సత్కరించుచుండెను. కపిలమహర్షి యశ్వశిరునియోగ్యత యెఱిఁగి యాతనిఁ గటాక్షించునుద్దేశముతో నొకమాఱు జైగీషవ్యుఁ డనుముని వెంటరాఁగా నశ్వశిరునిగృహమున కేఁగెను. నాఁ డశ్వశిరుఁడు యజ్ఞదీక్షితుఁడై బ్రాహ్మణుల కనేకభూరి దక్షిణ లిచ్చి సమ్మానించెను. ఆతఁడు కపిలజైగీషవ్యుల నెంతయు నాదరించి పలువిధములఁ బూజించెను. తరువాత నశ్వశిరుఁడు కపిలమహర్షికి మ్రొక్కి "మహాత్మా! మీరాకచే నేను ధన్యుఁడ నైతిని. విష్ణుమూర్తి కటాక్షసంపాదనకు నే ేమి చేయవలయునో తెలుపుఁ" డని కోరెను. అంతఁ గపిల మహర్షి "రాజా! నేనే విష్ణుమూర్తిని. నన్నుఁ బూజించిన నీవు కృతార్థుఁడ వగుదువు. నేను గాక వే ఱొకవిష్ణుమూర్తి కలఁడని యెంచుటకన్న నవివేకము లే"దని పల్కెను. అశ్వశిరుఁ డామాటలకు నాశ్చర్యము నంది యాతనియహంభావమున కసహ్యించుకొనెను. కాని, కపిలమహర్షి నేమియు ననఁజాలక "మహాత్మా! విష్ణుమూర్తిని నేనెఱుఁగుదును. ఆతఁడు శంఖ చక్రగదాపాణి గరుడవాహనుఁడు గదా! నీవే విష్ణుమూర్తి వన్న నవి నీకు లేవుగదా" యనెను. ఈమాట లశ్వశిరుని నోటినుండి వెలువడఁగానే కపిలమహర్షి విష్ణుస్వరూపుఁడై శంఖచక్రగదాపాణి, యయ్యెను. జైగీషవ్యుఁడును గరుడుఁడై యాతనివాహన మయ్యెను. అంత నశ్వశిరుఁడు తననేత్రములను

నమ్మఁజాలక యది యంతయు మోస మనియు విష్ణుమూర్తి కమలనాభుఁ డనియు బ్రహ్మ యందుండి జన్మించె ననియు నట్లు లే దేమని యడిగెను. వెంటనే కపిలమహర్షి కమలనాభుఁ డయ్యెను. అంత జైగీషవ్యుఁడు బ్రహ్మయై నిలిచెను. ఐన, నశ్వ శిరుఁడు నమ్మఁజాలక యది యంతయు మోసమే యనియుఁ గపిలమహర్షి విష్ణుమూర్తి కాఁ డనియు ననెను. వెంటనే కపిలుని మాహాత్మ్యమున సభాసదు లెల్ల రంతర్ధానమైరి. యజ్ఞశాల దుష్టమృగములతో నిండిపోయెను. అశ్వశిరుఁ డతిభయాకుల చిత్తుఁడై కపిలమహర్షియే విష్ణుమూర్తి యనుపూర్ణవిశ్వాసము కలుగఁగాఁ దిరిగి యాతనిఁ బ్రార్థించెను. వెంటనే కపిలుఁడు ప్రత్యక్షమయ్యెను. సభాసదులు వచ్చిరి. దుష్టమృగము లంత ర్ధానమయ్యెను. అశ్వశిరుఁడు కపిలమహర్షి పాదములపైఁ బడెను. కపిలమహర్షి యాతనిఁ గటాక్షించి "రాజా ! నీవు విష్ణుభక్తుఁ డవు. విష్ణు నెట్లు నశవఱచుకొనఁగల నని యడిగితివి. బ్రహ్మాది స్తంబపర్యంతము విష్ణుమూర్తి రూపమే యని గ్రహించిన, నాతఁడు నీకు నశుఁ డగును. విష్ణుఁడు సర్వాంతర్యామి సర్వ వ్యాపి యని నిరూపించుట కిట్లు చేసితిని. ఇంకనైన నీ వది గ్రహించి కులోచితధర్మములను వేదవిహితాచారములను నెఱ వేర్చుచు సుజ్ఞానము నందిన మోక్షము నందఁగల"వని బోధించి కపిలమహర్షి జైగీషవ్యునితో వెడలి పోయెను.*

### కపిలుని సాంఖ్యసిద్ధాంతము

కపిలమహర్షి సాంఖ్యయోగమును బోధించినమహా త్ముఁడు. "విషయములవిధము తెలిసికొని శ్రుతివాక్యములచే

---

* వరాహపురాణము.

వానితత్త్వమును గ్రహించి దృఢజ్ఞానముచే వానిని విడిచిపెట్ట వలయును. ఆయువు క్షణిక మనియు సుఖదుఃఖములు కాలగతి వచ్చు ననియు నెఱుఁగవలెను. కర్మతత్త్వము వేదచోదనముల విధము గ్రహించి సత్త్వరజస్తమోగుణములచే బుద్ధికిఁ గలుగు ప్రవర్తనముల గుఱ్తెఱుఁగవలయును. పంచేంద్రియములు గోష్ఠమునందు,నగ్ని వాయువులు బయలను,పావకునందుఁ దోయము లును,భూమి తోయము లందును,బలము కౌశికునందును,గ్రాంతి యుపేంద్రునందును,సర్గమున లోభమును,మనస్సున బుద్ధియు రజస్సునఁ దమస్సును, సత్త్వమున రజస్సును దగులును. సత్త్వ మాత్మఁ దగులును. ఆత్మయు నారాయణుఁ డనియు మహేశుఁ డనియు నొప్పుచుండును; ఆత్మయు పరమునఁ దగులును; పరము మోక్షమునఁ దగులును. మోక్ష మిఁక నెందును దగులదు. పదునాఱువికారములు గలప్రకృతి యాత్మ కాశ్రయము. ఆత్మయు ప్రకృతివికృత్యతీతుఁడు. ఆత్మనకు రెండురూపము లున్నవి. ఒకటి విషయములందును రెండవది మధ్యస్థభావమునందును బ్రవర్తిల్లును. ప్రాణాపానవ్యానోదానసమానము లనునైదువాయువులు నాతనివి. వీనివిధము నెఱిఁగినఁ గలుగుజ్ఞాన మంతరాత్మనిఁ జూపును. గర్భవాస దుఃఖము, జన్మవ్యథ, బాల్యవిమూఢత్వము, రాగము, క్లేశము, వార్ధక్యము, వీనివలనఁ గలుగుకృపణతలు గుఱ్తెఱిఁగి సంగముఁ బాసి యాత్మనిఁ గని మోక్ష మందఁదగును. దేహగుణాదిదోషముల నెల్లఁ ద్రోచుమార్గములను గ్రహించి యామార్గపరిచయమున విష్ణుమాయచేఁ దోఁచు విశ్వమంతయు బుద్బుదప్రాయముగా ఫేనసదృశమై మృద్ఘటములఁ

బోలి యున్న దని గ్రహించి దానిని లక్ష్యపెట్టక మోక్ష మార్గము నరయుటయే సాంఖ్యము. కపిలమహర్షి బోధించిన యీ సాంఖ్యదర్శనము ప్రజాపతిపూజ్యమై, వేదశాస్త్ర పురాణవిదితపరిజ్ఞానముల కెల్లఁ జేరుగడయై బ్రహ్మభావ భాజనతకు సరిలేని సమ్యగుపాయమై వెలసినది. ఇదియే షడ ధ్యాయవిలసితమై, త్రివిధదుఃఖాత్యంత నివృత్త్యత్యంతపురు షార్థాదికనిగదనమై "కపిలస్మృతి" యనఁబరగుచున్నది. *

## కపిలుని భక్తియోగము

కపిలమహర్షి మాతృదేవికి భక్తియోగమును బోధించెను. తామసరాజససాత్త్వికమను భేదములఁ ద్రివిధముల భక్తియోగము నిట్లు నిరూపించెను. 'నిత్యము హింసాపరుఁడై దంభమాత్సర్యాదుల కాలవాలమై యొప్పుచున్నను భేద దర్శియై భగవద్భక్తుఁ డగువాఁడు తామసభక్తుఁడు. విషయ సుఖములఁ బ్రవీణుఁడై యైశ్వర్యాదుల ననుభవించుచున్నను భగవద్భక్తి విడువనివాఁడు రాజసభక్తుఁడు. పాపపరిహారము నకై భగవదర్పణబుద్ధితోఁ గర్మములు చేయుచు, జనహిత కారియై భక్తుఁ డగువాఁడు సాత్త్వికభక్తుఁడు. పరమేశ్వ రునిగుణములను వినుటచేఁ గలిగినభక్తిచేనైన నాతనిపై మనస్సును నిల్పినవాఁడును బరమభక్తుఁ' డని కపిలుఁడు భక్తి యోగమును దదనంతఫలమును విశదీకరించెను. †

## కపిలమహర్షి రావణునకు విశ్వరూపము చూపుట

కపిలమహర్షి యొకప్పుడు పశ్చిమసముద్రతీరమున నొకయరణ్యములోఁ బద్మాసనస్థుఁడై కన్నుఁగవ మూసి

---

* భారతము శాంతిపర్వము. † భాగవతము. తృతీయస్కంధము.

కొని యాత్మయోగసుఖ మందుచుండెను. అప్పుడు రావణుఁడు పరగర్వముచే బలవంతుల నందఱను జయించు నుద్దేశముతోఁ దిరుగుచుఁ గపిలమహర్షిని గాంచెను. రావణునికంటికిఁ గపిల మహర్షి నేత్రాంచలముల నగ్నిశిఖలు, బాహువులయందు బహుశితాయుధములు, శరీరమం దెల్ల మరుద్వసురుద్రసంఘ ములు గాన్నై దుస్సహముగాఁ గానవచ్చెను. మఱియుఁ గపిలమహర్షి యురమున లక్ష్మీదేవియు, శల్యముల మరుద్గణ ములు, కడుపున సముద్రములు, కన్నులలో సూర్యచంద్రులు, ధాత, విధాత, రుద్రాదులు, దేవతలు మున్నగువా రెల్లరు నాతనిశరీరమునఁ గాన్నైరి. రావణుఁ డిది ఋషులమాయ యని వానిపై ననేకశస్త్రాస్త్రములు ప్రయోగించెను. వెంటనే కపిలమహర్షి "ఓరీ ! చెడుగా ! నన్ను సాధింప వచ్చితివా ?" యని పిడికిలిచేఁ బొడిచెను. దానితో రావణుఁడు మూర్ఛపడెను. తోడి దైత్యు లాతని నెదిరించిరి. కపిలుఁడు దైత్యుల హుంకరించి గుహా భ్యంతరమున కేఁగెను. రావణుఁడు కొంత సేపటికి మూర్ఛ దేఱి యాతని సాధింపనెంచి బాణకృపాణాదులతోఁ గపిలుని గుహఁ బ్రవేశించెను. అందు మహావీరులు, దేవసుతులు, సిద్ధులు, శంఖచక్రాదులు ధరించి చతుర్భుజులైన పురుషవరులు గాన్నైరి. దివ్యసౌరభములు నిండఁగ రమణీయరోచుల నీనురత్నాలం కారముల ధరించిన స్త్రీలు వింజామరలు వీచుచుండఁగా సౌం దర్యనిధి యైనయొకస్త్రీ పాదము లొత్తుచుండఁగాఁ గపిలమ హర్షి కనుమోడ్చి నిదురించుచుండెను. రావణుఁడు చెంత కేఁగ నతఁడు లేచెను. రావణుఁడు విస్మితుఁడై యాతని యపూ ర్వచరిత్ర మడిగెను. కపిలమహర్షి రావణుఁడు త్వరలోఁ

జంపఁబడనుండు టెఱిఁగించి నోరు తెఱచెను. అందు విశ్వ రూపము ప్రత్యక్షమయ్యెను. రావణుఁడు భీతచిత్తుఁడై యాత నికి నమస్కరించి "మహాత్మా! నీచేతిలోఁ జనిపోవుటకంటె శుభము వేఱొకటి లేదు. నే నందుకొఱకే సిన్నివిశ్వమున విసుగువిరామములు లేక వెదకుచున్నా"నని కడుంగడుఁ బ్రశం సించెను. ఇంతలో గిరిగొ గుహాశోఁ గపిలమహర్షి యంతర్హి తుఁడయ్యెను. రావణుఁడు పరమ విస్మయచిత్తుఁడై యటనుండి వెడలిపోయెను *

కపిలమహర్షి యవతారము మూలమున లోకము గడిం చినది కపిలాచార్యుని సాంఖ్యతత్త్వము. భక్తియోగమునకు శ్రుతిస్మృతులకుఁ బ్రామాణ్య మొసఁగి యిది విఖ్యాతి నార్జిం చినది. స్వామరశ్మిగోఁ బలికినపలుకులవలనఁ గపిలుని వేదప్రా మాణ్యబుద్ధి, మాతృశ్రీ యగు దేవహూతికి బోధించిన భక్తి యోగము నిట్లనుటకు సాక్షిభూతములు. కపిలమహర్షి తండ్రి తోఁ జెప్పిన ట్లవతార మెత్తి మునివేషము గైకొని ఋషిజన ములను దన్మూలమునఁ బ్రజానీకమును దత్త్వబోధామృతముచేఁ బునీతులను జేయుటకే యనుట నిస్సంశయము. ఆమహర్షి వర్యునిబోధామృతమును దనివితీఱఁ గ్రోలి భక్తులజరామరత్వ ముల నంది తమజీవితములను సార్థక మొనరించుకొందురుగాక!



* ఉత్తర రామాయణము.

ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీమహర్షిజీవితకథామృతము

## కశ్యపమహర్షి

### స్తుతి

"శ్రీవిష్ణుపదభక్తిఁ జెలఁగుసప్తర్షిచం
  ద్రములలో మున్నెన్నఁ దగిన చేటి
దిత్యదిత్యాదిసాధ్వీశిరోరత్నంబు
  లను బ్రేమఁ జెట్టవట్టిన గృహస్థ
కములాప్త భుజగేంద్ర ఖగరాజరోహిణీ
  కన్యకారమణులఁ గన్నతండ్రి
రాముచే దానధారాపూర్వముగ భూత
  ధాత్రి గ్రహించిన శ్రోత్రియుండు

తోయరుహసంభవునకుఁ బౌత్రుఁడు మరీచి
పుత్త్రుఁడు విచిత్రగుణమణిపాత్రుఁ డఖిల
వేదవేదాంతతత్త్వవివేకశాలి
మహిమఁ జెలువొందుకశ్యపమౌనిఁ" గొల్తు.

[దశావతారచరిత్రము. 3 ఆ. ౮ ప.

మరీచిమహర్షి బ్రహ్మనుమలతోఁ గూడి దేవహూతీకర్దముులకు జనించినవిష్ణుమూర్తి యగుకపిలమహర్షిఁ జూడవచ్చెను. అప్పుడు కర్దమప్రజాపతి మరీచిమహర్షిని దనయింట నుంచుకొని తనకూఁతుండ్రలో నొకతె యగుకళ నిచ్చి వివాహము చేసెను. అట్లు వివాహితుఁడై మరీచిమహర్షి భార్యాసహితుఁడై తన తపోవనమున కేఁగి సుఖముండెను.

అంతఁ గొంతకాలమునకుఁ గళకు మరీచిమహర్షిదయచే గర్భము సంభవింపఁ గాలక్రమమున నామె మగశిశువును గనెను. మరీచిమహర్షి కుమారుఁడు ప్రజాపతి యగు ననియు నాతని జాగ్రత్తగాఁ గాపాడు మనియు భార్యకుఁ జెప్పి యాతనికిఁ గశ్యపనామ మొసఁగి యుక్తకాలమున నుపనయనాదిసంస్కారము లొనర్చి తపోవనమున కేఁగెను.

### కశ్యపమహర్షి సంతానము

కశ్యపుఁడు తరువాతఁ బెరిఁగి పెద్దవాఁ డయ్యెను. బ్రహ్మ నియోగింప దక్షప్రజాపతి తనకుఁ గల్గినపుత్త్రికలలో నదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, ముని, కపిల, క్రోధ, ప్రథ, క్రూర, వినత, కద్రువ, లనువారిని గశ్యపుని కిచ్చి వివాహము చేసెను. కశ్యపమహర్షి తన భార్య లందఱకు సంసారసౌఖ్యము నొసఁగి పుత్త్రుల నిచ్చెదనని వచించెను. కొంతకాలమునకుఁ గశ్యపమహర్షికృపచే నదితి, దాత, మిత్త్రుఁడు, అర్యముఁడు, శుక్రుఁడు, వరుణుఁడు, అంశుఁడు, భగుఁడు, వివస్వతుఁడు, పూషుఁడు, సవిత్రుఁడు, త్వష్ట, విష్ణుఁడు నను ద్వాదశాదిత్యులను గనెను. కశ్యపుని వలన దితికి హిరణ్యాక్షుఁడు హిరణ్యకశిపుఁడు జన్మించిరి. దనువునకు విప్రచిత్తి శంబరాదిదానవులు నలువం ద్రుద

యించిరి. కాల యనుదానికి వినాశన, క్రోధాదు లెనమండ్రు గురు పుట్టిరి. అనాయు వనునామెకు బలవీరాదులు నలుగురు పుట్టిరి. సింహికకు రాహువు కలిగెను. ముని యను భార్య భీమసేనోగ్రసేనాదు లనుగంధర్వులఁ గనెను. కపిల కమృతము, గోగణము, బ్రాహ్మణులు, ఘృతాచీమేనకాదు లగునప్సరసలుఁ బుట్టిరి. క్రోధ యనునామెకుఁ గ్రోధవశగణములు జనించెను. ప్రథ యను నామెకు సిద్ధాదులును, క్రూరకు సుచంద్ర చంద్రహంత్రాదులును బుట్టిరి. *

## కశ్యపప్రజాపతికిఁ గద్రూవినతలవలని సంతతి.

తరువాతఁ గొంతకాలమునకుఁ గద్రూవినతలు కుమారులఁ గాంచు నుద్దేశముతోఁ గశ్యపమహర్షికడ కేఁగి యనేక సహస్రవర్షము లాతని నారాధించిరి. కశ్యపుఁ డంత వారిసేవ కానందించి వరములు వేఁడుకొనుఁ డనెను. అందుఁ గద్రువ వేయిమందిని వినత యా వేయిమందికంటె బలాధికులైన యిద్దఱుపుత్త్రులను గోరుకొనెను. కశ్యపమహర్షి యట్లే యని వారికోర్కెఁ దీర్చుట కుగ్రతపము చేసెను. తరువాతఁ గశ్యపుఁ డింద్రాదిదేవతలను వాలఖిల్యాదిఋషిగణములను దనకు సహాయులఁ జేసికొని పుత్త్రికామేష్టి యొనరించెను. ఆయజ్ఞమున నంగుష్ఠమాత్రదేహులు ననవరతోపవాసకృశీభూతగాత్రులు నగువాలఖిల్యాదులఁ జూచి యింద్రుఁడు నవ్వెను. అంత వా రాతనిపైఁ గోపించి యింద్రునికంటెను నూఱురెట్లు బలవంతుఁ డగుపుత్త్రుఁడు కశ్యపున కుదయించి రెండవయింద్రుఁ డగుఁగాక యని మహామంత్రములతో వేల్వఁ

* భాగవతము, చతుర్థస్కంధము.

దొడఁగిరి. ఇంద్రుఁడు భయకంపితుఁడై కశ్యపుని శరణు వేఁడెను. కశ్యపమహర్షి లోకసంరక్షణార్థమై వాలఖిల్యాది మహర్షులఁ బ్రార్థించి భువనప్రవృత్తికి విపరీతము కాకుండునట్లు తన కుదయించుసుతుఁడు పక్షికులమున కింద్రుఁ డగునట్లు వా రందఱ నొడంబఱిచెను. పిమ్మటఁ గశ్యపుఁడు కద్రూవినత లకుఁ గోర్కె సిద్ధింపఁజేసి గర్భముల సంరక్షించుకొనుఁ డని చెప్పి పంపివేసెను. కొంతకాలమునకు వారిగర్భములం దండము లుదయించెను. వాని నెల్ల ఘృతకుండములఁ బెట్టి యిరువురు రక్షించుచుండిరి. నూఱేండ్లకుఁ గద్రూగర్భాండ ములు క్రమముగాఁ జిట్లి యందు శేషుఁడు, వాసుకి, తక్ష కుఁడు, కర్కోటకుఁడు, ధనంజయుఁడు, కాళియుఁడు మున్నగు వేయిమంది నాగముఖ్యు లుదయించిరి. వినత తనగర్భాండ ములనుండి పుత్త్రిలు కలుగలే దని విచారించి యొకయండ మును బ్రద్దలుకొట్టిన నందుండి యనూరుఁడు జన్మించి యకాల మున నండముఁ జిట్లించుటచేఁ దా నంగహీనుఁడ నైతి నని తల్లిని నిందించి రెండవయండము నైనను జాగ్రత్తగాఁ గాపా డుకొను మని తల్లికిఁ జెప్పి తాను సూర్యసారథి యయ్యెను. తరువాతఁ జిరకాలమునకు రెండవయండమునుండి గరుత్మంతుఁ డుదయించెను.

## కశ్యపుఁడు గరుత్మంతు నాశీర్వదించుట

గరుత్మంతుఁ డుదయించి మాతృ దాస్యవిమోచనము నకై యమృతముఁ దెచ్చుటకుఁ దల్లియనుమతి కోరి యామె చెప్పినచొప్పున సముద్రమునందలినిషాదుల భక్షించిన నాఁకలి తీఱక తండ్రి యగుకశ్యపమహర్షికడ కేఁగి యాహార మడి

గెను. కశ్యపుఁడు కుమారుని ధైర్యమునకు మెచ్చుకొని విభావసుఁడు సుప్రతీకుఁ డనుబ్రాహ్మణులు కలహించి కూర్మ గజరూపులై పోరుచున్నా రనియు వారిని భక్షింపు మనియుఁ జెప్పెను. గరుత్మంతుఁడు తండ్రిపంపున నలంబతీర్థమున కరిగి రౌహిణ మనువృక్షముపై వ్రాల దానిశాఖ విఱిగిపోయెను. దాని నంటి తపముచేయువాలఖిల్యులకు బాధ కలుగకుండ నా కొమ్మను గ్రిందపడకుండ నోటఁగఱచుకొని గజకచ్ఛపములఁ జేతుల నిఱికించుకొని గంధమాదనపర్వతమునఁ దపము చేయు తండ్రికడ కేఁగి మ్రొక్కెను. కశ్యపుఁ డది గ్రహించి యా వాలఖిల్యుల నందుండి మఱియొక చోటికిఁ బొండని వేఁడుకొనెను. వా రాశాఖను విడిచి హిమగిరి కరిగిరి. కశ్యపుఁ డా శాఖను నిష్పురుషనగమున విడువు మన గరుడుఁ డతివేగమున నట్లుచేసి హిమగిరిపై దిగి గజకచ్ఛపముల భక్షించి మహాబలసంపన్నుఁడై యమృతము గొనివచ్చి మాతృశాప విమోచనముఁ గావించెను. *

## భూమి కాశ్యపి యనఁబరగినవిధము

పూర్వము పరశురాముఁ డిఱువదియొక్కమారులు నేల నిఃక్షత్త్రము గావించి యాపాపవిముక్తికై యశ్వమేధయాగమును జేసి యది పరిపూర్తి యైనంతనే కశ్యపమహర్షిని బిలిచి భూమియంతయుఁ దక్షిణగా నిచ్చివేసెను. కశ్యపమహర్షి లోకసంరక్షణార్థ మది గ్రహించి రాజవంశమునకు నిశ్శేషత్వము కలుగకుండుటకై పరశురాముని దక్షిణాబ్ధి పార దేశములకుఁ

* భారతము ఆదిపర్వము.

బొమ్మనెను. పరశురాముఁడు శూర్పాకారప్రదేశము సముద్రుఁడు నిజవిహారమున కీయ నందుఁ దపోనియతి నుండెను. కశ్యపమహర్షి భూమినంతను భూసురుల కిచ్చి తపోవనమున కేఁగెను. నాఁటినుండి భూదేవి 'కాశ్యపి' యని పిలువఁబడుచున్నది

## కశ్యపుఁడు భూమిని రాజులకుఁ బంచి యిచ్చుట

కొంతకాలమునకు భూమిపై ధర్మము నశించు యధర్మము పెరుఁగఁ జొచ్చెను. బ్రాహ్మణులు యజ్ఞయాగములు మాని యకృత్యములకుఁ జొచ్చిరి. ఈ మహాదోషములచే భూమి పాతాళమునకుఁ బోవుచుండఁగాఁ గశ్యపమహర్షి తన తొడఁగుఱ్ఱిచ్చి దాపు చేసి యెత్తఁగా భూదేవి మరలఁ బూర్వరూపమున నుండెను. అంతఁ గాశ్యపి కశ్యపమహర్షికి నమస్కరించి యుత్తమక్షత్త్రియులు దండనీతిచే ధర్మమును రక్షించి తన్ను సురక్షితఁ జేయున ట్లనుగ్రహింపఁ గోరెను. అపుడు కశ్యపుఁడు పరశురామునిచేఁ జావనిరాజు లెవ రనెను. భూదేవి సంతసించి హైహయులు కొందఱు, పౌరవంశజుఁడగు విదూరథునికొడుకును ఋక్షపర్వతమున ఋక్షములు రక్షించుటయు, సౌదాసునివంశమువాఁ డొకఁడు పరాశరమహర్షి యజ్ఞమున శూద్రకర్మలు చేయుచు బ్రదికి యుండుటయు, శిబిమనుమఁడు గోపతి యనువానిని వనమున గోవులు రక్షించుటయుఁ,బ్రతర్దన పుత్త్రుఁడు వత్సరాజు నట్లే జీవించియుండుటయుఁ జెప్పి వారిని బిలిపించి యధిపతులఁ జేయు మని ప్రార్థించెను. కశ్యపమహర్షి యానందించి యారాజసుతుల నందఱఁ బిలిపింప వా రెల్లరు విచ్చేసి కశ్యపునకు నమస్కరించి నిలిచిరి. కశ్యపుఁడు వారంద

లకు భూమిని విభజించి యొసఁగి పరిపాలింపుఁ డని యభిషేక మాచరించి పంపెను. క్రమముగా నానృపులవంశములం దనేకులు పుట్టి ధరణీభారము వహించిరి.*

### కశ్యపుఁ డదితివలన వామనునిఁ గనుట

తొల్లి యొకసారి బలిచక్రవర్తి భృగ్వాదిబ్రహ్మవాదుల నర్చించి యనంతబలోపేతుఁడై స్వర్లోక మాక్రమించెను. ఇంద్రాదిదేవత లెల్లరుఁ గామరూపముల ధరించి తమతమ తోఁచిన చోట్ల కేఁగిరి. బలి యైశ్వర్యవిభవుఁడై యుండ భృగ్వాదు లతనిచే శతాశ్వమేధములు చేయించిరి. ఇట్లుండఁగా నదితి తనబిడ్డలపాటును సవతిబిడ్డలయైశ్వర్యము నరసి చింతాక్రాంతయై యుండఁగా నొకనాఁడు కశ్యపమహర్షి భార్యపాలి కేతెంచి యోగక్షేమ మడిగెను. అదితి తనబిడ్డల దుస్థితిని దితిబిడ్డలప్రాబల్యమును జెప్పి తనబిడ్డల సంరక్షింపుమని భర్తను వేఁడుకొనెను. కశ్యపమహర్షి భావికాలగతు లూహించి నారాయణుని బ్రార్థింపు మని తనసతి కుపదేశించెను. ఏవ్రతముచే నారాయణు నుపాసింతు నని యామె యడుగఁ గశ్యపుఁడు 'పయోభక్షణ'మనువ్రత మామె కుపదేశించి తత్కాలమంత్రములఁ జెప్పెను. అదితి యట్లు చేయఁగా నారాయణదేవుఁడు ప్రత్యక్షమై తా నామెకుఁ గుమారుఁడై పుట్టి యభీప్సితముఁ దీర్తు ననియుఁ బుత్రోత్పత్తికి భర్తను సేవింపు మనియుఁ జెప్పి యంతర్హితుఁ డయ్యెను. అదితియు నానందముతో భర్తకు శుశ్రూష చేయుచుండఁగా నొకనాఁడు కశ్యపుఁ డామెతో భోగించి యచ్యుతునంశ మాత్మ నొలయ దాని నదితిగర్భమునఁ జేర్చెను. అంత నదితి గర్భవతియై కాలక్రమమున నారాయణుఁ గనెను.

శంఖచక్రగదాధరుఁడు కౌస్తుభాభరణుఁడు నైనహరి తనగర్భమున నెట్లుండె నని యదితి వెఱఁగుపడఁగాఁ గశ్యపుఁ డాతని ననేక విధముల స్తుతించెను. అంత నారాయణుఁడు రూపాంతరమును గ్రహించి వామనుఁడై కశ్యపునింటఁ బెరుఁగఁజొచ్చెను.

కశ్యపమహర్షి మహర్షులఁ బురస్కరించుకొని యుక్తకాలమున వామనున కుపనయనము చేయ, సవిత సావిత్రి నుపదేశించెను; బృహస్పతి యజ్ఞోపవీత మొసఁగెను. కశ్యపుఁడు మౌంజి నిచ్చెను; అదితి కౌపీన మిచ్చెను. బ్రహ్మ కమండలువును సరస్వతి యక్షమాలికయు సప్తర్షులుఁ గుశపవిత్రములు నిచ్చిరి. ఈప్రకారము వామనుఁడు వటువై తల్లిదండ్రులయాజ్ఞఁ గైకొని బలిచక్రవర్తికడ కేఁగి మూఁడడుగుల దానమురూపమున నాతనిఁ బాతాళమున కనిపి స్వర్గలోకరాజ్యమును నిజసోదరుల కొసఁగి మాతృకాంక్షను దీర్చెను.*

**కశ్యపుఁడే వసుదేవుఁడు దశరథుఁడు నగుట.**

ఒకమాఱు కశ్యపుఁడు కద్రువకోరికఁ దీర్పనెంచి యామెచే ననేకవత్సరములు శుశ్రూషఁ గొని తత్ఫలితముగా నామెతోఁ గ్రీడించుచుండెను. ఆసమయముననే యీవిషయ మెఱుఁగని యదితియు భర్తతోడి సంభోగ మపేక్షించి నూతనవస్త్రాభరణయై యలంకరించుకొని కశ్యపమహర్షి యాశ్రమమున కేఁగెను. కద్రూసహితుఁడైనపతిఁ గాంచి యదితి మాత్సర్యసహితయై తన ప్రయత్నము విఫలమగుటకుఁ జింతించెను. తాను వాంఛించిన సౌఖ్యమునకడ్డు వచ్చిన కద్రూకశ్యపులపైఁ గోపించి వారిని నరులై

* భాగవతము.

జన్మింపుఁ డని యదితి శపించెను. ఆ కారణమునఁ దరువాతఁ గశ్యపుఁడు వసుదేవుఁడుగను గద్రువ దేవకిగను జన్మించిరి. కశ్యపుఁడు ప్రతిజన్మమందును దనకే విష్ణుమూర్తి కుమారుఁడుగా నవతరింపఁ గోరుకొనెను. విష్ణుమూర్తి యాతనికోరిక నంగీకరించి యదితికశ్యపులకు వామనమూర్తియై జన్మించెను. వసుదేవరూపమున నున్నకశ్యపునకే దేవకి యందుఁ గృష్ణుఁడై జన్మించెను కశ్యపుఁడే దశరథుఁడై కౌసల్యయందు శ్రీరామచంద్రునిఁ గాంచెను. ఈవిధముగాఁ గశ్యపునికోరిక ఫలించెను. *

పూర్వ మొకప్పుడు కశ్యపుఁడు సముద్రునిహోమధేనువుల నాతనియనుమతి నింటికిఁ దోలుకొనిపోయి చిరకాల మా గోక్షీరముల ననుభవించెను. తరువాత నొకనాఁడు సముద్రుఁడు వచ్చి యాహోమధేనువుల నిచ్చి వేయుమని కశ్యపునిఁ గోరెను. కశ్యపుఁ డిచ్చివేయ నెంచినను నాతనిభార్య లగు నదితియుఁ గపిలయు నీయ నంగీకరింపని కారణమున మరల వెనుదీసెను. సముద్రుఁడు బ్రహ్మతోఁ జెప్పుకొన్నను బ్రయోజనము లేకపోఁగాఁ గశ్యపుఁడు భూమిపై గోపాలకుఁడై పుట్టుఁగాక యని యాతఁడు శపించెను. ఆశాపముచేతనే కశ్యపుఁడు వసుదేవుఁడై పుట్టి కంసుని గోగణమున కధిపతి యయ్యెను. †

### కశ్యపునివలన దితికి మరుద్గణము పుట్టుట.

ఇంద్రుఁడు బలవంతుఁడై దితికుమారులను బాధించుచుండఁగా నొకనాఁడు దితి భర్తను జేరి విచారముతోఁ దన

* బ్రహ్మవైవర్తపురాణము- † హరివంశము

కింద్రునంతబలము కలయొకకుమారుని నిమ్మని కోరుకొని యనేక వర్షములతనికి శుశ్రూష చేసెను. కశ్యపమహర్షి యామె కోరిక చెల్లించెను. దితి గర్భవతియై యుండఁగా నింద్రుఁ డీవిషయ మెఱిఁగి తనసేవ నంగీకరింపు మని దితిని గోరఁగా నామె యానందించి యంగీకరించెను. ఒకనాఁ డామె యశుచియై శయనించియుండఁగా నింద్రుఁ డామె గర్భమును బ్రవేశించి గర్భస్థశిశువు నేడుఖండములుగాఁ జేసెను. అంత నా ఖండము లేడు నేడుగురుశిశువులై విలపించుచుండఁగా నొక్కొక్కని నేడేసి ఖండములుగా మరల నింద్రుఁడు ఖండించెను. ఈలోపున దితి మేల్కొని యీవిషయ మెఱిఁగి వారతనికి శత్రులు గాక మిత్రులే యగుదురని యింద్రుని రక్షింపవేఁడెను. ఇంద్రుఁడు వారి ననుగ్రహించి వెడలిపోయెను. ఇట్లు వారు నలువదితొమ్మండ్రుగురును బుట్టి 'మరుద్గణ' మనుపేర విలసిల్లిరి.*

## కశ్యపుని జ్ఞానబోధ.

కశ్యపునిభార్యలలో దితిదనువు లొకప్పుడు తమపుత్త్రులు దేవతలచేతిలో మృతిచెందిరని మిక్కిలి దుఃఖింపఁదొడఁగిరి. అపుడు కశ్యపుఁ డట కరుదెంచి వారి కిట్లు బోధించెను. "కాంతలారా ! పురాకృతకర్మఫల మనుభవింపక తప్పదు. మీపుత్త్రులు శమదమదయాధర్మవిరతులు కారు. అందుచే వారు నశించిరి. మీరు వారికై వగవవలదు. ఏలన, దుఃఖము సత్యధర్మములను నశింపఁజేయును. ధర్మక్షయమువలనఁ బుణ్యక్షయ మగును. పుణ్యక్షీణతయే సర్వదుఃఖములకుఁ గారణము. అందుచేతనే మహాఋషులు సంసారము బహుళదుఃఖములకుఁ దావని

* బ్రహ్మపురాణము. మత్స్యపురాణము.

దానిని రోసి దానివలన దుఃఖము తమ కిఁకఁ గలుగకుండుటకై ఘోరతప మొనరింతురు.

నిత్యుఁడు, నిర్వికారుఁడు, నిర్గుణుఁడు నగుపరమాత్మ యందు మాయాశక్తివలనఁ బంచతన్మాత్రలు, పంచభూతములు పుట్టినవి. వానివలన లోకములు, స్థూలశరీరములు మున్నగునవి పుట్టినవి; జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రాణపంచకములు, మనోబుద్ధులు జనించినవి. లింగసూక్ష్మకారణశరీరములతో నైక్యభ్రాంతి నొంది పరమాత్మ జీవుఁడై కర్మఫలభోక్త యగును. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాభిమానియై జీవుఁడు విశ్వుఁడు, తైజసుఁడు, ప్రాజ్ఞుఁడు నగును. శరీరములే తానను కొను జీవుఁడు గురూపదిష్టమహావాక్యములచే అపరోక్షజ్ఞానమంది పునరావృత్తిరహితమైనమోక్ష మందును. ధర్మము శరీరము, సత్యము హృదయము, నగువిష్ణుని భజించి తత్కీర్తన స్మరణపూజావందనములచే జీవుఁడు జీవత్వభావము విడిచి పరమాత్మతాదాత్మ్యము నందఁగలఁడు" ఇట్లు బోధించి వారికి జ్ఞానసుఖ మొసఁగి కశ్యపుఁడు తపమునకేఁగెను. *

## కశ్యపగీతలు

కశ్యపమహర్షి క్షమాగుణమును ప్రశంసించుచుఁ దెలిపిన వాక్యములకే కశ్యపగీత లని పేరు. వీనిభావ మిది:

"క్షమగలవానికిఁ బృథ్వి
సమునకు నిత్యంబు విజయసంసిద్ధియగుఁ
క్షమియైనవాని భుజవి
క్రమము కడుఁ వెలయు సర్వకార్యక్షమమై

*పద్మపురాణము. భూమిఖండము.

వేదములు, యజ్ఞములు, శౌచము, సత్యము, విద్య, ధర్మము, సచరాచరమయిన జగమంతయు క్షమయందే నిలిచినవి. తపస్స్వాధ్యాయ యజ్ఞకర్తలయు, బ్రహ్మవిదులయుం బడయు పుణ్యగతులు క్షమావంతులు నడయుదురు.*

## కశ్యపస్మృతి

కశ్యపస్మృతి లేక కశ్యపధర్మసూత్రము లను పేర నొక ధర్మశాస్త్రము కశ్యపమహర్షి పేరఁ గానఁగుచున్నది. ఇందు సాధారణముగా ధర్మశాస్త్రములలోఁ గానవచ్చు నిత్యాచార శ్రాద్ధాశౌచప్రాయశ్చిత్తాదు లగు విషయములు గలవు. అగ్ని సాక్షిగా వివాహమాడక కొని యింటనుంచుకొన్న స్త్రీ భార్య కాఁజాలదని యామె దేవ పితృకార్యములలోఁ బాల్గొన నర్హు రాలు కాదని కశ్యపుఁడు చెప్పిన శ్లోకమును బోధాయనుఁడు పేర్కొనెను. విశ్వరూప హరదత్తాదు లెల్లరును గశ్యపస్మృతి నుండి యుదాహరించి యున్నారు.

---

* కశ్యపగీతా

క్షమా ధర్మః క్షమా యజ్ఞః. క్షమా వేదా క్షమా శ్రుతమ్.
యఏత దేవం జానాతి నసర్వం క్షన్తు మర్హతి.
క్షమా బ్రహ్మ క్షమా సత్యం క్షమా భూతం చ భావి చ
క్షమా తపః క్షమా శౌచం క్షమయేదం ధృతమ్ జగత్
అతియజ్ఞవిదాన్ లోకాన్ క్షమిణః ప్రాప్నువంతి చ
అతిబ్రహ్మవిదాం లోకా నతి చాపి తపస్వినామ్.
అన్యే వై యజుషాం లోకాః కర్మిణా మపరే తథా
క్షమావతాం బ్రహ్మలోకే లోకాః పరమపూజితాః
క్షమా తేజస్వినాం తేజః క్షమా బ్రహ్మ తపస్వినాం
క్షమా సత్యం సత్యవతాం క్షమా యజ్ఞః క్షమా శమః.

ఓం

శ్రీగురుభ్యో నమః

# శ్రీ మహర్షి జీవిత కథామృతము

## గౌతమ మహర్షి

### స్తుతి

కరముల్ మోడ్చి నుతింతు భక్తి "సురగం
గాపూతతోయార్ద్రభా
స్వరమూర్తిన్ గతధూమసంజ్వలితస
జ్జ్వాలాగ్నికల్పున్ సురా
సురదుర్ధర్షుని నక్షపాదు రచిత
శ్రుత్యర్థవాదున్ వ్రతా
విరళామోదు సుధీయుతుం బ్రతిహతా
విద్యాతమున్ గౌతమున్"

[భాస్కరరామాయణము. బాల. ౧-౨౮.]

శతపథబ్రాహ్మణము ననుసరించి గౌతమమహర్షి బ్రహ్మమానసపుత్త్రులలో నొకఁడు; సప్తర్షులలో సుప్రసిద్ధుఁడు. శ్రుతుల ననుసరించి గోతమవంశమున జన్మించిన యొక మహర్షి. ఈగౌతమమహర్షియే గౌతమధర్మసూత్రములకుఁ గర్త.

## అహల్యాగౌతములవివాహవృత్తాంతము

తొల్లి విష్ణుమూర్తి మోహినీరూపము ధరించి త్రినేత్ర సురాదులసైతము మోహింపఁజేయఁగా నెల్లరును బ్రహ్మసృష్టిని జప్పగఁ దలపోసిరి. ఆకారణమున నధికప్రయత్నమున నఖిలలోకమోహనముగా నబ్జభవుఁ డహల్యా మోహనాంగిని సృష్టించి నైష్ఠికబ్రహ్మచర్యమునఁ దపము సలుపుగౌతమునకుఁ బరిచర్య చేయ నియోగించెను. అహల్య యంగీకరించి హోమాదికృత్యములం దెల్ల నిచ్చ లాతనికి సపర్య లొనరించుచుండెను. గౌతముఁడు నామెయం దేమాత్రమును లౌల్యము లేకుండ నుండెను. కొంతకాలమున కహల్య యౌవనము నంది సౌందర్యమున నద్వితీయయై యలరారెను. అంత గౌతముఁ డామెను దోడ్కొనిపోయి బ్రహ్మ కిచ్చెను. బ్రహ్మదేవుఁ డామెను గౌతమునికే యిచ్చి వివాహము చేయనెంచెను. కాని యామె త్రిలోకసుందరి యగుట "మా కిమ్ము మా కి" మ్మని యింద్రాదిదేవతలే వచ్చి బ్రహ్మ నడుగఁ జొచ్చిరి. గౌతముఁడు మాత్ర మెన్నఁ డడుగలేదు. బ్రహ్మ యుపాయ మూహించి భూప్రదక్షిణము చేసి యెవరు ముందు తనకడకు వచ్చెదరో వారికే యహల్య నిచ్చి పరిణయము చేయుదు నని వాగ్రుచ్చెను. ఇంద్రాదిదేవతలు మహర్షులు కూడ శరవేగమున భూప్రదక్షిణమునకు బయలుదేఱిరి. గౌతమమహర్షి నెమ్మదిగా లేచి యనతిదూరముననే యున్న యొక యుత్తమగోమాతకుఁ బ్రదక్షిణముచేసి యది భూప్రదక్షిణమునకు సమమే యను శ్రుతివాక్యప్రమాణబుద్ధితో మఱి యొకపర్యాయ మాగోవుచుట్టును దిరిగి బ్రహ్మకడకువచ్చి విన్నవించెను. బ్రహ్మ యది సత్యమే

యని మిగిలినవారు తిరిగి వచ్చుసరి కహల్యాగౌతముల కిరువు రకు దివ్యవైభవముతో నుద్వాహ మొనరించెను. ఇంద్రాది దేవతలును గౌతమునిమాహాత్మ్యమునకు మెచ్చి, యసూయా పరు లయ్యు నేమియును జేయలేక యహల్యాగౌతముల దాంపత్యమును బహువిధముల నభినందించి వెడలిపోయిరి.*

## గౌతమమహర్షి క్షామసమయమునఁ బ్రజా సంరక్షణము చేయుట

గౌతమమహర్షి యహల్యాసహితుఁడై దండకావన వాటిక కరిగి మహోగ్రముగ బహుకాలము బ్రహ్మదేవుని గుఱించి తప మొనర్చెను. అంత నాతఁడు ప్రత్యక్షమై గౌత మునికోరిక యడిగెను. ఆతఁడు "బ్రహ్మదేవా! నేను విత్తిన సస్యము జాములోఁ బరిపాకము నందునట్లు వర మొసఁగు" మని వేఁడుకొనెను. బ్రహ్మ యట్లే యని యంతర్ధాన మం దెను. పిమ్మట గౌతమమహర్షి యహల్యాసహితుఁడై 'శత శృంగగిరి' కరిగి యొకపర్ణశాల నిర్మించుకొని యజవరమహా త్మ్యమున నతిథికోటిని షడ్రసోపేతభుక్తిఁ దనుపుచుండెను.

అహల్యయుఁ బతిశుశ్రూషయం దేమఱక శ్రద్ధాభక్తుల తోఁ జరించుచుండెను. గౌతమమహర్షి తపోమహత్త్వముచే నా తఁడు తపముచేయు నాశ్రమము సుభిక్షమై సస్యశ్యామలమై యొప్పుచుండెను. ఇట్లుండఁగా నొకప్పు డొకమహాక్షామము సంభవించెను. ఒక్క గౌతమాశ్రమభూములు తప్ప భూభాగమం దెల్లెడలను బంటలు నశించెను. జనులు క్షుద్బాధాతురులై

* బ్రహ్మాండపురాణము.

చనిపోవఁ దొడఁగిరి. ఆహారముఁ గానక కొందఱు శవము లనే తినఁ దొడఁగిరి. ఇట్లుండఁగా ననేకు లగుఋషులు బ్రాహ్మణులు గౌతముని కతిథులుగా రాఁ జొచ్చిరి. గౌతమమహర్షి యహల్యాసమేతుఁడై భక్తిపూర్వకముగా నందఱి నాహ్వానించుచుఁ దనతపశ్శక్తిచే నెల్లరకుఁ గడుపునిండఁ గూడును గట్ట నూతనాంబరములు నిచ్చుచుండెను. గౌతమమాహాత్మ్యము దశదిశల నెఱుకపడఁగా నానాఁటికి జనులు తండోపతండములుగా వచ్చి యహల్యాగౌతముల యాహ్వానముపై వారు చేయుమర్యాదలకు నిర్విణ్ణులై యచటనే భార్యాపుత్రాదులతో నివసింపఁదొడఁగిరి. ఈప్రకారము దినదినము జనులు వృద్ధియగుటచే గౌతమమహర్షి యాశ్రమము సహస్రయోజనాధికము కాఁజొచ్చెను గౌతమమహర్షి కీర్తి యింద్రలోకమునకుఁ బ్రాకెను. ఇంద్రుఁడు నారదుఁడు మున్నగువారు వచ్చి యహల్యాగౌతముల వితరణమునకు మెచ్చి వారి ననేకవిధముల శ్లాఘించి పోవుచుండిరి. పార్వతీతనయుఁ డగు విఘ్నేశ్వరుఁడు గౌతముని ప్రతిజ్ఞాభంగ మొదవించుప్రయత్నమున బ్రాహ్మణరూపధారియై వచ్చి యహల్యాగౌతములచే నధిక సత్కారముల నంది యకృతార్థుఁడై యాయాశ్రమముననే యుండఁ జొచ్చెను.

ఆదినములలో గౌతమాశ్రమము భూలోకస్వర్గమై పోయెను. క్షణక్షణమును బెరుగుచున్న ప్రజాసముదాయమునకు నిరంతరము నహల్యాగౌతము లేలోపమును లేకుండఁ జూచుచుండిరి. యావత్ప్రపంచము నతిథిలోక మయ్యెను. నిజతపోనవద్యతచే నంతలోకమున కొక్క-గౌతమమహర్షి యే

భిక్షాప్రదాత యయ్యెను. క్షణమైన నేమఱ కహల్యాగౌతము లతిథిసేవలో మునిఁగియుండి యెల్లరకు షడ్రసోపేతముగ విందులొనరించుచు నూతనాంబరము లొసంగుచుండఁ బ్రతి రాత్రియును బ్రతిపురుషునకుఁ గలలోసైతము గౌతముఁడును బ్రతిస్త్రీకి నహల్యయు "మీ కేమి కావలయును? మీ కేమి కావలయును? దయతో సెలవిం" డని యనునయించుచున్నట్లె గానవచ్చుచుండిరి. ఆహా! నిజతపోమహత్త్వమున లోకము నుద్ధరించిన యాయార్యర్షి మాహాత్మ్య మేమి! అహల్యాసాధ్వి యదృష్ట మేమి!

ఇట్లుండఁగా నొకనాఁడు విఘ్నేశ్వరుఁడు తల్లి కొనర్చిన వాగ్దానము ననుసరించి శివజటాజూటమునఁ గలగంగను భూమిఁ కిఁ బంపివేసినచోఁ బార్వతికి సవతిబాధ యుండ దని యుపాయ మాలోచింపఁ దొడఁగెను. గౌతము సంతటిమహర్షికిఁ దక్క నన్యుల కంతపని సాధ్యము కా దనుకొని గౌతము నాపనికై వినియోగించు ప్రయత్నమున నాతఁ డుండెను. ఒకనాఁడు బ్రాహ్మణుల నందఱ సమకూర్చుకొని గౌతమాశ్రమమును వీడి పోవ నాతఁ డుద్యుక్తుఁ డయ్యెను. ఈసంగతి యెఱిఁగి గౌతమమహర్షి వారి నందఱ నటనే యుండి తన యాశ్రమము నింకను బవిత్రముచేయుఁ డని కోరుకొనెను. మాయాబ్రాహ్మణుఁ డగువిఘ్నేశ్వరుఁ డాలోచించి పార్వతి చెలికత్తె నొకతెఁ బిలిచి మాయాగోవై గౌతమునిపొలములో మేయు మనియు గౌతముఁ డేమి చేసినను వెంటనే చని పొమ్మనియు నియోగించెను. ఆప్రకార మామె మాయాగోవై యట మేయఁ జొచ్చెను. గౌతముఁడు దానిని జూచి యొక గఱిక విసరఁగనే యది చనిపోయెను. గౌత

మునిగొప్పతనమున కనూయాగ్రస్తు లగు బ్రాహ్మణు లంద ఱొక్కపెట్టున గోహత్యాపాతకుఁ డని గౌతముని నిందింపఁ దొడఁగిరి. బ్రాహ్మణ రూపమున నున్న గణపతియు నాతనిం దూఱి బ్రాహ్మణులెల్లరఁగూడి యటనుండి పోఁబోవుచుండెను. అహల్యావైభవమును దిలకించి మత్సరగ్రస్తలైనస్త్రీలు నిదే సమయ మని యహల్యాగౌతముల నిందించుచుఁ దమతమభర్తల ననుసరించిరి.

## గౌతముఁడు తన్నుఁజూచి యసూయపడిన బ్రాహ్మణుల శపించుట

అహల్యాగౌతములు తమకుఁ గలిగినప్రమాదమున కెంత యుఁ జింతించి వారల సందఱఁ బాపముక్తి యెట్లుకలుగునో చెప్పి కాపాడుఁ డని కోరుకొనిరి. కొంతసేపు బతిమాలించుకొని విఘ్నేశ్వరుఁడు గౌతమునితో "ఋషివరా! శివునిగుఱించి తపము చేసి యాతని మెప్పించి శివజటాజూటమునఁ గలగంగాభవాని నిటఁ బ్రవహింపఁజేసినచో నీపాపము శమించుటే కాక త్రిజగ త్పూజ్యత నీకుఁ గల్గు"నని చెప్పి వెడలిపోయెను. ఈలోపున ఘోరవర్షములు గురిసి క్షామము తలఁగుటచే బ్రాహ్మ ణులు గౌతముని నిందించుచునే వెడలిపోయిరి. గౌతముఁడు దన కిట్టితప్పిద మేల వచ్చిన దని యోగదృష్టిచేఁ జూడఁగా విఘ్నే శ్వరుఁడు పన్నినవ్యూహము, తనయింటికడఁ దిని యసూయాగ్ర స్తులైనబ్రాహ్మణులును గోచరించిరి. గౌతమమహర్షి విఘ్నే శ్వరుని దేవకార్యము సిద్ధింపఁ జేయుటయే తనవిధి యని నిశ్చ యించుకొనెను. కాని, యసూయాగ్రస్తు లగుబ్రాహ్మణులు తన్నుఁ దిట్టిన కారణమున వారిని బాషండులు కండని శపించెను.

ఈసంగతి యెఱిఁగి బ్రాహ్మణు లందఱు భయకంపితులై వచ్చి గౌతముని శరణు వేఁడిరి. గౌతమమహర్షి కరుణించి తన శాప మమోఘమనియు వారు కొంతకాలమునకు శ్రీకృష్ణుఁడు జనించిన పిమ్మట ముక్తి నందుదు రనియుఁ జెప్పి వారి ననునయించెను.*

## గౌతమమహర్షి గంగను భూమికిఁ దెచ్చుట

గౌతముఁడు వెంటనే బయలుదేఱి యహల్యాసహితుఁడై హిమవన్నగమును జేరి యానగప్రదేశమున నొక్కచోట సౌధాంబస ధేనుయూధనిస్స్రుతదుగ్ధధారాధునీతీర పారిజాతవనాంతరచింతామణిస్థలమున విడిసి యేకపాదస్థుఁడై మహోగ్రముగ శివునిఁ గూర్చి తపస్సు చేయఁదొడఁగెను. అతని తపోమాహాత్మ్యమున కచ్చెరువంది శివుఁడు ప్రత్యక్షమయ్యెను. గౌతమమహర్షి శివు ననేకవిధముల స్తుతించి గంగాదేవిని భూతలమునకుఁ బంపు మని వేఁడుకొనెను. శివుఁడనుగ్రహించెను. గంగాదేవి గౌతమునికోరికపై భూలోకమునకు వచ్చి మాయాగోవు చనిపోయినచోటఁ బ్రవహించి గోవును బ్రతికించి భూమిని బవిత్రము చేసెను. ఇంతలో గౌతముని నిందించిన బ్రాహ్మణు లాగంగాజలమున స్నానము చేసి తరింప వచ్చిరి. అంత గంగాదేవి వెంటనే తనరూప ముపసంహరించుకొని యదృశ్య మయ్యెను. గౌతముఁ డెంతయో ప్రార్థింపఁగా నాతని నిందించినబ్రాహ్మణులు తనలో స్నానము చేయవచ్చి రనియు వారిమహాపాపమును దాను భరింపఁజాల ననియు నామె చెప్పెను. గౌతమమహర్షి పరిపరివిధముల నామెను బ్రార్థించి బ్రాహ్మణులను క్షమింపు మనియుఁ

* శివపురాణము, జ్ఞానసంహిత, వరాహపురాణము.

దిరిగి భూమిపైఁ బ్రవహింపు మనియుఁ గోరుకొనెను. గంగ యనుగ్రహించి తిరిగి భువిపై నవతరించెను. ఆగంగామాతయే గౌతమునిమూలమున నవతరించుటచే 'గౌతమి' యనియు గోవును బ్రతికించుటచే 'గోదావరి' యనియు ముల్లోకములు స్తుతింప నేఁటికి నలరారుచున్నది.*

## గౌతముఁ డహల్యకొసఁగినసంతానము

అహల్యాగౌతము లన్యోన్యముగఁ గాఁపురముచేయుచుండిరి. అహల్యాసాధ్వి బ్రహ్మర్షి వరుఁ డగుగౌతమునిసహధర్మచారిణియై నిజశుశ్రూషామహత్త్వమున నాథునియుల్లము రంజిల్లఁజేయుచుండెను. ఆమె త్రిలోకసుందరియయ్యుఁ దుచ్ఛకామములకు లోనుగాక పతిసేవయే మహాభాగ్యముగా వెలుఁగొందుచుండెను. ఆసాధ్వి పాతివ్రత్యమునకు వెఱఁగొంది యామెఁ దలపోయుటయే యింద్రాదులుసైతము మానుకొనిరి. ఇట్లు పవిత్రహృదయముతోఁ దన్ను సేవించుభార్యను మెచ్చి గౌతముఁడు గృహస్థధర్మములోఁ బుత్త్రోత్పాదన ముత్తమవిధి యగుట స్మరించి యహల్యను బిల్చి యొకవరముఁ గోరుకొమ్మనెను. అహల్య కొడుకు ననుగ్రహింప గౌతముని వేఁడుకొనెను. గౌతముఁ డంగీకరించి యామెకుఁ గామవాంఛఁ దీర్ప నామె గర్భిణియై యుక్తకాలమున శతానందుఁ డనుకుమారుని గనెను. వెంటనే యాబాలుఁడు తపోజీవన మారంభింపఁ దలిదండ్రులయాజ్ఞఁగొని వెడలిపోయెను. ఈతఁడే శరద్వంతుఁ డనియుఁ బిలువఁబడుచు మహాతపస్సంపన్నుఁ డాయెను. కాలక్రమమున నీతని వీర్యమునుండియే కృపి, కృపాచార్యుఁడు జన్మించిరి. మఱి

* వరాహపురాణము. బ్రహ్మపురాణము.

యొక పర్యాయము కామవాంఛోపహతయైనయహల్యకు గౌతము సనుగ్రహమున గర్భమై యంజన యనుకూఁతు రుద్భవించెను. ఈయంజన పితృవాత్సల్యమునకు గుఱియై నిరంతర మహల్యకడనే యుండుచుండెను. ఈమెకొడుకే ఆంజనేయుఁడు.

మఱికొంతకాలమునకు గౌతముని కృపవలన అహల్య గర్భము ధరించి, మఱియొక కొమార్తెను గాంచెను. ఈ కుమారినే గౌతముఁడు తనశిష్యుఁడగు నుదంకమహామునికి నూతన దేహము నవయౌవనము నొసఁగి తనువాత నిచ్చి వివాహము చేసెను. (భార. అశ్వ. 3-౮౧.)

## గౌతముఁ డహల్యాశక్రుల శపించుట.

అహల్యవివాహ మైనప్పటినుండియు నింద్రుఁ డామె లోకాతీతసౌందర్యమునకు వశుఁడై యామెపొందు కోరుచునే యుండెను. కాని, యహల్యాసాధ్వీచిత్తవృత్తి యెఱిఁగి గౌతమమహర్షి కోపానలమునకు వెఱచి యుండెను. కాని, యొకనాఁ డింద్రుఁడు దనకోర్కె దీర్చుకొనఁగోరి యొక యుపాయ మాలోచించి కోడియై గౌతమాశ్రమమునఁ జేరి నాఁటినడు రేయియే కూయఁదొడఁగెను. ఈకోడికూఁత విని గౌతమమహర్షి కాలకృత్యనిర్వహణమునకు నదీస్నానము నకై యాశ్రమము వీడి వెడలిపోయెను. ఈయవకాశమును బురస్కరించుకొని యింద్రుఁడు గౌతమవేషముతో నాశ్రమముఁ బ్రవేశించి యహల్యతోడి సంగమ మపేక్షించెను. ఆమె యింద్రోహ మెఱుఁగఁజాలక కామోపహతుఁడగు భర్తకు వ్యతిరేకము పలుకలేక యంగీకరించెను. అంత వారిరువురును నొడలు మఱచి సుఖానుభవము నందుచుండ

గౌతముఁ డింకను జాలపొద్దు గలదని యాశ్రమమునకు వచ్చి చేరెను. లోపలఁ బ్రవేశింపఁగనే యహల్య యాశ్చర్యపడి "మహాత్మా! ఇంతవఱకు నాతోనున్న నీ విట్లు రెండురూపము లేల తాల్చితి" వని ప్రశ్నించెను. ఇంద్రుఁడు వణఁకి పోయి పిల్లియై బయటకుఁ బోఁ జూచెను. గౌతమమహర్షి యాపిల్లిని జూచి "ఓరీ! నీవిషయమును ద్వరలోఁ జెప్పనిచో దగ్ధమై పోదు" వనెను. ఇంద్రుఁడు స్వరూపమును ధరించి తనయహల్యాపేక్ష క్షమింపు మని కాళ్ళపైఁ బడెను. అహల్య యాశ్చర్యభరితయై "మహాత్మా! ఈమోసము నే నెఱుఁగను. నీవు తిరిగి వచ్చి నాతనుసౌఖ్య మపేక్షించితి వని యెంచి తీర్ప నెంచితిని. ఇంతకు మించి పంచభూతములు దోడుగా నే నొం డెఱుఁగ" నని శపథము చేసెను. వెంటనే యాకాశవాణి యహల్య నిర్దోషిణి యని పల్కెను. ఐనను, గౌతమమహర్షి యూరకుండక "నీ వెఱిఁగి చేసినను నెఱుఁగక చేసినను దోషము దోషమే. అజ్ఞానముననైన నగ్ని సంస్పర్శమున హస్తము కాలకుండునా! కావున, నీవు చైతన్యహీన మగుశిలవై పడియుండు" మని శపించి యింద్రునిఁ జూచి "దుర్మార్గా! దేవేంద్రా! శచీపతివయ్యు నీకామలాలసతకు మితిమేరలు లేకుండఁ బ్రవర్తించితివి. అగ్నిహోత్రముతో సపహాసము చేయుతుంటరిమిడుత వైతివి. ఓరీ! నీచా! మహాపతివ్రత యగుమహర్షిపత్నిని మోసగించి పరమహేయ మగుపనికిఁ బాల్పడితివి. కావున, నీయండము లూడిపడి పోవుఁగాక! నీశరీర మంతము యోనిమయమై నీకు నిత్యఖేద మొదవించును గాక! నీసామ్రాజ్యము శత్రువు లప

హరింప నీవు పదభ్రష్టత నంది దైన్యజీవనముఁ గడపుదువు గాక!" యని తీవ్రముగా శపించెను. వెంటనే యహల్యా సంక్రందను లిరువురు నాతనిపాదములపైఁ బడి శాపవిముక్తి ననుగ్రహింప వేఁడుకొనిరి. గౌతమమహర్షి కొంతసరికిఁ గటాక్షించి యహల్య వైపు చూచి, "పాపాత్మురాలా! నీవు శిలవై శీతవాతాతపంబుల నోర్చి నిరాహారవై రాత్రిందివములు రామస్మరణపూర్వకముగా సహస్రాధికవర్షములు తపింపుము. ఈయాశ్రమపద మిఁక జంతు విరహిత మయ్యెడు. తుదకు శ్రీరామచంద్రునిపాదారవిందరజః పుంజము నీశిరముపైఁ బడఁగానే నీకు శాపవిముక్తి యగును. నాఁడు నీవు తిరిగి పవిత్రాంగివై నాకడకు రావచ్చును." అని పలికి యింద్రునిఁ జూచి "మహాపాపాత్మా! నీపైని నాకుఁ గరుణ ముదయించినది. మహర్షులకోపము నీటిపై గీచినగీఁత వంటిది. నీయోను లితరులకుఁ గనపడకుండ నుండును. అవి నేత్రములవలెఁ బైవారికిఁ దోఁచును. స్వర్లోకసామ్రాజ్యవిహీనుఁడవయ్యుఁ దిరిగి కొంతకాలమునకు స్వపదప్రాప్తినందఁగలవు." అని కరుణించి గౌతముఁడు హిమగిరి కరిగి తపోనియతి నుండెను. ఇంద్రుఁడు వండము లూడి క్రిందఁబడ దేహ మెల్లెడ యోను లేర్పడఁ బశ్చాత్తప్తుఁడై వెడలిపోయెను. గౌతమ మహర్షి శాపమున నింద్రుఁడు పదచ్యుతుఁడై తిరిగి కొంతకాల మునకు స్వారాజ్యము నందఁగల్గెను. అహల్యయుఁ జిరకాలము నకు శ్రీరామునిపాదరజము సోఁకఁగనే స్త్రీరూపము నంది పర మేశ్వరపాదసంస్పర్శముచేఁ బవిత్రయై గౌతమమహర్షిని జేరి సేవించుచు మహాపతివ్రతయై వెలసెను.*

---

* రామాయణము. పద్మపురాణము.

## గౌతముఁడు బ్రహ్మదత్తుని శపించుట

మహర్షిసత్తముఁ డగుగౌతముఁ డొకనాఁడు బ్రహ్మదత్తుఁ డనురాజునింటి కేఁగి యాతిథ్య మిమ్మనెను. ఆతఁడు బ్రహ్మానందముతో నాపరమమునీంద్రు నింట నుంచుకొని చిరకాల మాతని కాతిథ్య మిచ్చి పోషించుచుండెను. అశ్రద్ధ కారణముగా నొకనాఁడు గౌతమునిభోజనపదార్థములలో నొకమాంసపు ముక్క కానవచ్చెను. గౌతముఁ డాదోషపరిహారణార్థమై బ్రహ్మదత్తును గ్రద్దవై పుట్టు మని శపించెను. బ్రహ్మదత్తుఁడు తనయెఱుఁగమిఁ దెల్పి శాపవిముక్తిఁ గోరెను. గౌతముఁడు కరుణించి శ్రీరాముని హస్తము సోఁకఁగనే యాతనికిఁ బూర్వరూపము లభింప వరమిచ్చెను. ఆప్రకారము బ్రహ్మదత్తుఁడు గ్రద్దయై పుట్టి యొకనాఁ డొకగ్రుడ్లగూబతోఁ బోరి శ్రీరామునికడకు వచ్చి తగవు తీర్పు మనఁగా నాఁతడు తన పవిత్రహస్తమున నాగ్రద్దను నిమురఁగా నది శాపవిమోచన మంది బ్రహ్మదత్తుఁడై శ్రీరామునిఁ గీర్తించి తననగరమున కేఁగి సుఖముండెను. ఈరీతి గౌతమమహర్షి యశ్రద్ధాదోషాపహారణమునకై భక్తవరుని శపించియుఁ దనక్రోధరాహిత్యమునకు నిదర్శనముగా వానికి శాపావధి నియమించి కరుణించెను.*

## గౌతమధర్మసూత్ర-స్మృతి- న్యాయసంహితలు

గౌతమమహర్షి లోకమునకుఁ బ్రసాదించినవానిలో గౌతమధర్మసూత్రములు లేక గౌతమ స్మృతి, గౌతమన్యాయ-తర్క-శాస్త్రము, గౌతమసంహితలు ముఖ్యములు. ఇందు మొదటి దానియందుఁ ద్రికాలాబాధ్యములై యైహికాముష్మికముల

---

*ఉత్తరరామాయణము

నొసఁగు పరమ ధర్మము లిరువదియెనిమి దధ్యాయములలో విధివిహితముగా వివరింపఁబడినవి.

రెండవ దగున్యాయశాస్త్రమునఁ బరమప్రయోజనకర మగుతర్కశాస్త్ర మద్భుతముగా నిగదింపఁబడినది. నాఁటి నుండి నేఁటివఱకు నీన్యాయశాస్త్రమే మహాలంకారమై పండితమండలికి శిరోభూషణమై తనరారుచున్నది. ఈన్యాయ శాస్త్రమును ఖండింపఁజూచిన వ్యాసునిపైఁ గోపించి యపర శంకరుఁ డనఁదగు గౌతముఁ డాతనిఁ దననేత్రములతోఁ జూడ నని శపథముఁ బూనెను. ఆప్రకార మొకసారి వ్యాసుఁ డరుదెంచి నపుడు గౌతముఁడు తనపాదమున నేత్రము సృష్టించుకొని యాతనిఁ జూచెను. వ్యాసుఁడు గౌతము నభినందించి వెడలి పోయెను. నాఁటినుండి గౌతమమహర్షి "అక్షపాదుఁ" డయ్యెను.

ఈ గౌతమన్యాయశాస్త్రము ప్రతిజ్ఞాహేతూదాహర ణాది షోడశపదార్థనిరూపకమై పంచాధ్యాయాత్మకమై యొప్పు చున్నది. ప్రథమాధ్యాయప్రథమాహ్నికమందుఁ బ్రమాణాది పదార్థనవకలక్షణనిరూపణము, ద్వితీయాహ్నికమున వాదాది సప్తలక్షణనిరూపణము గలవు. ద్వితీయాధ్యాయప్రథమద్వితీ యాహ్నికముల సంశయపరీక్షణాదికము, అర్థాపత్త్యాద్యం తర్భావనిరూపణము గలవు. తృతీయాధ్యాయమున శరీరేంద్రి యార్థబుద్ధిమనఃపరీక్షణము, చతుర్థాధ్యాయమునఁ బ్రవృత్తి దోషాదికము, దోషనిమిత్తాదికము, పంచమమున జాతిభేద, నిగ్రహస్థానభేద నిరూపణము గలవు

గౌతమసంహిత మహోన్నతమగు జ్యోతిశ్శాస్త్రము. ఇం దనేకము లగు నపూర్వజ్యోతిషవిషయములు వివరింపఁ బడినవి.

ఈరీతి గౌతమమహర్షి మహాశాస్త్రవేత్తయై యద్వితీయ తపోధనసంపన్నుఁడై గోబ్రాహ్మణసంరక్షణదీక్షాదక్షుఁడై ధర్మసూక్ష్మప్రవచనవీరుఁడై సప్తమహర్షులలో నొకఁడుగా నెన్నఁబడుచుఁ బరమమాన్యుఁడై యాకల్పాంతముఁ జిరస్థాయి యైనాఁడు. ఆమహాత్ముని పవిత్రజీవితవిశేషమనసముచే భారతప్రజలు తరింతురుగాక !

"చరియించువారికి సంకల్పసిద్ధిగా
నిర్మించె నెవ్వాఁడు నిజవనంబు
సార్వకాలికఫలసస్యంబుఁ గల్పించి
వరమునిశ్రేణి నెవ్వాఁడు బ్రోచె
చీకటితప్పు చేసిన నెవ్వఁ డడరించె
నింద్రునితను వెల్ల హేయముగను
ఉర్వీసురశ్రేణి కొరిమ లేకుండంగఁ
బలికె నెవ్వఁడు ప్రతాపంబు మెఱసి
ధర్మశాస్త్రము నుత్తమతర్కశాస్త్ర
మర్మములఁ దెల్పె నెవ్వండు మహిమ మెఱయ
నట్టి శ్రీవీరశైవాగమాదివేది
యైనగౌతమసంయమి నభినుతింతు.

[కేదారఖండము]



ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీమహర్షి జీవితకథామృతము

## చ్యవనమహర్షి

**స్తుతి**

భృగువంశాంబుధిచంద్రుఁడై తపమునన్ విస్ఫురత్ప్రభావాఢ్యుఁడై
సుగుణాలంకృత యౌ సుకన్యసతియై శుశ్రూషలం జేయఁగా
జగదుద్ధారకు లౌ సుతుల్ గలుగ శశ్వద్యోగమార్గంబునన్
సుగతిం గాంచినపావనాత్ము చ్యవనున్ గొల్తున్ మహర్షీంద్రునిన్.

భృగుమహర్షికిఁ బులోమ యనునొకభార్య యుండెను. ఆమె తనశుశ్రూషచేఁ బతిమనస్సును హరించెను. ఒకనాఁడు భృగుమహర్షి యామెకోరిక యడిగెను. పులోమ భర్తకు భక్తిపూర్వముగా వందనము చేసి "మహాత్మా! మీసేవాభాగ్యముకన్న నాకుఁ గావలసిన దేదియును లేదు. ఐనను, వంశోద్ధారకుఁడు బ్రహ్మర్షివరేణ్యుఁడు నగునొక పుత్త్రుని దయచేయుఁ" డని వినయవిధేయతలతోఁ గోరుకొనెను. భృగుమహర్షి యంగీకరించి యామెకు గర్భము నిలిపి యామెకోరికపై నగ్నిహోత్రము సిద్ధముచేయుట హోమద్రవ్యము లందిచ్చుట మున్నగుపనుల నామెచేఁ జేయించుచుండెను.

## చ్యవనుఁడు జన్మించి పులోముని భస్మము చేయుట.

ఒకనాఁడు యథాపూర్వముగా సతి నగ్నిహోత్రమును సిద్ధము చేయుమని చెప్పి భృగుమహర్షి స్నానమునకై నది కేఁగెను. పులోమ యగ్ని రగిల్చి జాజ్వల్యమానముగా వెలిఁగించెను. పులోముఁ డనురాక్షసుఁ డొకఁడు చిరకాలమునుండి పులోమను ప్రేమించి యామెను వివాహమాడుదు నని చెప్పుచుండెను. కాని, యామెతలిదండ్రు లామె నాతని కీయక భృగుమహర్షి కిచ్చి వివాహము చేసిరి. నాఁటినుండియు నవకాశము లభించినపు డీమె నపహరింప నా రాక్షసుఁడు వేచియుండెను. నాఁ డాతఁడు భృగుమహర్షి లేకుండుటఁ జూచి యామె యున్నయగ్నిగృహమును ప్రవేశించెను. ఆమె పులోమ యగునా కాదా యను సంశయముతో నగ్నిహోత్రు నామె యెవ రని యడిగెను. అగ్నిదేవుఁడు విప్రశాపమునకు నసత్యదోషమునకు వెఱచియు విప్రశాపముఁ గ్రమ్మఱించుకొనవచ్చిన వచ్చుఁ గాని యసత్యదోషము తీర్పరాని దని నిశ్చయించుకొని యామె భృగుపత్ని యని చెప్పెను. పులోముఁడు వెంటనే వరాహరూపము ధరించి యామె నెత్తుకొని పాఱిపోఁ జొచ్చెను. అపు డామెగర్భము చ్యుతము కాఁగా నొకయర్భకుఁడు బయటపడెను. మాతృగర్భచ్యుతుఁ డగుట నాతనికి 'చ్యవనుఁ'డను పేరు కలిగెను. ఆబాలుని తీవ్రతేజము చూచినమాత్రమునఁనే పులోముఁడు భస్మీభూతుఁడై పోయెను.

పులోమ సంతసమున నాబాలు నెత్తుకొని గృహమున కరుదెంచెను. అంతలో భృగుమహర్షి స్నానాదికము నొనర్చి

యింటికి వచ్చెను. పులోమ జరిగినయుదంత మంతయుఁ జెప్పి పతికి బాలునిఁ జూపెను. భృగుమహర్షి యంతఁ దన భార్య నారక్కసునికిఁ జూపినయగ్నిపైఁ గోపించి యతిక్రూరుఁడు సర్వ భక్షకుఁ డగుఁగాక యని యాతనిని శపించెను. అగ్నిహోత్రుఁ డిది విని కోపించి తన తేజోమూర్తి నుపసంహరించుకొనఁగా బ్రహ్మాదులు భృగుశాప మమోఘ మనియు నైన నగ్ని సర్వ భక్షకుఁ డైనను శుచులలో నత్యంతశుచి,పాత్రులయందుఁ బరమ పాత్రుఁడుఁ, బూజ్యులలోఁ బరమపూజ్యుఁడు వేదచోదితవిధా నముల విప్రసహాయుఁడై భువనముల నడపు నని వరము లను గ్రహించి యగ్నికోపముఁ బాపి శాంతింపఁ జేసిరి.*

## చ్యవనుని తపోనిరతి

ఈవిధముగా జన్మించినచ్యవనుఁడు పులోమామాతృ స్తన్యములఁ బెరిఁగి పెద్దవాఁ డగుచుండెను. భృగుమహర్షి తన యున కుపనయనాదిక మొనర్చి బ్రాహ్మణప్రధానవృత్తియు, జీవితపరమావధిని సిద్ధింపఁ జేయునదియు నగుతపోజీవనమునకుఁ గుమారుని మనసుగొలిపి విడిచిపుచ్చెను. చ్యవనుఁడు తల్లిదండ్రు లకుఁ గృతప్రణాముఁడై బయలుదేఱి వైదూర్యపర్వతప్రాంత మున కరిగి యొకసరోవరముపొంత మహాతపోనిష్ఠాగరిష్ఠుఁడై యుండెను. అతఁ డట్లు తపోవృత్తి నుండఁగఁ గొన్ని వేలసంవత్స రములు గడచెను. ఆతఁడును వృద్ధుఁ డయ్యెను. దేహమును మఱచి పరమేశ్వరునిపై మనసు లగ్నముచేసి దివ్యానందము నాతఁ డనుభవించుచుండఁగా నాతని దేహము పుట్టలుపెట్టెను.

---

* భారతము. ఆదిపర్వము.

లతాగుల్మములు లాపుట్టలపై మొలిచి యల్లుకొనుచుండెను. ఐన, నా చ్యవనునకు దేహస్మృతి లేకుండెను.

### చ్యవనుఁడు సుకన్యను వివాహమాడుట

ఇట్లుండఁగా సంయాతి యనునొకరాజు చతుస్సహస్రదేవీనివహముతోడను సుకన్య యనుకూఁతుతోడను సైన్యసమేతుఁడై యాసరోవరమున జలక్రీడార్థమై వచ్చియుండెను. ఆతనికుమారి చక్కనిచుక్క యగు సుకన్య యువతీజనపరివృతయై యందుఁ దిరుగుచుఁ బుట్టలువోసినచ్యవనునికడకు వచ్చెను. ఆపుట్టలోనుండి చ్యవనునినేత్రములు ఖద్యోతద్యుతులవలె మెఱయుచుండుటఁ గాంచి సుకన్య యానేత్రములఁ బొడిచెను. చ్యవనుఁ డిది యెఱిఁగి సంయాతిసైన్యమునకు మూత్రపురీషనిరోధము గావించెను. సంయాతి దానికిఁ గారణ మరయలేక వెఱఁగుపడెను. ఇంతలో సుకన్య తండ్రికడకు వచ్చి తా నొకపుట్టలో రెండు మిణుఁగురులను జూచి పొడిచిన సంగతి చెప్పెను. సంయాతి యట కరిగి యందుఁ దపఃక్లేశత్వగస్థిభూతశరీరుఁడు నతివృద్ధుఁడు నగుచ్యవనుని జూచి యాతనిపాదములపైఁ బడి శరణుచొచ్చి తన కూఁతునపరాధము మన్నింపు మని వేఁడుకొనెను. చ్యవనమహర్షి భవితవ్యము నెఱిఁగి సుకన్యను దన కిచ్చి వివాహము చేసినచో క్షమింతు ననెను. సంయాతి యంగీకరించి కూఁతు నడుగఁగా సుకన్య "తండ్రీ! ఇంతకన్న నాకుఁ గావలయున దేమున్నది! పరమతపోధనుఁ డగు బ్రహ్మర్షిని భర్తగాఁ బడయుమహాభాగ్యమున మనవంశమును బరమపవిత్ర మొనరింపఁ గల్గితి నేని నాపుట్టువు చరితార్థమగుఁగదా! కావునఁ దప్పక మీ

రట్లొనర్పుఁ" డని సమ్మతించెను. అందుల కెంతయు నానం దించి యచ్చటనే యాబ్రహ్మర్షికిఁ దనకూఁతు నిచ్చి పరిణయము చేసి సైన్యనిరోధమును బాపికొని సుకన్య నట విడిచి సంయాతి తననగరమునకుఁ బోయెను.

సుకన్య తనకు ఋషిశ్రేష్ఠుఁ డగుచ్యవనుని సేవాభాగ్యము లభించిన దని మహోత్సాహముతోఁ బరిచర్య చేయుచుండెను. తాను యువతి యయ్యు సుకన్య వయోవృద్ధుఁడు జీర్ణాంగుఁడు నైనను నిజభర్తయే పరమదైవ మని యాతని నారాధించుచుండెను. ఆమె భర్తయనుగ్రహమున నాత్మానందమును గుర్తెఱిఁగి తుచ్ఛదేహ వాంఛోపహత గాక పరమపవిత్రజీవితమును గడపుచుండెను.

## చ్యవనుఁడు నవయౌవనుఁ డగుట.

ఇట్లుండఁగా నొకనాఁ డాశ్వినేయు లీమెసౌందర్యమును విని యచ్చెరువంది చ్యవనాశ్రమమునకు వచ్చి యొంటరిగ నున్నసుకన్యఁ జూచి యామెనామధేయాదుల నడిగి పలుకరించిరి. సుకన్య తాను సంయాతి కూఁతుర ననియు చ్యవనమహర్షి భార్య ననియుఁ జెప్పెను. అంత వారు 'కాంతా! త్రిలోకసుందర మగునీశరీరము నట్టిముసలివగ్గున కిచ్చుటచే నీకుఁ గామభోగానందము సంభవించుచున్నదా ? ఇఁక నైనను నీ సౌందర్యము నడవిని గాచినవెన్నెల కానీకుము. పరమ సుందరు నొకనిఁ గోరుకొమ్ము. మేము తీసికొనివత్తు' మనిరి. అంత సుకన్య "మహాత్ములారా ! మీకు నాపై నింత యాదర మేల కలిగినదో యెఱుఁగను. పరమపావన మగునాపతిపాద సేవ కత్యధిక మగుభక్తిశ్రద్ధ లొసంగ మీరు సమర్థు లేని

యట్లొసంగుఁడు. లేనినాఁడు మీదారిని మీరు పొం" డని బదులు చెప్పి నాథునికడ కేఁగి యావిషయమును దెల్పెను. ఆతఁడు వారు చెప్పినట్లు చేయు మని యాదేశించెను. భర్త యానతియందలి యంతరార్థమును గ్రహించి వెంటనే యాశ్వినులకడ కరుదెంచి యామె తనకు నవయౌవను నొకనిఁ దెండని కోరెను. వారు బ్రహ్మానందము నంది సమీపమునఁ గల కొలనులో దిగుసరికి నవయౌవనులైరి. చ్యవనుఁ డది చూచి తాను నందు దిగి నవయౌవనుఁడై వారితోపాటు సుకన్యకడ కరుదెంచెను. మహాపాతివ్రత్య ముట్టిపడ సమానరూప వయోవిలాసముల నొప్పునాముగ్వురలో నామె చ్యవనునే వరించెను. అశ్వినులానందించి యామెపవిత్రపాతివ్రత్యము నభినందించి యామెను బరీక్షించుట కట్లొనర్చితిమని చెప్పిరి.*

## చ్యవనుఁ డాశ్వినులను సోమపీథులఁ జేయుట

చ్యవనుఁడు తన కశ్వినీపుత్త్రులమూలమున నూత్నయౌవనము లభించినకారణమున వారికిఁ దాను బ్రత్యుపకారము చేయ నెంచెను. అంతవఱ కశ్వినీకుమారులకు సోమపానము చేయునర్హత లేదు. ఆకారణమున నాశ్వినీదేవతలను సోమపీథులఁ జేసెద నని ప్రతిజ్ఞచేసి చ్యవనుఁడు వారిని బంపివేసెను. చ్యవనమహర్షి తననూత్నయౌవనమునుజూచి యానందించుటకు సపరివారముగా వచ్చియున్నసంయాతిని గాంచి వానియభ్యున్నతి కొకక్రతువును దా నాతనిచేఁ జేయించుటకు నిశ్చయించెను. సంయాతి వల్లెయని నగరమున కరిగి యజ్ఞసంభారములను సమకూర్చెను. చ్యవనమహర్షి సుకన్యాసహి

*భారతము, అరణ్యపర్వము. దేవీభాగవతము.

తుఁడై శ్వశురగృహమున కేఁగెను. అంత సుముహూర్తమున విధ్యుక్తముగ సంయాతి చ్యవనుని యార్త్విజ్యమున యజ్ఞ మారంభించెను. ఇంద్రాదిదేవతలతో నాశ్వినీదేవతలును హవిర్భాగమున కాహూతులై మఖమునకు వచ్చియుండిరి. చ్యవనమహర్షి తాను గావించియున్న వాగ్దానము ననుసరించి యాశ్వినులకు సోమ మీయఁబోఁగానే యింద్రుఁడు కోపించి యాశ్వినేయులు బృందారకులు కానికారణమున వారికి సోమపానార్హత లేదనియు నాకారణమున వారికి సోమ మీయవలదనియు వారించెను. చ్యవనమహర్షి యాతనిమాటలు పాటిసేయక యాశ్వినేయులను సోమపీథులఁ జేసెను.

## చ్యవనుఁ డింద్రునకు గర్వభంగము చేయుట

అంతఁ దనమాట నిర్లక్ష్యమగుటఁ గాంచి యింద్రుఁ డలిగి వజ్రాయుధ మెత్తి చ్యవనునిపై వేయఁబూనెను. చ్యవనుఁ డింద్రునిహస్త మెత్తినది యెత్తినట్లే యుండఁ జేసి యాతనిని వజ్రాయుధముతోపాటు రూపఱఁజేయ నగ్నియందు వేల్వఁగా నందుఁడి యపారఘోరబలుఁడు మహాజీవుఁడు నయి మదుఁ డను రాక్షసుఁడు భీకరాకారుఁడై యుద్భవించెను. అతనిచేతులు పదివేలయోజనముల పొడవుండెను. అంతకుఁ దగిననాలుగుదంష్ట్రలును సూర్యచంద్రులఁ బోలుకన్నులును గాలాగ్నివంటినోరును భూమ్యాకాశములనంటు శరీరమును గలిగి యొక్కసారిగా నోరుదెఱచి నాలుకతోఁ బెదవులు నాఁకుకొనుచు మహానాదముతో నింద్రుని మ్రింగ వచ్చునారాక్షసునిఁ జూచి యింద్రుఁడు భయకంపితుఁడై తనదప్పిదమును క్షమింపు మని నాఁటినుఁ

డియు నాశ్వినీ దేవతలు సోమపీథులే యగుదు రని పలికి చ్యవ నునిపాదములపైఁ బడెను. చ్యవనమహర్షి యాతని కభయమిచ్చి యా రాక్షసుని నివారించెను. మదుఁడు చ్యవనునకు నమస్క రించి తనకాశ్రయమును జూపు మని వేఁడుకొని నాఁటినుండి యాతని మద్యస్త్రీమృగయాక్షముల నాశ్రయింపు మని చ్యవ నుఁ డాదేశించుటతోడనే యారాక్షసుఁ డంతర్ధానమాయెను. ఇంద్రుఁడును బ్రిదుకు జీవుఁడా యని స్వర్గమునుఁ డయ్యెను. ఈప్రకారము తనకృతజ్ఞతను వెలిపుచ్చుకొన్న చ్యవను ననేక విధముల నభినందించి యాశ్విన్యాది దేవతలు హవిర్భాగసం తృప్తిఁ దమలోకమున కేఁగిరి. చ్యవనమహర్షి తనతపఃప్రభావ మును వెల్లడిచేసినకారణమున నాపర్వతము 'ఆర్చికపర్వత'మను పేరఁ బరగి ప్రసిద్ధిగాంచెను.*

మఱియొకప్పు డింద్రుఁడు గర్వియై కోపించి చ్యవనునిపై నొకపర్వతమును విసరెను. చ్యవనమహర్షి వెంటనే తనకమండ లూదకము మంత్రించి చల్లఁగానే యాపర్వత మెదురు తిరిగి యింద్రునిపైనే పడెను ఆకారణమున వెంటనే యింద్రుడు మూర్ఛవోయెను. చ్యవనమహర్షి కరుణించి యాతనికి బాధలేకుండఁ జేసి మూర్ఛనుండి మేల్కొలిపెను. ఇంద్రుఁడు సిగ్గుపడి వెడలిపోయెను. ఆహా! చ్యవనుఁ డెంతదయాశాలియో కదా! అపకారి కుపకార మొనరించి తన యభేదభావము నాతఁ డు చాటినాఁడు. ఇదే మనఋషులలో మనము గ్రహింపవలసిన రహస్యము. వా రాత్మజ్ఞులు. అహంకారమమకారరహితులు. కాని, యెదుటివారియందలి రజస్తమోగుణములప్రకోపము

* భారతము. అరణ్యపర్వము. అనుశాసనికపర్వము.

నణఁచుటకుఁ గ్రోధము నటించి శాపాయుధమున నెదుటివారిఁ జక్కఁజేసి వెంటనే తమయాయుధ ముపసంహరించుకొను మహా శక్తిసంపన్నులు వారు. వారికిని మనకును బోలికయే లేదు.

## చ్యవనుఁడు సుకన్యకుఁ బుత్త్రుల ననుగ్రహించుట

నవయౌవనుఁడైన చ్యవనుఁడు సుకన్యాపాతివ్రత్యము నకు సంతసించి యామెకు సకలభోగముల నొసఁగి యానందిం పఁ జేయనెంచెను. ఒకనాఁడు సుకన్యను బిలిచి "సాధ్వీ! నేను ముసలివాఁడ నని రోయక దేహ సౌఖ్యముల నిన్నుఁ దేల్చ కున్నను నీవు నాయందు దతివిధేయురాలవై యుంటివి. కావున యౌవనము నీకొఱకే ధరించితిని. నీత్యాగశీలమునకు మెఱుఁగు పెట్టఁ గల్గునొక్క సుపుత్త్రునిఁ దత్తుల్యకీర్తిప్రదు లగు నిరువురు కుమారులను నీ కనుగ్రహింతు"నని చ్యవనుఁడు సుకన్యను గారవించెను. "మీకటాక్షమునకు మించి నా కేమికానలయు"నని యామె యాతనితో స్త్రీసౌఖ్యము ననుభవించెను. కాల క్రమమున నామెకు దధీచి, ప్రమతి, ఆప్రవానుఁ డను కుమారులు జన్మించిరి. మహాతపస్సంపన్నులగు మహర్షులు తుచ్ఛకామములతోఁ గాక సత్పుత్త్రజనకు లగుటకే కదా నిజ పత్నీసమాగమము నభిలషించుట ! అట్టిసంగమమున మహా త్ములు కాక యన్యు లుదయింపరుగదా!

## చ్యవనుఁడు నహుషు ననుగ్రహించుట

చిరకాలము గృహస్థధర్మములు నడపి చ్యవనమహర్షి యొకప్పుడు భాగీరథీయమునాసంగమమున సుస్థిరుఁడై యధిక నిష్ఠతో నుదకవాసమహావ్రత మారంభించి నీటిలో నుండి తపము చేయుచుండెను. అందలిమత్స్యము లాతని చుట్టును

దిరుగుచుండఁగా నాతనికి వానిపైఁ గృపయుఁ బ్రేమమును జనించెను. ఆప్రకార మాతఁ డందుఁ బండ్రెండుసంవత్సరము లుండెను. ఆతఁడు సకలభూతములందును బరమశుభ మగువిశ్వాసము గలిగి శుచియై దేవతాపురస్సరముగాఁ దపము చేయుచుండ, నాజలము లాతనికిఁ బ్రదక్షిణ మొనర్చి భక్తిమెయి నేకీడు నొనర్పకుండెను. ఇట్లుండ నొకనాఁడు జాలరులు వలలతో నందలిచేఁపలను బట్టుచు నామహర్షిని బట్టి గట్టునకు లాఁగిరి. ఆతనిఁ గాంచినవెంటనే వారు భయకంపితులై తమ తప్పు క్షమింపు మనిరి. చ్యవనమహర్షి యించుకేని కోపపడక "మీకులవృత్తి మీరు చేయుటలో దోషములేదు. నన్ను నీమత్స్యములతోపాటు విక్రయించు కొనుఁ"డన వారు పరుగునఁ బోయి తమరా జగునహుషునితో నీవిషయమెల్ల వినిపించిరి. నహుషుఁ డాశ్చర్యభక్తిసంభరితుఁడై వచ్చి యామహర్షికి మ్రొక్కి క్షమింప వేఁడుకొనెను. చ్యవనుఁడు వారు చేసిన దోష మేమియును లే దనియుఁ దనకు వెల నిర్ణయించి యాజాలరుల కిమ్మనియుఁ గోరెను. నహుషుఁడు నూఱుమాడలీయ నియమించెను. అర్థరాజ్య మిచ్చెద ననెను. రాజ్యమంతయు నిచ్చెద ననెను, ఏ మనినను దనకుఁ దగినవెల కా దని చ్యవనుఁ డనెను. ఇంతలోఁ గవిజాతుఁ డనుముని వచ్చి గోబ్రాహ్మణులు సమాను లగుట నొకగోవు నిమ్మనెను. నహుషుఁ డట్లే యని చ్యవనునకుఁ దెలుప నాతఁ డానందించి గోప్రభావము నాతని కుపన్యసించెను. ఒక గోవును దీసికొని వచ్చి నహుషుఁడు జాలరుల కీయ వారు దానిని చ్యవనమహర్షికే యిచ్చి తమ్ముఁ గృతార్థులఁ జేయు మని కోరుకొనిరి.

చ్యవనుఁ డంగీకరించి యాచేఁపలకు నా జాలరులకును స్వర్లోకము కలుగునట్లు వర మిచ్చెను. వెంటనే వారు దివ్యవిమానారూఢులై స్వర్గమున కేఁగిరి. నహుషునిఁ జూచి యాతనికి ధర్మపరత్వము నింద్రపదవి కలుగునట్లు చ్యవన మహర్షి యాశీర్వదించి వెడలిపోయెను. చ్యవనమహర్షి యాశీర్వచనముననే నహుషుఁ డొకసారి యింద్రుఁ డయ్యెను.

## చ్యవనమహర్షి కుశికభూపతిని బరీక్షించుట.

సురలు మునులు సురశ్రేష్ఠునిఁ గొలిచియుండఁగాఁ బ్రసంగవశమున నొకనాఁడు భృగుకుశికవంశములకు బ్రహ్మ క్షత్త్రియములు తడఁబడి సంకరము వాటిల్లు నని బ్రహ్మ పలికెను. ఇది చ్యవనమహర్షి వినెను. నాఁటినుండి కుశికవంశము నంతరింపఁ జేసినచో సాంకర్యము కలుగ దని యాతఁ డెంచుచుండెను. కుశికకులమున కుత్పాత మాపాదింపఁగోరి చ్యవనుఁ డొకపర్యాయము కుశికభూపాలుఁ డగు కుశినాభునికడ కేఁగెను. ఆతఁ డీతని నత్యంతము గౌరవించెను. బంధుమిత్త్ర పరివారముతోఁ గుశినాభుఁ డీతనికి సేవచేయ మొదలిడెను. చ్యవనుఁ డభ్యంతరమందిరమున హంసతూలికాతల్పమునఁ బరుండి భార్యాభర్తల నిరువురను బాదము లొత్తుఁడనెను. కుశికుఁడు సభార్యుఁడై సేవచేయుచుండఁగా నిరువది యొక్క దినములు చ్యవనుఁడు కదలకుండ నిద్రించెను. కుశికభూపాలుఁడు నాతనిని విడువక సేవించుచునే యుండెను. ఇరువది రెండవనాఁడు లేచి యెటకో పోవుచుండెను. రాజు భార్యయు వాని ననుసరింపఁ గొంతదూర మేఁగి యాతఁ డదృశ్యుఁ

డయ్యెను. భార్యాభర్త లిరువురును విచారముతో నింటికి వచ్చి చ్యవనుఁడు వేఱొకతల్పమున నుండుటఁ జూచి సంతసముతో భక్తిభరితులై మరల నాతనిపాదము లొత్తుచుండిరి. అతఁడును మఱియిరువదొక్క దినము లట్లే కడపెను. పిమ్మట నాఁడు తైలాభ్యంగము కావలె నని చ్యవనుఁ డనిన రాజు తైలాభ్యంగము చేయించుచుండ నాతఁ డంతర్హితుఁడై యుప రాహ్ణము దాఁటినపిదప వచ్చి స్నానముచేసెను. కుశినా భుఁడు భార్యయుఁ జలింపక వివిధాన్నపానములు ఘటించి భోజనమునకు రమ్మనఁగాఁ దిరిగి యాతఁ డంతర్హితుఁ డయ్యెను. రాజును భార్యయు భుజింప నొల్లక యాతనికొఱ కెదురుచూచుచుండ మఱునాఁ డుదయ మాతఁడు వచ్చి కుశి నాభునితో "నీవును నీభార్యయు నే నెక్కెడురథమును లాగుఁ" డనెను. వా రంగీకరించి యట్లు చేయఁగా రక్తములు కాఱు నట్లు వారి నాతఁడు బాధించెను. ఐనను, వారు చలింపలేదు. చ్యవనుఁడు దయతో వారిని స్పృశించినంతనే వారి కాయా సము పోయెను; నవయౌవనము కలిగెను. చ్యవనుఁడు వారి నింటికిఁ బోయి మఱునాఁడు తాను గంగాతీరమునఁ జేయు యజ్ఞమునకు రండని పిలిచి పంపివేసెను.

కుశికభూపతి యింటికి కరిగి విధ్యుక్తముగాఁ గర్మ ములు నిర్వర్తించి మఱునాఁడు స్నానాదు లొనరించి భక్తి భరితహృదయముతో భార్యాసమేతుఁడై చ్యవననిర్దిష్టప్రదేశ మున కరిగెను. అందు మణిమయదివ్యహర్మ్యములు నిర్మిత ములై యుండెను. మండపములు, ఆరామములు, పద్మాకర ములు, క్రీడాచలములు, సురకిన్నరగంధర్వగణములు గాన

వచ్చెను. అం దొకదివ్యభవనమున భార్యాభర్తలు చ్యవనునిఁ గాంచిరి. వెంటనే యాతఁడు మేడలతో నంతర్ధానమయ్యెను. కొంతసేపటికి వారి నిరువురఁ బిలిచి చ్యవనుఁడు "రాజా! నీమనస్సు నింద్రియములు నీ కింత స్వాధీనముగ నుండుట స్వల్పవిషయము కాదు. నా కానందమైనది. నాఁడు నీయింటఁ జరియించుచు నారీతిఁ బ్రవర్తించుటకుఁ గల కారణము నీయందుఁ దప్పుపట్టి నీవంశక్షయమునకై శపించుటకే. కాని, నీవు నాపరీక్షల కాఁగితివి. మీయుభయులందును ధైర్యహాని, కోపము, శోకము మందునకైన లేవు. కావున దను దలఁచి యిట్లు స్వర్గమునే భూమిపైఁ జూపితిని. నీకు మూఁడవతరమువాఁడు బ్రహ్మతేజోదీప్తుఁ డయి పుట్టును. నాతనయునితనయుఁడు ఋచీకుఁడు నీతనయుని-గాధి-కూఁతుఁ బరిణయమై జమదగ్ని యనువానిం గని యాతనియందు సమస్తధనుర్వేదమును నిలుపును. మహాక్షాత్త్రముతో నాతనికిఁ బుత్త్రుఁడై పరశురాముఁడు జన్మించును. గాధికి బ్రహ్మర్షి యగువిశ్వామిత్త్రుఁడు జన్మించు" నని చెప్పి చ్యవనమహర్షి వెడలిపోయెను. కుశికభూపతి బ్రహ్మానందము నందెను. చ్యవనమహర్షి చెప్పినట్లే ఋచీకునిమూలమున భార్గవవంశమున జమదగ్నియు నాతనికిఁ బరశురాముఁడును గుశికవంశమున విశ్వామిత్త్రుఁడును జన్మించిరి. *

**పామొకటి చ్యవనుని పాతాళమున కీడ్చుకొనిపోవుట.**

తొల్లియొకప్పుడు చ్యవనుఁడు నర్మదానదిలో స్నానము చేయుచుండఁగా నొకపెద్దపా మాతనిం బట్టుకొని పాతాళలోక

* భారతము- అనుశాసనిక పర్వము.

మున కీడ్చుకొనిపోవుచుండ మాని పరమేశ్వరుని ధ్యానించెను. దైవకటాక్షమువలన నాతని కేమియు విషబాధ కలుగదాయెను. ఇంతలోఁ బా మాతనిఁ బాతాళమునకుఁ దీసికొనిపోయి నాగకన్యకల నడుమ విడిచెను. ఉరగాంగన లాతనిని భక్తి యుక్తి సేవింపఁ దొడఁగిరి.

అప్పుడు పాతాళమును బాలించు ప్రహ్లాదుఁ డాతనిం గాంచి నమస్కరించి తనగుట్టుమట్టులఁ దెలిసికొనినా నీతని నింద్రుఁడు పంపియుండు నని తలంచి తనయనుమానమును వెల్లడించెను. చ్యవనుఁ డాతనిభావ మెఱిఁగి తన కింద్రునితోఁ బని లేదనియుఁ దాను నర్మదాజలముల మునిఁగినపు డొక పెనుబా మీడ్చుకొనివచ్చె ననియుఁ దెలిపెను. ప్రహ్లాదుఁడు సంతోషించి "ఋషీంద్రా! నీరాకవలన నేను బవిత్రుఁడ నైతిని. నాపై దయయుంచి నీతిరుగని తీర్థములు క్రుంకని నదులు నుండవు కావునఁ దీర్థ పరమార్థమును బోధింపు" మని కోరెను.

చ్యవనుఁడు ప్రహ్లాదుని కిట్లనెను. "హరిప్రియా! నీవంటి విష్ణుభక్తుఁ డెందును లేఁడు. నీప్రశ్నముల కుత్తర మీయకుండు టెట్లు? చెప్పెదను వినుము. చిత్తశుద్ధిలేని తీర్థాటనము వ్యర్థము. మనస్సు నిర్మలము కావలయునే కాని గంగలో మునిఁగి నంతమాత్రమున లాభము లేదు. తీర్థవాసము మహాకష్టము. అటఁ జేసినపాపము లత్యధికదుఃఖాకరములు. తీర్థములందుఁ జేసినపాప మేవిధముగను నశింపదు. మఱియు సర్వతీర్థాటనము కంటె భూతదయ, సత్యము, శౌచము, ముఖ్యములు. ఇవి కల వారి పాదములక్రిందనే సకలతీర్థములు వచ్చి వసించును. ఐనను నైమిశము, చక్రతీర్థము, పుష్కరము ఈమూఁడును సకలలోక

శ్రేష్ఠములగు భూలోకతీర్థము" లని తెలిపెను. ప్రహ్లాదుఁడు చ్యవను నతిభక్తి వీడ్కొలిపి తీర్థయాత్రాశీలియై సపరివారముగా బయలు దేఱెను. *

## చ్యవనుఁడు లవణాసురవధకుఁ గారకుఁ డగుట.

మధుఁ డను రాక్షసుఁడు శివుని మెప్పించి యాతనిచే నజేయ మగుశూలమును గ్రహించి యాశూలము తనయనంతరము తనకుమారునకుఁగూడ నుపయోగింపవలె నని కోరుకొనెను. శివుఁ డంగీకరించి యాశూలము చేత నుండఁగ శత్రువు మిమ్ముల జయింపఁ జాలఁ డనియును శూలము లేకయాలము చేయుచో సందు మడియ వచ్చు ననియును జెప్పి యంతర్హితుఁ డయ్యెను. మధుఁడు కుంభీనసి యనురావణు చెల్లెలిని వివాహమాడెను. ఆమెయం దాతనికి లవణుఁ డను రాక్షసుఁ డుదయించి మధుఁడు చనిపోయినపిమ్మట నాశూలమును గ్రహించి పూజించుచుండెను. లవణాసురుఁడు పెరిఁగి పెద్దవాఁడై మహర్షుల కనేకబాధలు కలిగించుచుండెను. ఈ లవణాసురుని జంపించు టెట్లని మరీచి కశ్యప దధీచి పులస్త్య ఋచీకాదిమహర్షులు వచ్చి చ్యవనమహర్షి నుపాయ మడిగిరి. చ్యవనమహర్షి వారందఱితోఁ గలిసి శ్రీరామునికడ కేఁగి లవణాసురుని దారుణవృత్తాంతమును జెప్పఁగా శ్రీరాముఁడు శత్రుఘ్నుని లవణాసురవధకై పంపెను. చ్యవనుఁడు శ్రీరాముని స్తుతించి మహర్షులతోఁ దనయాశ్రమమున కేఁగెను. శత్రుఘ్నుఁడు సేనాసమేతుఁడై బయలుదేఱి పోవుచు వాల్మీకియాశ్రమమున నొకరేయి గడపి నాఁడే సీతామహాసాధ్వి

* బ్రహ్మవైవర్త పురాణము.

కుశలవులఁ గన్నశుభవార్త విని చ్యవనమహర్షి యాశ్రమమునకు వచ్చెను. చ్యవనుఁడు నాతని నాదరించి లవణాసురుఁడు మాంధాతను జంపిన తెఱఁగుఁ జెప్పి శూలము చేత లేనిసమయమునసే లవణునిఁ జంపు మని శత్రుఘ్నునకు బోధించెను. శత్రుఘ్నుఁడు చ్యవనునిమాట విని లవణాసురుని జంపినపిదప మును లందఱును భీతులై యథేచ్ఛముగా సంచరింపఁ దొడఁగిరి. ఇట్లు చ్యవనమహర్షి లవణాసురుని శత్రుఘ్నుఁడు సంహరించుటకుఁ గారణభూతుఁ డాయెను.*

## సింహావలోకనము.

భృగువంశవరిష్ఠుఁడై చ్యవనమహర్షి మహాతపోనిష్ఠాగరిష్ఠుఁడై, యాత్మతపోబలసంపన్నతచే నింద్రాయుధములసైతము తృణసదృశములఁ జేసివైచి, తనకు యౌవన మొసఁగినయాశ్వినులకుఁ గృతజ్ఞతాసూచకముగా సోమపానార్హతఁ గలుగఁజేసి, లోకహితార్థియై మహఋషులలో నగ్రేసరుఁడై వెలుఁగొందెను.



* ఉత్తర రామాయణము.

ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీ మహర్షి జీవిత కథామృతము

## జమదగ్ని మహర్షి

స్తుతి

జమదగ్నిన్, బరమారివీరనిజహృత్సంబంధషడ్వర్గమున్
విమలాత్మాద్భుతసత్తపఃఫలమునన్ విధ్వస్తముంజేసి తా
నమలోదాత్తమనీష చేఁ బరమధర్మానీకసంరక్షణన్
సమతన్ గీర్తిని గాంచినాతనిఁ, బ్రశంసన్ గొల్తునశ్రాంతమున్.

### జమదగ్ని జననవృత్తాంతము.

తొల్లి భృగువంశసంజాతు డగుఋచీకమహర్షి కుశిక వంశోద్భవుఁ డగుగాధిరాజుకూఁతురు సత్యవతి యనునామెను వివాహమాడఁ గోరి తనకోరికను గాధికిఁ దెలిపెను. గాధి యాతఁడు తనకూఁతునకుఁ దగినవరుఁ డగునో కాదో యని సంశయించి తెల్లనిదేహము నల్లనిచెవులు గల వేయిగుఱ్ఱములను దనకూఁతున కుంకువగా నొసఁగినచో సత్యవతి నిచ్చి పెండ్లి చేయుదు నని సమాధానము చెప్పెను. ఋచీకమహర్షి యిది యెంతపని యని బయలుదేఱి వెడలి వరుణదేవుని

ప్రార్థించి యాతనిచే నట్టియశ్వములను బడసి తీసికొనివచ్చి గాధి కిచ్చెను. గాధిరాజు ఋచీకుని శక్తిసామర్థ్యములకు మెచ్చుకొని యాతనికిఁ దనకూఁతు రగుసత్యవతి నిచ్చి మహా వైభవముతో వివాహముచేసి యల్లునిఁ గూఁతును వారి యాశ్రమమునకుఁ బంపివేసెను. సత్యవతి భర్తయే దైవ మనియుఁ దనయదృష్టముచే నుత్తమబ్రాహ్మణుఁడు తనకు భర్తయాయె ననియు నెంచి యాతని కనేకవిధములఁ బరి చర్య చేయుచుండెను. ఒకనాఁడు ఋచీకమహర్షి యామె సేవకు సంతసించి యొకకోరిక గోరుకొను మనెను. సత్యవతి పుత్రహీను లగుతనతలిదండ్రుల కొకకొమరుని, దన కొక పుత్రుని నిమ్మని భర్తను బ్రార్థించెను. ఋచీకమహర్షి యట్లే యని రాజబ్రహ్మమంత్రములచే రెండుచరువులను వేల్చి యా రెంటిని భార్య కిచ్చి "సాధ్వీ! క్షత్రియాజేయుఁడు క్షత్రియ సూదనుఁడు నగుక్షత్రియోత్తముఁడు మొదటిచరువు నుప యోగించినవారికిఁ గల్గును. కాన, దానిని మీయమ్మ కిమ్ము. ఈరెండవచరువు నీ వుపయోగింపుము. దానివలన నీకుఁ దపోధృతిశమములచే నుత్కృష్టుఁ డగుబ్రాహ్మణుఁడు జన్మించు" నని చెప్పి నదీస్నానమునకుఁ బోయెను.

ఇంతలో సుతాజామాతలం జూడఁ దలఁపు కలిగి గాధి భార్యాసమేతుఁడై ఋచీకునియాశ్రమమునకు వచ్చెను. సత్య వతి యానందపరవశతఁ దల్లిదండ్రులు రాఁగానే తల్లి కాచరు వృత్తాంతమును దెల్పి దైవోపహతయై తా నుపయోగింప వలసినది తల్లి కిచ్చి తల్లి కీయవలసినది తాను గ్రహించెను. ఇంతలో ఋచీకమహర్షి వచ్చి యత్తమామలఁ జూచి దివ్య

బోధమున **మాతాసుత** లోనరించినవనిఁ దెలిసికొని సత్య వతిని జూచి "నీకు క్షత్త్రియాంతకుఁడు మహాక్రూరుఁడగు కొడుకు పుట్టును. మీయమ్మకు బ్రహ్మభూతుఁడు తపోధనుఁడు నగుకొడుకు పుట్టు" నని చెప్పెను. సత్యవతి భయపడి యదే మని యడుగఁగా ఋచీకుఁడు "నేను నీ కుత్తమబ్రాహ్మణుఁడు పుట్టునట్లు మీతల్లి కుత్తమక్షత్త్రియుఁ డుదయించునట్లు మంత్ర ములఁ జదివి వేల్చి యాచరువులఁ జేసితిని. నీ వుపయోగింప వలసినది మీజననియు నామె యుపయోగింపవలసినది నీవు నుపయోగించితిరి. కావున నట్లు వ్యత్యాసము కలుగు" నని చెప్పెను. సత్యవతి భయపడి క్రూరుఁడగుకొడుకును గనఁ జాలను రక్షింపు మని వేఁడుకొనఁగా ఋచీకుఁ డామెను గరుణించి యావిశేష మామె కుదయించుపుత్త్రునకుఁ గాక పౌత్త్రునకుఁ గల్గు ననియెను. అంతఁ గాలక్రమమున సత్యవతి గర్భమున జమదగ్నిమహర్షియు నామె మాతృగర్భమున విశ్వామిత్రుఁడును జన్మించిరి. *

## జమదగ్ని రేణుకను వివాహమగుట.

ఇట్లు జన్మించిన జమదగ్ని యుత్తమగుణసంపన్నుఁడై రేణువు కూఁతు రగు రేణుకను వివాహ మాడి గార్హస్థ్య మును నడపుచుండెను. ఈతఁడు తనతపోమాహాత్మ్యమున నొక హోమధేనువును సంపాదించెను. ఆధేనువు వలసినపు డెల్ల నెందఱి కైన నేమైన సమకూర్పఁ గలసామర్థ్యము కలది. ఆకామధేనువు కారణముగ నేకొఱంతయు లేక జమదగ్ని

---

* భారతము, విష్ణుపురాణము.

రేణుకాదేవితో సమస్తభోగము లనుభవించు చున్నను మహా తపస్సంపన్నుఁడై యుండెను.

## జమదగ్ని సూర్యుని శపించుట

జమదగ్ని రేణుకపతిభక్తికి మెచ్చి యామెతో నర్మదా తీరమందలిది, నిర్జనము, ఫలపుష్పయుక్తము, శారికాశుకపిక మయూరనినాదయుక్తము, సుగంధివాయుసురభీకృతము, నగు వనమున కేఁగి యందు విహరించెను. పిదప, అపుడే వికసించిన పుష్పములఁ దల్పములుగ నేర్పఱిచికొని చందన చర్చితగాత్రులై యాదంపతులు నఖక్షతచుంబనాదు లారంభించి క్రమక్రమముగా మన్మథక్రీడ లారంభించిరి.

ఆసమయమున సూర్యుఁడు వారి కడకు విప్రరూపమున వచ్చేసి "ఓయీ! జమదగ్నీ! నీవు బ్రహ్మమనుమఁడవు. వేద కర్తవు, మహా తపశ్శాలివి. అట్టి నీవిట్లు పట్ట పగలు సురతక్రీడ కుంజొచ్చుట ధర్మమా? 'యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః' యన్న నానుడిఁబట్టి పెక్కురు ని న్ననుసరింతురు. తాపస శేఖరుఁడవగు నీవే యట్లు ధర్మమును నిరాకరించిన వేద ధర్మములు హీనత నందవా? నేను గర్మసాక్షి నగుటచే నీ కిటు చెప్పవచ్చితి" నని పల్కెను.

అది విని జమదగ్ని సురతవిముఖుఁడై నిలువ నగ్నయగు రేణుక వెంటనే సూక్ష్మవస్త్రము ధరించి సిగ్గుపడి నిలిచెను. అంత జమదగ్ని సూర్యునితో "ఓయీ! నీవు పండితాహంకార మున నాకుఁ జెప్ప వచ్చితివి. భృగుశిష్యుఁడను, చతుర్వేద ధర్మాధర్మము తెలియంగని వాఁడనా? అజ్ఞాని స్వకర్మచే నెల్ల ప్పుడు జడీభూతుఁడగును. విజ్ఞాని సర్వభక్షకుండగు నగ్నివలె

మహాతేజస్వివై కర్మదోషములఁగాంచఁడు. నీవు కర్మసాక్షి వని ఫలప్రదాత వని శాస్త వని గర్వించి న్నాక్షేపింప వచ్చితివి. తపోధనవిరాజితులము జ్ఞానమూర్తులము నగు మాకు నారాయణుఁడు సర్వరక్షకుఁడు. మాభావములాతఁ డెఱుఁగును. మే మాతని నెఱుఁగుదుము. మఱెవ్వరులు బోధింప శిక్షింప సమర్థులు కారు. నీవే కాదు బ్రహ్మరుద్రియమాదు లైన మమ్ము శిక్షింపలేరు. అట్టిమాకు నీవు రతిభంగ మొనరించితివి కాన, నా శాపమున రాహుగ్రస్తుఁడవై పాపదృశ్యుఁడవు హతతేజుఁడవు నగుదువు." అని శపించెను.

సూర్యుఁ డది విని "అయ్యా! మనము పరస్పరము పూజ్యులము. ఐనను, నీవు నన్ను శపించితివి. నే నూరకున్న చో లోకులు న న్నశక్తుఁ డని నిస్తేజుఁ డని నిందింతురు. కావున, ఒక క్షత్రియునిచే నీకుఁ బరాభవము, ఆతని యాయుధముచే మరణము గల్గఁగల" దని ప్రతి శాప మిచ్చెను.

అపుడు జమదగ్ని మరలఁ గోపించి నీవు శివునిచే జితుండ వగుదు వని మరల శపించెను. ఈసంగతి కశ్యపుని వల్ల నెఱింగి బ్రహ్మ యాతనితోఁ గూడ క్షణములో సూర్యజమదగ్నుల కడ కరుదెంచి వారిని శాంతపఱిచి సూర్యునితో "ఓయీ! నీవు ఒకానొక దినమునం దాకాశమున మేఘచ్ఛన్నుఁడవై వెంటనే ముక్తుఁడ వయ్యెదవు. మేఘాతిశయ కాలమునఁగాని వర్షంబునం గాని రాహుగ్రస్తుఁడ వయ్యెదవు. ఐనను, కొందఱి కదృశ్యుఁడవు కొందఱికిఁ బూర్ణదృశ్యుఁడవు నగుదువు. నిన్నుఁజూచి నమస్కరించి సర్వజనులు పాపహీను లగుదురు. జన్మసప్తాష్టము, చతుర్థ దశమస్థానంబులందు, జన్మఋక్షనిధనములందును నీవును

జంద్రుఁడు నదృశ్యులయ్యెదరు. అస్తకాల, ఘనాచ్ఛన్నకాల మధ్యాహ్నకాలములందు జలములందు అర్ధోదిత కాలములందు నీవు పాపదృశ్యుఁడ వగుదువు. భార్యాదుఃఖనిమిత్తమునఁ గారణభూతయైన భార్యచేతను శ్వశురస్యాలకులచేతను హతతేజుఁడ వగుదువు. మాలిసుమాలి యుద్ధమున శివుఁడు నిన్ను జయించును. అని చెప్పి జమదగ్నిం జూచి మహాశయా! పరాజయలజ్జఁ దుఁడైన సూర్యునింతతో విడువుము. నీ తేజమున క్షణమాత్రములో జగమంతయు భస్మీభూతము కాఁగలదనుట నిజము. నీవును సూర్యుఁడును బరస్పరపాల్యులు, పూజ్యులును. నీవు కార్తవీర్యునిచేఁ బరాభవము, ఓటమి, మరణము నందుదువు. ఐనను, విష్ణుమూర్తి నీకు సుతుఁడై జన్మించి ముయ్యేడుమారులు శోధించి జగమంతయు నిక్షత్త్రియము గావించును. నీ మరణము లోకకల్యాణబీజమే కాఁగలదని చెప్పియదృశ్యుఁడయ్యెను. జమదగ్నియు సూర్యుఁడును బరస్పరమభినందించుకొని పురాకృతకర్మముల నివారింప సమర్థుఁడెవ్వఁ డనుకొని నిజ గృహములకరిగిరి.*

రేణుకాదేవి భర్తకుఁ బరమభక్తితో సేవచేయుచు నాతనికటాక్షమునఁ గ్రమముగా నైదుగురుకుమారులం గనెను. వారు వరుసగా రుమణ్వంతుఁడు, సుషేణుఁడు, వసువు, విశ్వావసువు, పరశురాముఁడు నను నామములఁ దాల్చిరి. పరశురాముఁడు విష్ణ్వవతారమై జన్మించెను. ఇట్లు జనించినపుత్త్రులం బెంచుకొనుచు భర్తృశుశ్రూష యొనరుచు రేణుకాదేవి చరించుచుండెను.

* బ్రహ్మవైవర్తపురాణము. ఉపానద్దాన విషయికమగు సూర్య జమదగ్ని సంవాదము. భారతానుశాసనికపర్వమునఁ గలదు.

## పరశురాముని పితృభక్తి

ఒకనాఁడు రేణుకాదేవి జలమునకై యేటికిఁ బోయెను. అందుఁ జిత్రరథుఁ డనురాజు భార్యాసహితుఁడై జలక్రీడాపరవశుఁడై యుండెను. వారినిఁ జూచుసరికి రేణుకాదేవి విధివశమున వారిక్రీడలపైఁ గోరిక జనింపఁగ నట నిలిచి వారి యానందమును గాంచుచుండెను. ఆకారణమున నామె మహోత్తమపాతివ్రత్యమున కించుకదోషము గలుగ నామె హస్తమందలిఘటము క్రిందపడి ఛిన్నాభిన్న మయ్యెను. ఎప్పుడైన జలభాండ మట్లు పగులుచో నామెమహత్త్వమున నిసుక తీసి తలపోయఁగనే భాండ మేర్పడెడిది. నాఁడామె పూర్వవిధముననే యిసుక తీసి కుండ కావలయు నని కోరఁగా నట్లు సంభవింపదయ్యెను. రేణుక మహాపతివ్రత గానఁ దన తప్పిదమును వెంటనే గ్రహించి యాదోషమున కానదిలోఁ బడి మరణింప నెంచెను. కాని, పతికి జరిగినవిషయము నివేదించి యాతనియాజ్ఞాబద్ధుఁరాలగుటే శ్రేష్ఠ మని యెంచి భాండరహితయై యింటి కేతెంచెను

జమదగ్ని భార్యచేత భాండము లేకపోవుటకుఁ గారణ మే మని చూడఁగా దివ్యదృష్టి కెల్లవిషయము గోచరించెను. చిత్రరథునిమక్కునఁ దగిలిన తనభార్యయాంతరంగికమున కసహ్యించుకొని యాదోషమున కామెకు మరణదండనమే శిక్షయని యాతఁడు నిశ్చయించుకొనెను. రేణుకాదేవి సమీపింపఁగానే జమదగ్ని కొడుకులఁ గ్రమముగాఁ బిలిచి తల్లిని జంపివేయుఁ డని యాజ్ఞాపించెను. ఆహా! జమదగ్ని సౌశీల్యాదర్శము! అన్యపురుషు ననురక్తిఁ గాంచిన నది వ్యభిచారమే

యైన ననిగదా పరమసాధ్వి యగుభార్యశిరము ఖండింపఁ జేయుట? అతఁడుకదా మహర్షి! పుత్త్రులలో మొదటినల్గురు నాపని చేయలే మని చెప్పివేసిరి. పరశురాముని బిల్చి జమదగ్ని తల్లిని నన్నలను జంపు మని యాజ్ఞాపింపఁగా వెంటనే యాతఁడు తనపరశువుతోఁ దల్లిని సోదరులను ఖండించెను. జమదగ్ని యాతని పితృభక్తికి సంతసించి యొకవరము వేఁడు కొను మనెను. వెంటనే పరశురాముఁడు చనిపోయినతన తల్లిని సోదరులను బ్రదికింపు మని తండ్రిని గోరుకొనెను. జమదగ్ని పరశురాముని మాతృప్రేమమునకును భ్రాతృ వాత్సల్యమునకును మెచ్చుకొని యట్లే చేసెను.

## జమదగ్ని కార్తవీర్యునిఁ జంపినపరశురాముని శిక్షించుట

పూర్వము హైహయాధీశ్వరుఁ డగుకార్తవీర్యార్జునుఁడు దత్తాత్రేయు నారాధనముచేసి యతనివలన శత్రు జయమును, వేయిచేతులను, అణిమాదిసిద్ధులను, యశము, బలము, యోగీశ్వరత్వము, తేజము చెడనియింద్రియములను బడసి వెలుఁగొందెను. దిగ్విజయయాత్రకై వచ్చిన రావణా సురు నీతఁ డవమానించెను. పిమ్మటఁ గార్తవీర్యార్జునుఁడు దైవయోగమున వేఁటకై యడవిలో సంచరించుచు జమ దగ్నిమహర్షి యాశ్రమము చేరి యాతిథిని దర్శించెను. జమదగ్ని మహర్షి రాజును భృత్యులును డస్సియుండుటఁ గాంచి వారిని బూజించి తనహోమధేనువును రప్పించి యిష్టాన్న ములు గురియించి వారి నారగింపుఁ డని కోరెను. కార్త వీర్యార్జునుఁడు బ్రహ్మానందముతో షడ్రసోపేతముగా విందుఁ

గుడిచి యా గోవుపైఁ గోర్కె కలుగఁగా సపరివారముగాఁ దనపురమున కేఁగెను.

కాని, యాధేనువుపైఁ గలమక్కువచే దానిని గొని తెండని కార్తవీర్యుఁడు తనభటులను బంపెను. వారు జమదగ్ని నడిగి కృతార్థులుగాక జమదగ్నితో యుద్ధమునకు సిద్ధపడిరి. జమదగ్ని సురభితో నీవిషయముఁ దెలిపెను. వెంటనే యామె రోమకూపములనుండి మహావీరు లగుసైనికులు, నుత్తమరథాశ్వములు వెలువడఁగా వానితో జమదగ్ని కార్తవీర్యుని సేనలతోఁ బోరెను. కార్తవీర్యునిసైనికులు హతమారఁగానాసంగతిఁ దెలిసికొని కార్తవీర్యార్జునుఁడు ససైన్యుఁడై వచ్చి స్వయముగా జమదగ్నితోఁ బోరెను. కార్తవీర్యార్జునుఁడు రెండు మూఁడుపర్యాయము లోడిపోయి జమదగ్నికిఁజిక్కి యాతనిచే బుద్ధులు గఱపఁబడియుఁ బాటింపక తిరిగి యాతనిపై యుద్ధమునకు వచ్చి తిరిగి యోడిపోయెను. ఈప్రకార మిరువది పర్యాయము లోడిపోయి యిరువదియొకటవమాఱు సురభి వాక్యమును విస్మరించిన జమదగ్నిని సంహరించి సురభిని వెదకఁగా నా కామధేను వాతనికి లభింపక యింద్రునికడకుఁ బోయి సురక్షితముగా నుండెను. కార్తవీర్యార్జునుఁడు రిక్తహస్తములతో నింటికిఁ బోయెను. రేణుకాదేవి భర్తతో సహగమనము చేయనుండ నాకాశవాణి వల దని వారించెను. ఇంతలో భృగుమహర్షి వచ్చి జమదగ్నిని బ్రదికించెను.

తరువాతఁ బరశురాముఁడు వచ్చి జరిగినసంగతిఁ దెలిసికొని యింట దిఁని యింటివాసములు లెక్కపెట్టిన ట్లున్నదని కోపించి కార్తవీర్యు నవమానింపఁ దండ్రియనుమతిఁ గొం

కుఠారకవచకోదండకాండుఁడై మాహిష్మతీపురమున కేఁగెను. అందుఁ గార్తవీర్యార్జునుఁడు నాతని సంహరింపుఁడని దండనాయకులఁ బదియేడక్షోహిణులఁ బంపెను. పరశురాముఁడు నొక్కక్షణమున వారి నందఱి రూపుమాపెను; కార్తవీర్యార్జునుఁడు యుద్ధమునకు రాఁగా నాతని వేయి చేతులను ద్రుంచి తనగండ్రగొడ్డలిచే నాతనిశిరముఁ దునిమెను. పిమ్మట నాశ్రమమున కేఁగి యాతఁడు తండ్రికి జరిగినవృత్తాంతముఁ జెప్పెను. జమదగ్నిమహర్షి రాజెంతదుష్టుఁడైన నాతనిఁ జంపుట దోషమనియుఁ దద్దోషపరిహారమున కొకయేఁడు తీర్థయాత్ర గావింపుమనియుఁ బుత్త్రుని శాసించెను. పరశురాముఁడట్లేయని తీర్థయాత్రకై బయలువెడలి పోయెను. ఆహా! తనకుమారుఁడు విష్ణుస్వరూపుఁడని యెఱిఁగియుఁ గార్తవీర్యుఁడుఁ దనకుఁ బరమవిరోధియై యున్నను, నాతనిఁ జంపిన కారణమున ధర్మసంహితబుద్ధితోఁ, బుత్త్రుని శిక్షింప వెనుకంజవేయని జమదగ్నిమహర్షి నెంతకొనియాడినను దనివి తీరదు కదా!

కార్తవీర్యార్జునునికొడుకులు కొంతకాలమునకు దమ తండ్రిని జంపుటకుఁ గారకుఁడు జమదగ్నియే యని యొక్కసారి జమదగ్నిహోమగృహముఁ జేరి యాతనిఁ బట్టి చంపిరి. రేణుకాదేవి యాతనిపైఁ బడి "పరశురామా! వచ్చి తండ్రిని రక్షింపుము, రక్షింపు"మని యిరువదియొక్కసారి కేక వేసెను. అంతలోఁ దీర్థయాత్రనుండి పరశురాముఁడు వచ్చి తండ్రి మరణమునకు విచారించెను. పిమ్మటఁ దల్లి యిరువదియొక్కమాఱులు పిలిచినది. కావున నిరువదియొక్కమాఱు కార్త

విద్యలనే కాక క్షత్త్రియుల నెల్లను సంహరించి వారిరక్త ప్రవాహమునఁ దండ్రికిఁ దర్పణము లిత్తు నని పరశురాముఁడు సోదరుల నూఱడించి బయలుదేఱి వెడలి యిరువదియొక్క మాఱు వెదకి వెదకి రాజులఁ జంపెను. ఈలోపున రేణుకాదేవి భర్తకై ప్రాణములఁ బాసెను. పరశురాముఁడు తాను జేసినప్రతిజ్ఞను బాలించి క్షత్త్రియరక్తముతోఁ దండ్రికిఁ దర్పణము విడిచి పెట్టెను. ఉత్తమోత్తముఁడు విశ్వామిత్రమోచకుఁడు నగు పరశురామునివంటి పుత్త్రరత్నమును గాంచిన యామహర్షి సత్తముని యదృష్టవిశేష మెంతటిదో కదా !*

## జమదగ్ని పితృదేవతలశాపమున నకులమై పుట్టిన వృత్తాంతము.

జమదగ్ని మహర్షి యొకనాఁడు పితృకార్యార్థియై చాల నియమముతో నూతనకలశమున గోక్షీరమును స్వయముగాఁ బితికి యొకచోటఁ బదిలముగాఁ బెట్టెను. జమదగ్ని మహా ప్రశాంతుఁ డగుట నాతనిచిత్తవృత్తి యెట్టిదో తెలియఁగోరి క్రోధాధిదైవము సాకారమై వచ్చి ప్రమాద మనుభ్రమ పుట్టించి యాపాలు పాఱఁబోసెను. జమదగ్నిమహర్షి కోపింపక యూరకుండెను. అంతఁ గ్రోధాధిదేవత యాతనియెదుటఁ బ్రత్యక్షమై "మహాత్మా! భృగువంశమువారు మహాకోపు లని వింటిని. నీయం దది యసత్యమైనది. అది పరీక్షించుటకే యిట్లు చేసితిని. క్షమింపు" మని వేఁడుకొనెను. జమదగ్ని శాంతచిత్తముతోఁ బొమ్మనఁగాఁ గ్రోధుఁ డంతర్ధానమయ్యెను.

---

* భారతము. బ్రహ్మపురాణము.

నాఁటిరాత్రి జమదగ్నిపితృదేవత లతనికిఁ బొడసూపి "వత్సా! నీ వెంతదోషము చేసితివి ! నీవు మాపూజ కుత్సహించి తద్వైకల్యము కలిగినను సూర కుంటివి. ఇది శాంతమగునే? సమయాసమయముల నెఱిఁగి చూపినదే శాంతము. వలయునెడఁ గోపించినను నది శాంతసమానమే యగును. ఆసమయమున శాంతము చూపినను దోషమే యగును. కావున నీ వొనరించిన దోషమునకు నీవు ప్రతిఫల మనుభవించి తీరవలెను. కావున, నీవు ముంగిసై పుట్టు" మని శపించిరి. జమదగ్ని వారలకు దండప్రణామములు చేసి "మహాత్ములారా! తపస్వికి నలుగఁ దగ దని యపరాధము చేసినను నలుగనైతిని. నాతప్పి నా కిప్పుడు తెలిసినది. కావున, నన్ను సైచి శాపమోక్షము ననుగ్రహింపుఁ"డని కోరెను. వారు "నాయనా! నీమీఁద మాకుఁ గ్రోధము లేదు. ఎంతటివానికిని గర్మఫల మనుభవింపక తప్పదు కదా! నీకు నంతియే. కావున, నీవు నకులమై పుట్టుట తప్పదు. ఎప్పుడు విదగ్ధవిప్రసమూహ మంగీకరించునుచితవాక్యములతో నొకమహాధర్మము కీడని నీవందువో యానాఁడు నీకు శాపమోచనమై మోక్షసౌభాగ్యమందఁ గల"వని చెప్పి పితృదేవత లదృశ్యులైరి. ఆశాపమూలముననే ముంగిసయై పుట్టి ధర్మరాజు చేసిన యశ్వమేధయాగసమయమున సక్తుప్రస్థుని యుదాహరణమున ధర్మజునశ్వమేధము నధిక్షేపించి విగత శాపత్వానందమున జమదగ్నిమహర్షి జన్మరాహిత్యము నందఁగనెను.*

ఇట్లు జమదగ్నిమహర్షి మహాప్రశాంతుఁడై, అరిషడ్వర్గముల జయించి యాత్మానందసింహాసనాధిష్ఠితుఁడై వెలసెను.

---

* భారతము. అశ్వమేధపర్వము.

ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీ మహర్షి జీవిత కథామృతము

# దత్తాత్రేయ మహర్షి

స్తుతి

"నిజగర్భగత జగన్నిచయు మారయు లీల
నంతర్ముఖాపాంగుc డైనవాని
నలినజాండావృత్తి నాభివీథికి నేర్పు
రీతి నక్షసరంబుc ద్రిప్పువాని
శ్రుతు లాత్మయుంద నిల్చుటc దెల్పు తెఱంగున
నవరుద్ధనిశ్వాసుc డైనవానిc
దనపూనినధరిత్రికి నలోలత ఘటించు
పగిది జటిలవృత్తిc బరగువానిc

బ్రాక్తనస్వీయదామోదరత్వ మెఱుంగc
జేయుగతి యోగపట్టికc జెలcగువాని
యోగముద్రైక సూచితాచ్యుతచరిత్రుc
డైనవాని దత్తాత్రేయమౌనిc గొలుతు."

[చంద్రభానుచరిత్రము. ౧ ఆ. ౪౬.]

## దత్తాత్రేయుని జననము

పూర్వము కౌశికుఁ డను బ్రాహ్మణునిపత్ని సూర్యో దయ మైనంతనే తనభర్త మరణించు నని యెఱిఁగి సూర్యో దయము కాఁగూడ దని శాసించెను. ఆమహాపతివ్రత శాసన మున సూర్యుఁ డుదయింప కుండుటచే లోకములు తల్లడిల్లఁ జొచ్చెను. దేవత లత్రిమహర్షి భార్య యగునసూయను శరణు చొచ్చిరి. అనసూయ కౌశికపత్ని ననునయించి సూర్యో దయ మగునట్లు చేసి తనపాతివ్రత్యమహిమచే నామెభర్తను బ్రదికించి నవయౌవనుని సుందరగాత్రునిఁ జేసెను. దేవత లామె పాతివ్రత్యమునకు మెచ్చి పుష్పవర్షము కురిపించిరి, దేవ దుందుభులు మ్రోయించిరి. అప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వ రులు "తల్లీ! నీవలన లోకోపద్రవము తప్పినది. మేము సంతు ష్టులమైతిమి. ఏదైనవరము కోరుకొని మామాట చెల్లింపు" మని యనసూయను గోరుకొనిరి. ఆమె "మీరు ముగ్గురును బరమయోగ్యులైన పుత్త్రులై నాకడుపునఁ బుట్టవలయు" నని కోరుకొనెను. బ్రహ్మ విష్ణుమహేశ్వరు లామెకు వర మిచ్చి యంతర్హితు లైరి. పిమ్మట నత్రిమహర్షి పుత్త్రకాంక్షియై చేసిన ఘోరతపమునకుఁ ద్రిమూర్తులును మెచ్చి యావరమునే యొసఁ గిరి. అత్రిమహర్షి వీర్యరూపమున విష్ణ్వంశ మనసూయగర్భ మును బ్రవేశించెను. ఆయంశముచే ననసూయకు జన్మించిన మహాత్ముఁడే దత్తాత్రేయుఁడు.

## దత్తాత్రేయుని ప్రవర్తనము.

భూమిపై ధర్మక్షయము కలిగి మ్లేచ్ఛాచారములు హెచ్చి వర్ణసంకరము కాఁజొచ్చెను. అప్పుడు బ్రాహ్మణక్షత్త్రియులు

యజ్ఞాదికము మాని భ్రష్టులగుచుండిరి. యోగశాస్త్ర మను గంటికి క్షీణింపఁగడంగెను. రాక్షసులు ప్రబలులై దేవతలను బాధింపఁదొడఁగిరి. ఈసమయమున దత్తాత్రేయుఁడు జనించి బాల్యమునుండియుఁ బరమయోగియై పెరుఁగఁజొచ్చెను. ఆతఁడు చిన్నతనమునుండియు నిస్సంగియై కాలము పుచ్చు చుండెను. బాహ్యేంద్రియ నిగ్రహుఁడు నిరంతరాత్మానంద తన్మయుఁడు నగునాతఁడు తల్లిదండ్రులను సంతోషపెట్టుచుం డెను. బాల్యమునుండియు దత్తాత్రేయుఁ డింతటివాఁ డగుటఁ గన్నులారఁ గాంచినకొందఱు మునిబాలు రెల్లపుడు నీతనికడనే యుండుచుండిరి. సంగరాహిత్యమున కలవడినదత్తాత్రేయ మహర్షికి వీరిరాకయే పలువిధముల బాధాకరముగా నుండును. అతనిస్వేచ్ఛాప్రవర్తనమునకు వారడ్డు వచ్చుచుండిరి. ఈకార ణమున నాతఁడు వారి నెట్లైనఁ దప్పించుకొన నెంచి యొకనాఁ డొకకొలనులో మునిఁగి యుండెను. మునిపుత్త్రులే మైన నాతని విడువనొల్లక యాతీరభూమినే నిలిచియుండిరి. ఎంతకాలమునకు వారట్లు తన్ను విడువకుండుటఁ జూచి యాతఁడు సంకల్ప మాత్రమున లక్ష్మినటకుఁ దెచ్చి యామెతోఁ గొలను వీడి బైటకు వచ్చెను. స్త్రీసహితుఁడైన నాతని నాఋషిబాలురు విడువక పలువిధములఁ గీర్తించుచునుండిరి. అంత నాతఁడు లక్ష్మి నంకతలమునఁ గూర్చుండఁ బెట్టుకొని మద్యపానము చేయుచు నాటలాడుచుఁ బాటలు పాడుచు లక్ష్మితోఁ గామాలాపము లాడ మొదలిడెను. అంత, మునిబాలకు లసహ్యించుకొని యాదత్తాత్రేయుని విడిచి తమతమ నెలవుల కరిగిరి.

నాఁటినుండియు దత్తాత్రేయుఁ డాంతరంగికతపోధ్యాన పరుఁడై బహిరంగముగా మద్యపానము చేయుచు స్త్రీలోలుఁడై నట్లు నటించుచు నుండఁదొడఁగెను. మహాయోగులు దక్క నన్యు లాతని నెఱుఁగలేక మూర్ఖాత్ములై మరలిపోఁ జొచ్చిరి. యోగ శ్రీయుతు లగువారికి హవ్యసేవనాసవసేవలు సమానమని సామాన్యులు తెలియఁగలరా? యోగి నెఱుఁగుట యోగికే సాధ్యము కాని యితరులకు సాధ్యము కాదు కదా!*

## దత్తాత్రేయుఁడు జంభాది రాక్షసులఁ జంపించుట

ఇట్లుండఁగా జంభాదిరాక్షసప్రముఖు లిందుప్రనిపై దండెత్తి దేవతల నోడించుచు ననేకవిధముల బాధలు పెట్టు చుండిరి. ఒకసంవత్సర మారాక్షసులతోఁ బోరాడియు దేవతలు గెలువలే కుండిరి. అందుచే నింద్రాదులు భయపడి వాలఖిల్యాది మహర్షులఁ గూడి తమగురు వగుబృహస్పతికడ కేఁగి యుపాయము చెప్పు మని కోరిరి. బృహస్పతి యాలోచించి "ఇంద్రాది దేవతలారా! నా కొక యుపాయము తోఁచుచున్నది. అత్రి మహర్షి కుమారుఁడు దత్తాత్రేయుఁ డనుమహాత్ముఁడు కలఁడు. మీరు పోయి వానిని భక్తితో సేవించి భజించినచో నాతఁడు మీ కుపకారము చేయఁగలఁడు. అంతకు మించి గత్యంతరము కానవచ్చుట లే" దని చెప్పఁగా వెంటనే యింద్రాదులు గురు ననుమతిఁ గైకొని యతివేగమున బయలుదేఱి పోయి దత్తాత్రేయునాశ్రమమును సమీపించిరి. అట నాతఁ డనేకకిన్నర

---

* మార్కండేయపురాణము.

గంధర్వగీయయానుఁడై లక్ష్మీసమన్వితుఁడు తేజస్సముజ్జ్వలుఁ డునై యుండఁ గాంచి దేవత లతిభక్తియుతులై మ్రొక్కిరి. దత్తాత్రేయుఁడును దనవికృతచేష్టలఁ జూపుచు మద్యము తెం పనఁగా వారు మద్యముఁ గొనివచ్చి యాతని కందిచ్చిరి. ఆతఁడు లక్ష్మితో దానిఁ ద్రావి గంతులు వేసి పాటఁ బాఁడొచ్చెను. ఇంద్రాదులును వానిని వెనుదగిలి విడువ కుండిరి. వారిచే నట్లారాధింపఁబడుచు దత్తాత్రేయుఁడు కరు ణించి "మీ రేపనికై వచ్చితి"? రని యడిగెను. వారును జంభా సురునివృత్తాంతము చెప్పి రాక్షసుల నందఱను జంపి దేవ హితము చేయు మని యాతనిఁ బ్రార్థించిరి. ఆతఁడు "నేను మద్యాసక్తుఁడను, స్త్రీలోలుఁడను, కర్మభ్రష్టుఁడను; ఉన్మ త్తుఁడను. నా కారాక్షసుల గెలువ రాదు. పొం" డనెను. వారు "మహాత్మా ! నీవు విష్ణుఁడవు. ఆద్యుఁడవు. నీతో నున్న యీమె యిందిర. నీవు సత్యజ్ఞానానందస్వరూపుఁడవు నీకు విధినిషేధములు లేవు. నీకన్న సర్వసమర్థుఁ డింకొకఁడు లేఁడు. మమ్ము రక్షింపు" మని వేఁడుకొనిరి. అంత దత్తాత్రేయుఁడు కరుణించి "నన్ను మీరు తెలిసికొంటిరి. దేవహితముకంటె నాకుఁ గావలసిన దేమి ? మీ రాదైత్యులను యుద్ధవ్యాజ మున నిటకుఁ దోడితెండు. క్షణమాత్రములో వారిఁ బరి మార్తు" నని వారిని బంపివేసెను.

దేవత లొక్కపరుగునఁ బోయి జంభాదులను యుద్ధ మునకుఁ బిలుచుకొని వచ్చిరి. జంభుఁడు ససైన్యుఁడై దత్తా త్రేయునాశ్రమమునకు వచ్చి దత్తాత్రేయుని పార్శ్వమున నున్న

లక్ష్మిని జూచి కామమోహితుఁడై నెమ్మదిగా నామెను దొంగిలించి శిబికలో నెక్కించుకొని మోయుచుఁ గొనిపోఁ జొచ్చెను. దత్తాత్రేయుఁ డింద్రాదులఁ బిలిచి "లక్ష్మి దానవులశిర మెక్కినది. అనఁగా నింక వారిని విడిచివేయు నన్నమాట. దానిమూలమున దైత్యు లందఱు బలహీనులైరి. మీరు యుద్ధము ప్రారంభించి వారిని దునుమాడుఁ" డని చెప్పెను. దేవతలు పూర్వమువలెఁ గాక క్షణములో రాక్షసు లెల్లరఁ జంపి దత్తాత్రేయుని స్తుతించి వెడలిపోయిరి.

## దత్తాత్రేయుఁడు కార్తవీర్యార్జునుఁ గటాక్షించుట.

ఆదినములలో హైహయవంశీయుఁ డగు కార్తవీర్యార్జునుఁ డనురాజు తండ్రిమరణానంతరము సింహాసన మధిష్ఠించి రాజ్యపరిపాలన మొల్లక మంత్రులఁ బిలిచి "మంత్రులారా! ఈరాజ్యము నా కక్కఱ లేదు. పరస్పరద్వేషతస్కరాది బాధలనుండి కాపాడుటకై ప్రజలు ధరణిపతికి ధనము చెల్లింతురు. నే నాపనులు చేయఁజాలను. వనమున కరిగి తప మాచరించి యధ్యాత్మయోగసిద్ధి పొంది వచ్చెద" నని చెప్పెను. అందు గర్గుఁ డనుమంత్రిపుంగవుఁడు రాజుమాట లాలించి యాతని నిశ్చయమునుండి మరలింపఁ జాలక "రాజా! దత్తాత్రేయమహర్షి మహాయోగసంపన్నుఁడు. అతనికృపఁ గాంచితివో నీయభిమతము సిద్ధించు" నని చెప్పి దత్తాత్రేయునికటాక్షమున నింద్రుఁడు జంభాదిరాక్షసులఁ జంపినవృత్తాంతము నెఱిఁగించెను. కార్తవీర్యార్జునుఁడు బయలుదేఱి పోయి దత్తాత్రేయునాశ్రమమున కరిగి :

శ్రీయుతుఁ గాంచెను దత్తా
త్రేయుం గరుణావిధేయు దేవమునిగణ
ధ్యేయు నసంగత్వమహా
స్థేయు విషయరిపుబలావిజేయు నమేయున్."

(మార్క. 3-౨౯౦)

ఆతనికి నమస్కరించి కార్తవీర్యార్జునుఁ డనుదినము నాతనిపాదము లొత్తుచు మద్యమాంసాదు లాహారముగాఁ గొనితెచ్చి యిచ్చుచుఁ జందన కర్పూరకస్తూరికాది సమస్తవస్తుప్రదానముల నాతని చిత్తము రంజించునట్లు పూజించుచుండ నొకనాఁ డాతనియుపానవాయు వగ్నిహోత్రమై వచ్చి కార్తవీర్యార్జునుని బాహుద్వయమును మాడ్చివేసెను. మఱియు దత్తాత్రేయుఁ డనేకవిధముల నాతని హింసించెను. ఐన, నాతఁడు తనభక్తి విడువక పరమానందముతోఁ బరిచర్య చేయుచుండెను. దత్తాత్రేయుఁ "డోరీ ! కాంతాలంపటుఁ డను. మద్యపాయిని. నన్నేల సేవింతువురా ?" యని యడుగఁ గార్తవీర్యార్జునుఁడు "మహాత్మా ! నీ వంతశ్శుద్ధుఁడవు, నసంగుఁడవు. నీవు విష్ణుమూర్తివి. ఆమెపద్మ." యని కేలుమోడ్చి సంస్తుతించెను. దత్తాత్రేయుఁ డాతని భక్తికి సంతసించి యేమి కావలయునో కోరుకొను మనెను. కార్తవీర్యార్జునుఁ డంత వేయిహస్తములు, సమస్త భూమిపాలనసామర్థ్యము, సంగరవిజయము, సిరిసంపదలు, ధర్మతత్పరబుద్ధియు, శైలాకాశజల భూమిపాతాళములయందుఁ దనరథ మకుంఠితముగా నడువ

వలెనని యుఁ గోరుకొనెను. దత్తాత్రేయుఁడు వాని కావరము లొసఁగి యంతర్హితుఁ డగుచు "నోరీ ! నీరాజ్యమం దెల్లెడల నీబాహు శక్తిమూలమున ధర్మప్రతిష్ఠాపనము చేయుము. యజ్ఞయాగాదు లొనరించుబ్రాహ్మణులకు సమస్త మిచ్చుచుండుము. మద్భక్తియోగము లెల్లెడఁ జాటుచుండుము. నీ వెన్నఁ డధర్మముగా మహర్షుల బాధింతువో యానాఁడే మరణింతువుసుమా" యని ప్రబోధించెను.

కార్తవీర్యార్జునుఁడు బ్రహ్మానందములో నామాట లెల్ల విని యనంతబలసంపన్నుఁడై మాహిష్మతీపురమున కరిగి రాజ్యమును స్వీకరించెను. నాఁడు మొదలాతఁడు ధర్మబద్ధముగా భూపరిపాలనము చేయుచు ననేకయజ్ఞములు చేసి బ్రహ్మర్షిపూజన మొనరించి ధర్మమును బూర్వస్థితికిఁ దీసికొని వచ్చెను. తనబాహుబలమున భూమండల మెల్ల జయించి యందెల్ల ధర్మప్రభుత్వము నెలకొల్పి కార్తవీర్యుఁడు విప్రపూజ చేయుచుండెను. ఆతఁడు ప్రతిదినమును దత్తాత్రేయ మహర్షిని బూజించుచు నాతనికిఁ గృతజ్ఞుఁడై యుండెను. తుదకీతఁడు దత్తాత్రేయుఁ డన్నట్లే జమదగ్నిమహర్షి నన్యాయముగా బాధించి పరశురాముని చేతిలోఁ జనిపోయెను.

## దత్తాత్రేయుఁ డలర్కునకు జ్ఞానము బోధించుట

మదాలసాఋతుధ్వజుల పుత్త్రుఁ డగునలర్కమహీపతి రాజ్యముచేయుచుఁ బురుషునకు ముముక్షను బోలినవస్తు వొకటి లేదనియు దాని నందుటకు సత్సాంగత్యము దక్క మార్గాంతరము లేదనియు నిశ్చయించుకొనెను. ఇంతలో

విరాగియై యడవుల నున్న యీతనియన్న యాసమయము
ననే కాశీరాజుకడ కేఁగి తనరాజ్యము తనతమ్ముఁ డపహ
రించినాఁ డనియు దానిని దన కిప్పింపు మనియుఁ గోరు
కొనెను. కాశీరాజు ససైన్యుఁడై యలర్కునిపై దండెత్తి
సామాద్యుపాయములఁ బ్రయత్నించుచుండెను. ఈసమయ
మున రహస్యముగా నలర్కుఁడు దత్తాత్రేయునికడకుఁ బరు
గునఁ బోయి దండప్రణామము లాచరించి శరణార్థి యగు
తనకు శరణ్యై రక్షింపుమని పరిపరివిధముల దీనుఁడై ప్రార్థించెను.
దత్తాత్రేయమహర్షి యాతనిఁ గరుణించి "ఓయీ! వివేకహీనా!
నిను నీవు తెలిసికొనుమోయీ! అంగములఁ జింతించి
యంగిఁ జూచి నిరంగునిఁ గనుఁగొని యసంగుఁడవై సర్వాంగ
ముల నెఱుఁగు" మని యాతనికిఁ దత్త్వజ్ఞానోపదేశము చేసి
"యిఁక విచార మే" మని యడిగెను. అలర్కుఁడు సమ్య
గాత్మదర్శనుఁడై దత్తాత్రేయునకు వందనము లాచరించి "నీకృపచే
బ్రదికితిని. సుస్థిరజ్ఞాన ముపదేశింపు" మని వేఁడుకొనెను. దత్తా
త్రేయుఁడు "మమ యనుట దుఃఖమునకు, నమమ యనుట
నిర్వృతికిని మార్గము. అహంకారమను నంకురముచేఁ బుట్టి మమ
కార మను మొదలు కలిగి గృహము క్షేత్రము ననుకొమ్మల
నంది పుత్త్రులు భార్య యనుపల్లవముల నొప్పి ధనము ధాన్యము
ననుపెద్దయాకులు వేసి పుణ్యపాపము లనుపుష్పములఁ బూచి
సుఖదుఃఖము లనుపండ్లు కాచి చిరకాలము పెరిగి యజ్ఞాన మను
కుదుళ్ళతో నిండి ముక్తిమార్గమును గప్పివేసి యున్న మమ
యనువృక్షమునీడను సంసారపథపరిశ్రాంతు లగుమిథ్యాజ్ఞాన

సుఖాధీనులకుఁ బరమసుఖము పరమదుర్లభము కావున, నీమహా వృక్షమును విమలవిద్య యనుగొడ్డలిఁ దీసికొని తత్త్వనిధులు సాధుజనులు వీరింకోడిసంగ మనుపాషాణమున బాగుగా నూఱి పదనుపెట్టి యెవరు నఱకుదురో వారు చల్లని బ్రహ్మవనము చొచ్చి నిత్యానందులై యపునరావృత్తి నందు" రని యుపదేశింపఁగా విని యానందియై "మహాత్మా! నిర్గుణ బ్రహ్మైకత్వమును బోధించుయోగము నెఱింగింపు"మని వేఁడుకొనెను. అంత నాతఁడు "వత్సా! శరీరమునందలి పరమజ్ఞానమునకు గురుఁడే యుపద్రష్ట. మోక్షార్థికి యోగము జ్ఞానపూర్వక మగును. ప్రకృతిగుణములతో నేకత్వము లేకపోవుటయు బ్రహ్మైకత్వము కలుగుటయు ముక్తి యన నొప్పును. ఆముక్తి పరమయోగమునఁ గలుగును. యోగము సంగత్యాగము వలన సిద్ధించును. సంగత్యాగమువలన నిర్మమత్వము దానివలన వైరాగ్యము దానివలన జ్ఞానము దానివలన మోక్షమును సంభవించును.

యోగికి ముం దాత్మజయము కావలెను. కనుకఁ బ్రాణాయామముచే నాతఁ డాత్మదేహదోషము దహింపఁ జేయవలయును. కామజము లైనకర్మములు యోగవిఘ్నకార్యములగుట యోగి వానిని త్యజించి శుద్ధాత్ముఁడై పరమాత్మునిలో నైక్యమై పోవును. అట్టి యోగికి గౌరవము విషము. అవమానమే యమృత మగును. ఆయోగి తన కున్న దే యిల్లుగాఁ దన యాఁకలికి దొరకినదియే భోజ్యముగాఁ దనకు గలదియే ధనముగా ముద మంది మమకారము నందఁడు. కావున, నీవు విచారము దక్కి యట్టి యోగపురుషుఁడవై మోక్షవృత్తి మఱవకు"

మని యలర్కునకు బోధించెను. అలర్కుఁడు బ్రహ్మానందముతో గృహమున కేఁగి రాజ్యమును బ్రీతిపూర్వకముగాఁ గాశీరాజున కిచ్చెను. దానిని గాశీరా జలర్కునియన్న కీయఁబోయెను. అలర్కునియన్నయు నానందించి తాను సోదరునకు జ్ఞానప్రబోధము చేయుటకే రాజ్య మర్థించితి ననియు నాపని యగుటచేఁ దనకు రాజ్య మక్కఱ లేదని కాశీరాజునకుఁ దత్త్వ ముపదేశించి తన యాశ్రమమునకుఁ బోయెను. కాశీరాజు అలర్కునిఁ బూజించి రాజ్య మాతనికే విడిచి చనియెను. అలర్కుఁడు సుతునకుఁ బట్టముకట్టి యడవి కేఁగి యోగియై విరాగియై యాత్మసుఖము నందెను.*

దత్తాత్రేయమహర్షి సంగమును విడనాడుటకై వివిధ వేషములఁ గైకొనువాఁడు. విల్లునమ్ములు గొని వేటకుక్కలు వెంటరాఁగాఁ జెంచువానివలె నుండువాఁడు. కాఱడవిలోఁ గిరాతతతి యుండెడుచో నుండి మద్యమాంసముల సేవించువాఁడు. మాలపల్లి కేఁగి చండాలురతోఁ గూడి మద్యమును గ్రోలువాఁడు. ఉన్మత్తుఁ డైనట్లు విహరించెడువాఁడు. ఐన నాతఁడు మహాయోగీశ్వరేశ్వరుఁడు. విచిత్రచరిత్రుఁడు.

"శ్లో॥ విభర్తి త్వానంద శ్శ్రుతిగణశిరోవేద్యమహిమా
యతో జన్మాద్యస్య ప్రభవతి స మాయాగుణపతిః,
సదాధార స్సోఽ్యం జయతి పురషార్థైక ఫలదః
సదా దత్తాత్రేయో విహరతి ముదా జ్ఞానలహరిః."

* మార్కండేయపురాణము.

"శ్లో. నమస్తే పాపౌఘాచలవితతిసంహారపవయే
నమస్తే దారిద్ర్యవ్యథితజనదైవాంతవిధయే,
నమస్తే రోగార్తానతమనుజదివ్యౌషధదృశే
నమస్తే దైవం మే నహి నహి జగత్యాం తవ పరమ్."

:—దలాదనః.

"శ్లో. జటాధరం పాండురంగం శూలహస్తం కృపానిధిమ్,
సర్వరోగహరం దేవం దత్తాత్రేయ మహంభజే."

"శ్లో. జగదుత్పత్తికర్త్రేచ స్థితిసంహారహేతవే,
భవపాశవిముక్తాయ దత్తాత్రేయ నమోఽస్తు తే."

"శ్లో. జరాజన్మవినాశాయ దేహశుద్ధికరాయచ,
దిగంబర దయామూర్తే దత్తాత్రేయ నమోఽస్తుతే"

:—నారదః.

"శ్రీలీలావిభవాప్తి కాశ్రితజనుల్
చింతింపఁగాఁ జేరుటే
సౌలభ్యం బనుచున్ నిజాగమున సం
జాతస్మృతిం బొల్చుభ
క్తాలిన్ గోర్కులొసంగి ప్రోచుటకు ద
త్తాత్రేయదివ్యాకృతిన్
శ్రీలాలిత్యముఁ గన్న నిత్యకరుణా
సింధుర్ హరిన్ గొల్చెదన్.

[చంద్రభానుచరిత్రము. ౧. ౧.]

ఓం

శ్రీగురుభ్యో నమః

# శ్రీ మహర్షి జీవిత కథామృతము

## దధీచి మహర్షి

### స్తుతి

**అతులతపోధనుండు చ్యవనాత్మజరత్నము దేవకార్యసంగతికి నిజాస్థు లిచ్చినయకల్మషదానమహావ్రతుండు పార్వతిని దృణీకరించుటఁ బరాత్పరుఁ దిట్టుట దక్షు నల్గి శాపతిమిరబద్ధుఁ జేసినప్రభావవిలాసి దధీచిఁ గొల్చెదన్.**

### దధీచి జననము

చ్యవనమహర్షి యాశ్వినులనెపమున సుకన్యాపాతివ్రత్యప్రభావముచే నవయౌవనుఁడు త్రిలోకసుందరుఁడునై సుకన్యను బిలిచి "సాధ్వీ! నీవు చేసినత్యాగ మనంతము. ఏలన, సుకుమారగాత్రివై హంసతూలికాతల్పమునఁ బరుండురాజపుత్రి వగునీవు తుచ్ఛకామముల నీసడించి యంధుఁడను వృద్ధును నైననన్ను వివాహ మాడితివి. మహాపతివ్రతవై నాకు యౌవనము సుందరాకారము గడించితివి. కావున, నీకు మహాత్యాగి పరమతపోధనుఁడు నగుకుమారుఁ డుదయించు" నని చెప్పి యామెతో రమించెను. అంత, సుకన్య గర్భముఁ

దాల్చి యుక్తకాలమున నొకశుభముహూర్తమున సుపుత్రుఁ గనెను. ఆతఁడే దధీచిమహర్షి.

## దధీచికి సారస్వతుఁడు జనించినవిషయము

దధీచి బాల్యమునుండియు మహాతపస్సు చేయుచుం డెను. ఆతఁడు చిరకాలము సరస్వతీనదీతీరమున నాశ్రమము నిర్మించుకొని యందుండెను. దధీచితపశ్శక్తిచే నాతనిదేహ మెల్ల దివ్యతేజోగోళముగాఁ బ్రకాశించుచుండెను. సరస్వతీ నది యాతనిఁ జూచి సమ్మోహిత యగుచుండెడిది. ఇట్లుండఁగా దధీచిమహర్షితపోగ్నిచే నెల్లలోకములు తల్లడిల్లుచుం డెను. అందుచే నింద్రుఁ డాలోచించి యలంబుస యనునొక యప్సరసను దపోవిఘ్నమునకై యాతనికడకుఁ బంపెను.

దధీచిమహర్షి సరస్వతీనదిలో స్నానముచేసి నీటిలో నిలిచి జపము చేసికొనుచుండఁగా నలంబుస యట కేఁగి తన నృత్యగీతాలాపములచే దధీచిదృష్టిఁ జూఱకొనెను. దధీచి కామమోహితుఁడు కాఁగానే యాతనివీర్యము స్ఖలితమై నదిలోఁ బడెను. సరస్వతీనది సంతసముతో స్త్రీరూపధారిణియై యావీర్యమును దనగర్భమున ధరించి గర్భవతి యయ్యెను. దధీచి యంత నిశ్చలుఁడై తనయాశ్రమమునకుఁ బోయెను. కాలక్రమమున సరస్వతి పుత్త్రునిఁ గని యాతని దధీచికడకుఁ గొనిపోయి జరిగినయుదంతమును జెప్పెను. దధీచి దివ్యదృష్టిని జూచి యది సత్యమగుట యెఱిఁగి కుమారుని ముద్దాడి యాతనికి 'సారస్వతుఁ' డను పేరిడెను. సరస్వతి పుత్త్రునిఁ గైకొమ్మని యాతని బ్రార్థించెను. దధీచి "సరస్వతీ! నేను తపోవ్రతుఁడను. కావున, వీనిని నీవే పెంచుచుండుము.

ఈతఁడు మహాశక్తిసంపన్నుఁడై ముందు రాఁబోవు మహాక్షామములలో నిజశక్తిచే మహర్షుల రక్షింపఁగలఁ" డని యామె కే యప్పగించెను. ఆమె తనపవిత్రజలములచే నాతనిఁ బెంచి విడిచెను. ఆతఁడు తపోధనుఁడై తండ్రి చెప్పినట్లు మహాక్షామకాలమున మహర్షుల నాహ్వానించి వారందఱకు షడ్రసోపేతముగా భోజనము పెట్టుచు క్షామనివారణము గావించెను.

## దధీచి కింద్రుఁడు నేర్పిన శాస్త్రములవృత్తాంతము

ఒకప్పు డింద్రుఁడు దధీచికడకు వచ్చి "ఋషిసత్తమా! నీవు మహాత్ముఁడవు. కావున, నీకు మహోత్తమశాస్త్రముల నుపదేశింతు" నని చెప్పి యాతనికిఁ గొన్నిశాస్త్రము లుపదేశించెను. ఇంద్రుఁ డతర్జితుఁ డగుచు "నీవు వీని నెవ్వరికైన నుపదేశించినచో నానాఁడే నీశిరము ఖండింతు" నని చెప్పెను. దధీచి యాశాస్త్రములను గ్రహించియుండెను.

అశ్వినీ దేవత లీవిషయము విని యొకనాఁడు దధీచి కడకు వచ్చి "మునికులతిలకా! తొల్లి మాతండ్రి యగుచ్యవన మహర్షికి నవయౌవన మొసంగిన యాశ్వినేయులము మేము. నీ వింద్రునివలన నెఱిఁగినశాస్త్రములను మా కిచ్చుచో మేము నీ కుపకృతి చేయఁగలము. కావున, నాశాస్త్రములను మాకు బోధింపు" మని వేఁడుకొనిరి. దధీచి తనకుఁ గలశాపవృత్తాంత మెఱిఁగించి తాను బోధింపఁజాల ననెను. ఆశ్వినులు "నీ కెట్టి యుపద్రవము వచ్చినను నిన్నుఁ గాపాడు బాధ్యత మాది. మేము దేవహితార్థ మయియే ని న్నర్థించుచున్నా" మని బతిమాలిరి. ధీచి యంగీకరింపఁగా వారొక యశ్వశిరమును గొనివచ్చి దధీచితలఁ దీసి యాయశ్వశిరము నదికి దానివలన శాస్త్రములు

గ్రహించి యాతనిపూర్వశిరమును భద్రపఱచి యుండిరి. ఇంద్రుఁడు దధీచి చేసినపనికి ఎగచి వెంటనే సాయుధుఁడై వచ్చి దధీచి శిరస్సు నఱికి వెడలిపోయెను. వెనువెంటనే యాశ్వినీ దేవలును వచ్చి దధీచి పూర్వశిరమును దధీచి కదికి యాతనిఁ బునరుజ్జీవితుఁ జేసి వెడలిపోయిరి.*

## దధీచిక్షువులపరస్పరవైరము

ఈప్రకారము పునర్జన్ముఁడైనదధీచిమహర్షి యొకనాఁ డాతనిబాల్యహితుఁడైనక్షువుఁ డనురాజుచే నాహూతుఁడై యాతనియింటికేఁగెను. క్షువుఁడు నాతని నుచితరీతిని గౌరవించి మన్నించెను. కాని, కొంతసేపటికి వారొక వివాదమునకు దిగిరి. బ్రాహ్మణాధిక్యమును దధీచి నిరూపింపఁ దొడగెను. క్షత్రియాధిక్యము క్షువుఁడు నిరూపింప మొదలిడెను. తుదకు వారివాదము తేలక శ్రుతి మించి రాగమునఁబడి యొకరి నొకరు నిందించుకొనఁ జొచ్చిరి. దధీచి కోపియై క్షువునిఁ బొడిచెను. క్షువుఁ డొక మహాయుధమును బ్రయోగించి దధీచిశరీరమును ముక్కముక్కలుగాఁ జేసెను. అంత దధీచి మరణించెను. దధీచి భార్గవవంశజుఁ డగుటచే శుక్రాచార్యుఁడు జాలిగొని యచటకు వచ్చి దధీచి దేహశకలము లన్నిటిఁ జేర్చి తనసంజీవనీమంత్రప్రభావమున నాతనిని క్షణములో బ్రదికించెను. దధీచి నిద్రనుండి లేచినట్లు లేచి భార్గవునకు వందనసహస్రము లాచరించెను. శుక్రుఁడు దధీచిఁ గౌఁగిలించుకొని "వత్సా ! నీవు సర్వశక్తిసంపన్నుఁడ వగుదువు.

---

* బ్రహ్మపురాణము. స్కాందపురాణము.

సదాశివునిఁ గూర్చి తపము చేయు" మని దీవించి యంత ర్హితుఁ డయ్యెను.

**దధీచి క్షుపుని విష్ణుని నిందించి గెల్చుట**

దధీచి యటనుండి లేచిపోయి యాశ్రమమున కేఁగి పరమశివుని గుఱించి తపముచేయ మొదలిడెను. నిరాహారుఁడై నిర్జితేంద్రియుఁడై దధీచిమహర్షి తపస్సు చేయుచుండఁగా ముల్లోకములు గగ్గోలుపడుచుండెను. ఈశ్వరుఁడు నతనితపోనవద్యతకు మెచ్చి ప్రత్యక్షమై దధీచికి స్వచ్ఛంద మరణము, వజ్రమయశరీరము, లోకత్రయవిజయశక్తి నిచ్చి యదృశ్య మయ్యెను. దధీచి మహావరసంపన్నుఁడై యుండియు క్షుపుఁడు తనకుఁ జేసియున్న యవమానము బ్రాహ్మణనింద మఱవఁజాలక యాతని గృహమున కేఁగి క్షుపు నొక తన్నుఁ దన్నెను. క్షుపుఁడు మహాకోపముతోఁ దధీచి నెన్నియోవిధముల హింసింపఁ జూచి బహుశస్త్రాస్త్రములఁ బ్రయోగించిన నవి విఫల మయ్యెను. అంత దధీచి "ఓరీ! క్షత్త్రియాధముఁడ వగు నీ వెక్కడ? బ్రాహ్మణశ్రేష్ఠుఁడ నగు నే నెక్కడ? బ్రాహ్మణుఁ డధికుఁ డగునో కాదో తెలిసి నదా? నీవు కాదు. నే దేవుఁ డగువిష్ణువుకూడ నాకాలి గోటికి సరికాఁడు గ్రహింపు" మని గర్వించి పల్కెను. క్షుపుఁడు చేయునది లేక, విష్ణుమూర్తిని గుఱించి తపస్సు చేయఁగా నాతఁడు ప్రత్యక్ష మయ్యెను. క్షుపుఁడు తనకు దధీచివలనఁ గల్గినయవమానమును దధీచి విష్ణుని లెక్క సేయక పోవుటయుఁ దెల్పి రక్షింపు మని కోరెను. అంత విష్ణుమూర్తి క్షుపుని వెంటఁగొని దధీచికడ కేఁగి "ఓరీ!

శివవరగర్వితుఁడ వైతివా ? నేనును శివుఁడును నొక్కటి గాదా !" యని యడిగెను. దధీచి "నీవేడ ? శివుఁ డేడ ? శివభక్తుఁడ నగు నాకోటికైనను నీవు చాలవు. ఇఁక శివుని తోడి సామ్య మెందుల" కని పరిహాసము చేసెను. విష్ణుమూర్తి దధీచిశిరముఁ ద్రుంపఁ జక్రమును బంపెను. దధీచి తన తపశ్శక్తిచేఁ జక్రమును నివారించుకొనెను. విష్ణుమూర్తి మాయ పన్నెను. దధీచి యామాయను భేదించెను. అంత విష్ణుమూర్తి "వత్సా ! దధీచీ ! నీభక్తితాత్పర్యమును బరీక్షింప నిటు వచ్చితిని. నిజముగా మాభక్తశ్రేష్ఠుఁడ వగు నీవంటివాని కాలిగోరికో నైనఁ బోలఁగలవాఁ డెవఁడు ? నీవు దేవహితార్థివై జీవింపు"మని పలికి క్షుపునితో నాతని శరణు వొచ్చుటకంటె నుపాయాంతరము లే దని చెప్పి యంతర్హితుఁ డయ్యెను. క్షుపుఁడు దధీచిపాదములపైఁ బడి "మహాత్మా ! నీశక్తి యెఱుఁగక నీ కెగ్గు చేసితిని. నాతప్పు సైరింపు" మని పరిపరివిధములఁ బ్రార్థించెను. దధీచి శాంతుఁడై "మిత్రమా ! నీమీఁద నా కావంతయుఁ గోపము లేదు. బ్రాహ్మణక్రోధము నీటిపై గీఁత క్షణికములుకదా ! నీవు యథాపూర్వము నాప్రియమిత్రుఁడవై యుండు"మని యనుగ్రహించి యాతనిఁ బంపివేసెను.

ఈరీతిగాఁ దపోనవద్యుఁడై వరశక్తిసంపన్నుఁ డయ్యు దధీచిమహర్షి శిష్యప్రశిష్యులఁ జేర్చికొని ధర్మసంరక్షణార్థము 'గభస్తిని' యనునామాంతరము గల 'సువర్చ' యనుకన్యఁ బరిగ్రహించి గృహస్థజీవనమును మహాదర్శముగాఁ గడపుచుండెను. సువర్చ మహాసాధ్వియై పతిపదపద్మసేవ తక్క నన్య

మెఱుఁగ కుండెను. దధీచి కనతికాలముననే కోటానఁగోట్లు ఋషులు శిష్యప్రశిష్యులైరి.

## దధీచి దక్షుని శపించుట

ఇట్లుండ నొకనాఁడు దక్షప్రజాపతి యజ్ఞము చేయఁదలఁచి దధీచిమహర్షిని శిష్యసమేతముగా విచ్చేయవలసిన దని వర్తమాన మంపెను. దధీచి యానందించి శిష్యప్రశిష్యులతో దక్షాధ్వరమునకు బయలు దేఱి వెళ్లెను. దక్షుఁడు శివభక్తాగ్రగణ్యుఁ డగుదధీచియుఁ దనయజ్ఞమునకు వచ్చుట తనకు మెచ్చియే యని యానందించి యాతని కుపచారములు సల్పి "మిత్రమా! శివుఁడును శివానుచరులును రాకుండఁ జేసి నేను యజ్ఞము చేయ నిశ్చయించితిని. జగద్ద్రోహి యగు శివుని బిలువకుండుట నీకును సంతోష మైనచో నిట నుండి యజ్ఞము నిర్వర్తింపు" మని పల్కెను. దధీచి శోకఁ ద్రొక్కినత్రాఁచు వలె లేచి వసిష్ఠవామదేవవ్యాసనారదాదిమహర్షు లెల్లరు రాకుండుట కదియే కారణ మని యెఱిఁగి "ఓదక్షప్రజాపతీ! నీకీ దుర్బుద్ధి యేల పుట్టినది? విశ్వేశ్వరుఁడు, దేవాదిదేవుఁడు నగు శివుఁడు లేనిదే యజ్ఞ మెట్లు జరుగును? జరిగినను నీకు లభించు ఫలిత మేముండు" నని శివు ననేకవిధములఁ బ్రస్తుతింప మొదలిడెను. దక్షుఁడు శివుఁడు శ్మశానవాసి, దిగంబరుఁడు, గజచర్మధరుఁడు, బిచ్చగాఁడు, శశశృంగుఁడు నని యనేకవిధముల దూషించెను. దధీచి సభాసదు లెల్లరు వినుచుండఁగా మహాప్రశాంతుఁడై వానికన్నిటికిని సముచితముగా బదులుచెప్పి పరమశివుని ప్రఖ్యాతిని బలువిధముల విస్తరించి చెప్పెను. ఎన్ని చెప్పినను దక్షుఁడు లెక్కచేయక "అనిర్వా

గ్యుని నుతించువారు లోకైకనిమేషమైన నిట నిల్వరా" దని యాజ్ఞాపించి దధీచి నవమానించెను. దధీచి శిష్యసహితుఁడై లేచి "ఓ దక్షనామకమూర్ఖాగ్రేసరా! నే నెన్ని చెప్పినను వినక సదాశివుని దూషించితివి. కావున, నీయజ్ఞమశుభప్రతిపాదక మగుఁగాక! నీవును దగిన ప్రాయశ్చిత్తము నందుదువుగాక! వివేకవిహీనుఁడవైన నీవు చేయుజన్నమునకు వచ్చిన యీ దేవఋషిగణ మెల్ల వినాశమునందుఁ గాక!" యని శపించి యజ్ఞవాటమునుండి వెడలిపోయెను. ఈతనిశాప ప్రకార మచిరకాలముననే వీరభద్రునిచే దక్షాధ్వరధ్వంసము సదస్యవినాశనము కలిగెను.

దధీచి దేవతలయస్త్రశస్త్రముల మ్రింగుట

ఒకప్పుడు రాక్షసులు విజృంభించి దేవతలపై దండెత్తి వారి నోడించి యిఁక నెన్నఁడు వారు తిరిగి తమ కపకృతి యొనరింపఁజాలకుండుటకు వారివారియస్త్రశస్త్రములను లాగివైచుకొనుచుండిరి. దేవతలు నుపాయాంతర మాలోచించి దధీచిమహర్షి కడఁ దమయస్త్రములు దాఁచియుంచినచోఁ బ్రమాదము తప్పు నని యెంచిరి. అంత నింద్రాది దేవతలెల్లరును నస్త్రశస్త్రసమేతులై దధీచిమహర్షికడ కేఁగి యాతని పాదముల పైఁబడి తమదురవస్థఁ దెలిపికొని తమయస్త్రములను దాఁచిపెట్టుమని యర్థించిరి. దధీచి జాలిగొని య ట్లంగీకరించి వారి యస్త్రముల నెల్ల గ్రహించెను. దేవతలును దమయస్త్రభద్రత కానందించి వెడలిపోయిరి. త్వరలో వారికిని రాక్షసులయుపద్రవము తొలఁగిపోయెను. కాని, వారు భోగలాలసులై దధీచికడకు వచ్చి యస్త్రములను గ్రహింప నాలస్యము చేయుచుండిరి.

దధీచి వాని నన్నిటిఁ జిరకాలము దాఁచియుంచఁజాలక వానిపై జల మభిమంత్రించి వానినెల్ల నొక్కపరి మ్రింగివేసెను. ఆతని తపఃప్రభావమున నవియెల్ల జీర్ణమై యాతని రక్తనాళములలో నెముకలలోఁ జేరిపోయెను.

అంతఁ గొంతకాలమునకు దేవతలు వచ్చి దధీచి నస్త్రము లిమ్మని కోరిరి. దధీచి తాను చేసినపని చెప్పి వారియాల స్యమే దానికారణ మని పలికెను. దేవతలు భయగ్రస్తులై యెట్లో తమయాయుధము లిమ్మని కోరిరి. దధీచి యవి జీర్ణములై యెముకలకు వ్యాపించిన వనియు నవసరమైనచోఁ దన్ను జంపి తీసికొం డనియు ననెను. దేవతలు నాతనిఁ జంపుశక్తి లేక చంప భయభ్రాంతులై దీనవదనులై యేడ్వఁ జొచ్చిరి. దధీచి వారి నూఱడించి "నేను మీకొఱకే జీవించుచున్నాను. ప్రస్తుతము మీకాయుధము లవసరము లేదు కదా! మీకత్యావశ్యక మైననాఁడు రండు. నా దేహము నేనే విడిచివేయుదును. నాయస్థులే శతాధిక బలసంపన్నము లగుమీయాయుధము లగును. విచారము దక్కి పొం"డని పల్కెను. దేవత లాతని జగద్ధితమతికి మెచ్చి నమస్కరించి యానందముతో వెడలిపోయిరి.

## దధీచి దేవకార్యమునకై దేహము త్యజించుట

మఱియొకప్పుడు వృత్రాసురుఁడు సహచరాసురులతో విజృంభించి దేవతలకు మహాపద సంభవింపఁ జేసెను. ఆతని నెట్లును జయింపశక్తి లేక దేవత లందఱు బ్రహ్మకడ కేఁగి ప్రార్థించిరి. ఆతఁడును దనశక్తిహీనతఁ దెల్పి "ఇఁక మీరు దధీచిఁ బ్రార్థించి యాతనియస్థులు గైకొని వాని నాయుధము లుగా నుపయోగించినచో మీ రీయసురులఁ జంపఁ గల్గుదురు.

అంతకు మించి మార్గాంతరము లేదు. కనుక, పోయి యాతనిఁ బ్రార్థింపుఁ" డని వారిని బంపివేసెను. దేవతలు దధీచివాగ్దానము జ్ఞప్తికిఁ దెచ్చుకొని యాతనికడ కేఁగి యాతనితోఁ దమదుస్థితిని దెల్పుకొని సంరక్షింప వేఁడుకొనిరి.

దధీచి తనభౌతికదేహమును విసర్జించి దేవహితము చేయుటకంటె వలసినది లే దని నిశ్చయించుకొని "దేవతలారా ! మీరు నన్ను వెంటనే చంపి నాయస్థులు కొనిపో వచ్చు" నని యాహ్వానించెను. ఇంద్రాదులు భయకంపితులై "మహాత్మా ! నిన్నుఁ జంపుశక్తి మాకడ లేదు. బ్రహ్మహత్యాదోషముమాట యటుండనిమ్ము. నీకు స్వచ్ఛందమరణ మీశ్వరుఁ డనుగ్రహించియుండుట నొరు లెవ్వరు నిన్నుఁ జంపఁజాల" రని పల్కిరి. దధీచి "ఐనచో యోగాగ్నిఁ గల్పించుకొని నేనే మరణింతును. మీకర్తవ్యమును మీరు నిర్వర్తించుకొనుఁ" డని యోగాగ్నిఁ గల్పించుకొని పరబ్రహ్మను సంధానమున దేహముఁ ద్యజించి పరమశివునిలో నైక్యమయ్యెను. దేవతలు గోగణమును బ్రార్థించి వానిచేఁ బరిశుద్ధము చేయఁబడిన దధీచియస్థులనే బ్రహ్మచక్రము, వజ్రాయుధము మున్నగు నాయుధములు చేసికొని యసురులను నిర్జించిరి. *

## దధీచికిఁ బిప్పలాదుఁ డుద్భవించినవిధము

దధీచిమహర్షి చనిపోవుసరి కాతనిభార్య సువర్చ గర్భవతియై యుండెను. భర్తమరణము వినఁగానే యా మహాసాధ్వి సహగమనమునకై చితి నెక్కెను. అంతలో బ్రహ్మాదులు ప్రత్యక్షమై "సాధ్వీ ! నీగర్భమున మహాత్ముఁ

* స్కాందపురాణము. బ్రహ్మపురాణము. శివపురాణము.

డగు బాలుఁడున్నాఁడు కావునఁ బ్రాణత్యాగము చేయకు" మని పల్కిరి. సువర్చ "దేవతలారా ! మీయవర్తనము చూడఁ జిత్రముగ నున్నది. నాభర్తను జంపితిరి. సాధ్వి నగు నాకు వైధవ్యదుఃఖము నిచ్చుట కేట్లు పన్నుచుంటిరా ? నాభర్తను జంపిన దేవతలు పశువులై ప్రవర్తింతురు గాక" యని శపించి భర్తచితి నెక్కెను. అంతలో నామె గర్భము నుండి యొకబాలుఁడు జాతి సమీపముననున్న పిప్పల వృక్షముకడఁ బడెను. ఆమె చితిలో భస్మమైపోయెను.

అట్లు జనించి పిప్పలవృక్షముక్రిందఁ బెరిఁగిన బాలుఁడే పిప్పలాదమహర్షి. పిప్పలవృక్ష మాతనిపై జాలిగొని చంద్రు నర్థించి యమృతముఁ గొనివచ్చి యాబాలునికిఁ బోయఁగా నాతఁ డాఁకలి దప్పి తెలియఁగక చక్కఁగాఁ బెరిఁగెను. ఆ కారణముననే యాతనికిఁ బిప్పలుఁ డనుపేరు కలిగెను. ఈతఁడు పెరిఁగి పెద్దవాఁడై తనతండ్రి మరణమునకుఁగారకులైన దేవతలఁ జంప నెంచి యీశ్వరుని గుఱించి తపస్సుచేసెను. ఆతఁడు ప్రత్యక్షమై దేవతలను జంప సమర్థ మగుకృత్యను బంపెను. దేవతలు శివుని శరణు వేఁడగా శివుఁడును బిప్పలాదునిఁ బ్రార్థించి దేవతావధోద్యోగమును విరమింపఁజేసి యా పిప్ప లాదునికిఁ బితృలోకమునఁ దలిదండ్రులను జూడఁ గలుగువర మిచ్చి యదృశ్యుఁ డయ్యెను. పిప్పలాదుఁ డిట్లు దధీచిమహర్షికిఁ బుట్టి యారీతి మహర్షియై వెలుఁగొందెను.*



---

* స్కాందపురాణము. మాహేశ్వరఖండము. కేదారము.

ఓం.

శ్రీగురుభ్యో నమః

# శ్రీమహర్షి జీవిత కథామృతము

## దుర్వాసో మహర్షి *

స్తుతి

"అనుభావశక్తి బ్రహ్మాదుల నొకపూరి
పుడకకుఁ గైకోనిపోతరీఁడు
ఘనకోపవాణిజ్యమునఁ దపోవిత్తజా
లముఁ గూడఁబెట్టెడులాబగాఁడు
తనరథంబునకు మాధవసత్యభామల
గుఱ్ఱాలఁ జేసినకోడిగీఁడు
యతిసతీకులరత్న మనసూయకడుపున
మునుమునఁ బుట్టినముద్దులాఁడు
సకలకల్యాణకరుఁడు సాక్షాదనంగ
హరుఁడు నిర్మలతత్త్వ విద్యావిచార
కావిలాసుఁడు దుర్వాసుఁ" డావరిష్ఠు
నధికనిష్ఠ భజింతుఁ బ్రత్యహము భక్తి.

[వరాహపురాణము, ౨ ఆ, ౧౮౦]

---

* దూర్వాసమహర్షి, దుర్వాసమహర్షి అనురూపములు వాడుకలోఁ గలవు. కాని, అవి వ్యాకరణదుష్టములు. దుర్వాసోమహర్షి యన్నదే వ్యాకరణయుక్తము.

## దుర్వాసుని జననప్రకారము

దుర్వాసుఁ డత్రిమహర్షి నిరుపమానతపఃఫలము. త్రిమూర్తు లనసూయ కొసంగినవరప్రసాదము. ఈతఁడు శివాంశ సంజాతుఁడు. హైహయుఁ డనురా జొకఁడు దుష్టుఁడై అనసూయకు గర్భనిరోధము కావించెను. ఇది యెఱిఁగి యారాజును నిర్దగ్ధుం జేయఁదలఁచి దుఃఖము, కోపముఁ దాల్చి గర్భవాసమున నేఁడు దినము లుండి దుర్వాసుఁ డను నామమున రుద్రుఁడు తమోగుణోద్రిక్తుఁడై యవతరించెను. వెంటనే యాతని తేజోంశమున హైహయుఁడు భస్మమయ్యెను.*

## దుర్వాసుని తపశ్శక్తి

దుర్వాసుఁడు క్రమముగాఁ బెరిఁగి తలిదండ్రులచేఁ గృతోపనయనుఁడై వారియాశీర్వచనము నంది యేకాకియై మహోగ్రతప మొనరింపఁ జొచ్చెను. ఆతని బ్రహ్మచర్యదీక్షకును దపోనిరతికిని ముల్లోకము లచ్చెరువందెను. ఏతత్ఫలితముగా నాతఁ

* మార్కండేయపురాణము. కాని

సీ. పరిబలదైత్యులు పురత్రయనాయకులు జగత్త్రయము నప్రతిమప్రతాపలీల
బాధింప దివిజులు ఫాలలోచనుఁ గాంచి కావుము కృప దేవదేవ యమ్మఁ
బశువుల మగువారిఁ బశుపతి వైన నీ వనుచు మహాక్రోశ మాచరింప
నప్పురంబులు మూఁటి నస్త్ర మొక్కటన భస్మముగాఁ గఁ జేసి యమ్మార్గణంబు

గీ. వంకమున నిడ నది బాలుఁడైన నీతఁ
డెవ్వాఁ డని చూచి వెఱఁగంది యెల్ల సురలు
వినుతి సేయు బ్రాహ్మణమూర్తి వెలుఁగు నతని
కిడియె దుర్వాసుఁ డనునామ మీశ్వరుఁడు.

భార. ఆను. గీ. 3 ఆ. అని కలదు.

దేవలోకమునఁ గావలసిన నాలోకమునఁ దలఁచినమాత్రముననే తిరుగఁ గలసామర్థ్యము సంపాదించెను. ఆతని దివ్యతేజముఁ గాంచి సురయక్షకిన్నరాదులు జోహారు లొనర్చుచుండిరి. ఈరీతి ననంతశక్తిసంపన్నుఁడై దుర్వాసుఁడు నిజతపోగరిమఁ ద్రిలోకములఁ జరించుచుండెను. పిదప, నీతఁడు తలిదండ్రులను సర్వసంగములను విడిచి, "ఉన్మత్తము" అను నుత్తమవ్రత మవలంబించి తిరుగుచుండెను.

## దుర్వాసుఁ డింద్రుని శపించుట

ఒకనాఁడు దుర్వాసుఁడు విష్ణుమూర్తిని దర్శించి యాతని యాశీస్సుల నంది యాతఁ డాదరపూర్వకముగా నిచ్చిన పారిజాతప్రసూనమును, మార్గమధ్యమున విద్యాధరకాంతలు సభక్తికముగా నిచ్చినపుష్పమాలికలును నిజహస్తమున నుంచుకొని తిరిగి వచ్చుచుండెను. దేవేంద్రుఁ డైరావతము నెక్కి నందనోద్యానవిహారానంతరము తిరిగి వచ్చుచు నాతని కెదురయ్యెను. దుర్వాసోమహర్షిని గన్నంతనే యింద్రుఁడు పలుకరించి నమస్కార మొనరించెను. దుర్వాసుఁడు తనచేత నున్నపుష్పమాలికల నాతనికి బహూకరించెను. ఇంద్రుఁడు వానిని గైకొనియుఁ గొంతనిర్లక్ష్యముగా నైరావతముశిరముపై నాదండల నుంచెను. ఐరావతము తనతొండముతో నామాలికలు లాగి చించి పాఱవైచెను. దుర్వాసుఁ డిది చూచి యింద్రు నుద్దేశించి "ఓరీ! దుర్మదాంధా! పరమపవిత్రమును విష్ణుప్రసాదము నగుమాలికను నీకు బహూకరింప నింతనిర్లక్ష్యముతోఁ గైకొందువా? ఐశ్వర్యమదోన్మత్తుఁడవై యొడ లెఱుంగని నిన్నూరక పోనిత్తునా! నీయైశ్వర్య మంతయు గంగపా లగుఁగాక! నీ యైరావతము శిరము

ఖండింపఁబడుఁగాక!" యని శపించెను. దేవేంద్రుఁడు వెంటనే దుర్వాసునిపాదములఁ బడి కరుణింప వేఁడుకొనెను. దుర్వాసుఁడు కరుణించి శ్రీహరిని బూజించినచోఁ దిరిగి స్వసంపద నందఁగల వని పలికి వెడలిపోయెను. ఈశాపమూలముననే యమృతాదు లెల్ల సముద్రము పాలాయెను; ఐరావతము శిరము నఱుకఁబడి వినాయకుని కదుకఁబడెను.*

* అని విష్ణుపురాణము.

తన్నుఁ గురించి ఘోరతపము చేయు సుప్రతీకుఁ డనురాజు ననుగ్రహింపఁ దలఁచి దుర్వాసుఁడు విచ్చేయుచుండఁగా దారిలో నాతనికి వనవిహారము చేయుచు నైరావతము నెక్కి తిరుగు నింద్రుఁడు కానవచ్చెను. తన్నుఁ జూచి గౌరవింపక, వాహనమైన దిగక గర్వియై యున్న యింద్రుని జూచి మండిపడి దుర్వాసుఁడు :

"అనుకంప లేక బ్రాహ్మణుని నమ్మించి గొం
తుక గోసిపోయిన దోసకారి
గౌతమఋషి కులాంగన నహల్యాదేవిఁ
జీకటితప్పు చేసిన దురాత్మ
పరసతి బిడ్డని హరికోప హుతవహో
ద్జ్వాలలోనఁ ద్రోచిన క్రూరకర్మ
సగర క్షమాపాల సప్తతంతు విముక్త
హరి బ్రుచ్చిలించిన పరమ ధూర్త

ఓరి గోత్ర విఘాతి నన్నొక తపస్వి
మాతుఁగాఁ జూచి యిపుడు నమస్కరింప
వైతి గావున దేవరాజ్యాధిపత్య
మునకుఁ బెడబాసి భువిఁ గూలు మని శపించె

అని వరాహపురాణమునఁ గలదు.

## దుర్వాసుఁడు సుప్రతీకు ననుగ్రహించుట

కృతయుగమున సుప్రతీకుఁ డనుమహారాజు శుభలక్షణ వతు లగునతు లెందఱనో చెట్టవట్టియు నొక్కపట్టిఁ బడయఁ జాలఁడయ్యెను. తుదకాతఁడు కుమారు నపేక్షించి దుర్వాసో మహర్షిఁగూర్చి తపముచేయఁగా నాతఁడు విచ్చేసి "నీకు విద్యు త్ప్రభయను భార్యయందు సుతుఁ డుదయించు" నని వరమిచ్చి వెడలిపోయెను.

పిదప దుర్వాసుని వరము కతమున సుప్రతీకునకు విద్యు త్ప్రభయందు దుర్జయుఁడను కుమారుఁడు జన్మించెను. ఆతనికి జాతకర్మాదులు దుర్వాసుఁడే యొనరించెను. పిదప, నాతనికి సర్వశాస్త్రములు నాతఁడే నేర్పెను. దుర్వాసుఁడు పనిబూని యొకయిష్టివేల్చి యాబాలుని వెంటనే పదాఱువత్సరముల వానిఁజేసెను. సుప్రతీకుఁడు దుర్వాసుని కెంతయో భక్తిచూప నాతఁడు మెచ్చి సుప్రతీకునికిఁ గాంతిమతి యను నిల్లాలియం దింకొకపుత్త్రుఁడు కలుగ వరమిచ్చెను. సుద్యుమ్నుఁడను కుమారుఁ డామెకుఁ గలిగెను. ఇట్లు దుర్వాసుఁడు సుప్రతీకు ననుగ్రహించెను. *

## దుర్వాసుఁడు తిలోత్తమాసాహసికుల శపించుట

దుర్వాసోమహర్షి గంధమాదనపర్వతముపైఁ దపస్సు చేసికొనుచు నుండెను. ఆసమయమున బలిచక్రవర్తి కుమారుఁడైన సాహసికుఁడు నప్సరోంగన యగు తిలోత్తమయుఁ బరస్పరప్రేమ వివశులై దుర్వాసునియెదుటనే సంభోగింప మొదలిడిరి. సౌందర్యనిధులైనయాయుభయులకుఁ బారవ

* వరాహపురాణము.

శ్యమున నాహ్లాదారనము లధికము కాఁజొచ్చెను. వీనివలనఁ దనకు వ్రతభంగము గలుగ దుర్వాసుఁడు మితిమేరలు సమయాసమయములు నెఱుఁగవలదా యని వారిని మందలించి రాక్షసులై భువి జన్మింపుఁ డని శపించెను. వారు నంత నోడలెఱిఁగి యాసంయమికి నమస్కరించి ప్రార్థింపఁగా శ్రీకృష్ణుఁ నిచేఁ జచ్చినపిదప నాతనికిని, కృష్ణునికుమారునికోడిజీవన మున నామెకును శాపవిమోచన మగునని పల్కెను. సాహసికుఁ డంతులకే గార్దభాసురుఁ డయ్యెను. తిలోత్తమ బాణుని గృహమున నుషయై జన్మించెను. †

## దుర్వాసుఁడు వపువను నచ్చరను శపించుట.

ఒకొల్లి యిందుఁడు నందనోద్యానమున నప్సరసల గానము లాలించువేళ నచటికిఁ నారదుఁడు విచ్చేసెను. ఆతని ననేకవిధములఁ బూజించి యింద్రుఁడు "మునీంద్రా! ఈ యచ్చరలలో నెవతె యెక్కువయో సెలవిం" డని కోరెను. నారదుఁడు మంచుకొండమీఁదఁ దపముచేయు దుర్వాసు నెవతె చలింపఁజేయునో యామె యెక్కువ దని పలికెను. తా మందులకుఁ జాలమని యప్సరస లెల్లరు తలలువాంచిరి. కాని వపు వను నచ్చర గర్వముతో "మునిరాజా! నేను దుర్వాసుని వెంటఁగొనివచ్చెద. ఆతఁడేయేల? నేను దలఁచుకొన్నచో పురహరునైనను గాముునింటికి ఘటదాసుని జేయుదు"నని చెప్పి దుర్వాసునికడ కరిగెను.

తపస్సున నున్న దుర్వాసుఁ డామె యుటఁ బ్రదర్శించిన హావభావవిలాసములకుఁ గనలి పక్షివై పుట్టు మని శపించెను.

---

† బ్రహ్మపురాణము.

కడ కాతఁడు కరుణాళువై యామెకు శాపమోక్షము ననుగ్రహించెను. *

## దుర్వాసుని వివాహము

తిలోత్తమాసాహసికుల రతిక్రీడఁ గాంచినదుర్వాసునకు సంసారవాంఛ జనింపఁగా నౌర్వమహర్షి కొమార్తె యగు కందళి నాతఁడు వివాహమాడ నెంచెను. ఔర్వుఁ డామె కోపిష్ఠిని యనియు నవివేకిని యనియుఁ జెప్పి యందుల కామెను మన్నింపు మనెను. దుర్వాసుఁ డంగీకరించి కందళిని వివాహమై యుచితభోగముల నందెను. కాని, తుదకామె గయాళియై యాతని బాధింపఁజొచ్చెను.

## దుర్వాసుఁడు భార్యను భస్మము చేయుట

ఎంతకాలమైనను దనగుణము మార్చుకొనలేని కందళితో విసిగి వేసారి యొకనాఁ డామెయందు నిర్మముఁడై దుర్వాసుఁడు తీక్ష్ణముగాఁ జూచెను. వెంటనే యామె భస్మమైపోయి యొకసుందరరూపమున నాకసమునఁ గానవై తన దోషమును క్షమింపు మని కోరి యదృశ్యయయ్యెను. దుర్వాసుఁడు దనయంతటివాని వివాహమాడినకారణమున నామె నామము భువిపై శాశ్వతముగ నుండునట్లు చేయఁ గదళీజాతిని సృష్టించి యామెనామమును జిరస్థాయి నొనర్చెను. †

## ఔర్వుఁడు దుర్వాసుని శపించుట

కొంతకాలమునకుఁ గూఁతునల్లునిఁ జూడఁ దలంపు గలిగి యౌర్వమహర్షి దుర్వాసునాశ్రమమునకు వచ్చి తనూజం గానక దివ్యదృష్టి నామెకు జరిగినగతిఁ దెలిసికొని దుర్వా

* మార్కండేయపురాణము † బ్రహ్మవైవర్త పురాణము.

మునిం జూచి "ఓరీ! నాకొమార్తె యవివేకిని యని చెప్పి మన్నింపు మని ముందే కోరితిని. దానికి నీ వొడంబడి వివాహమై యామెను భస్మముచేసి ఎన్నవమానించితివి. ఈ కారణముచే నీవు నంబరీషుఁ డను రాజన్యునివలన ఘోరావమానమునకుఁ బాత్రుఁడవై ఖేదము ననుభవింతువు గా" కని దుర్వాసుని శపించి వెడలిపోయెను. దుర్వాసుఁడు చేయునది లేక కానున్నది కాక మాన దని తనదారిం బోయెను.*

## దుర్వాసుఁ డంబరీషునికడఁ బరిభవింపఁబడుట

కొంతకాలమునకు దుర్వాసుఁడు సంచారము చేయుచు నాభాగునికుమారుఁ డగు నంబరీషునియింటి కేఁగి యాతిథ్యము కోరెను. భక్తవరిష్ఠుఁ డగునంబరీషుఁడు మహాప్రసాద మని యాతని శిష్యసమేతముగా స్నానము చేసి రమ్మని కోరెను. దుర్వాసుఁడు శిష్యులతో నదీస్నానమున కేఁగి యెంతకును దిరిగి రాకుండుటచే ద్వాదశీవ్రతనిష్ఠుఁ డగునంబరీషుఁడు బ్రాహ్మణానుమతి నుదకపానముచేసి యుండెను. అంత దుర్వాసుఁడు సశిష్యుఁడై వచ్చి తాను రాకుండ నుదకపానము చేసిన యంబరీషుని శిక్షింపఁ దనజటలనుండి యొక కృత్యను మంత్రించి పంపెను. భక్త బాంధవుఁ డగు విష్ణు వంబరీషుని గాపాడఁ దనచక్రము నంపెను. ఆచక్ర మాకృత్యను రూపుమాపి దుర్వాసునిమీఁదకు రాఁగాఁ నాతఁడు పాఱిపోయి శివుని శరణుచొచ్చెను. ఆతఁడు తా నేమియుఁ జేయఁ జాలన నెను. దుర్వాసుఁడు విష్ణుమూర్తి కడ కేఁగి శరణువేఁడ నాతఁ డంబరీషునే శరణు గోరుమని సూచింప దుర్వాసుఁడు పరుగున వచ్చి యంబరీషుని శరణువేఁడ

---

* బ్రహ్మవైవర్తపురాణము.

నాతఁడు విష్ణుచక్రమును బ్రార్థింప నది యదృశ్యమయ్యెను. దుర్వాసుఁ డాయ్యనిశాపమూలమున నీ ఖేదము గల్గిన దని చెప్పి యంబరీషు నభినందించి వెడలిపోయెను.*

**దుర్వాసుఁడు శబరతాపసుని బరీక్షించి వరము లొసంగుట**

తొల్లి యొక శబరతాపసుఁ డడవిలో మహాతపము చేయుచుండ దుర్వాసుఁ డచటి కేతెంచెను. ఆభిల్లు డాతని నెంతయుఁ బూజించి తన కతిథి కమ్మని కోరెను. దుర్వాసుఁ డాతనిఁ బరీక్షింపఁ దలఁచి వల్లెయనెను. ఆభిల్లుని చిత్తశుద్ధికి మెచ్చి యాకాశవాణి యొకమణి పంపెను. దానివలన నెం దఱో యువతు లుద్భవించి పంచభక్ష్యపరమాన్నములు సిద్ధ ముచేసిరి. శబరుఁడు దుర్వాసుని విందారగింప రమ్మనికోరెను. కాని, యాతఁడు తనకు జలములు కావలయు ననెను. శబర తాపసుఁడు దేవికానదిని బ్రార్థించి యామె దుర్వాసునికడకు వచ్చి ప్రవహించునట్లుచేసెను. దుర్వాసుఁ డానందించి యా యేట మునిఁగివచ్చి యాతని విందారగించి దయామయుఁడై "ఓయీ ! నీవు కురూపదేశమార్గమున సత్యం బవలంబించి తపంబుచేసితివి. ఇఁకనుండి నీవు సత్యతపుఁ డను పేరఁ బరగుము. వేదశాస్త్రపురాణాది వైశారద్యము నీకుఁ గలుగుఁ గాక" యని వరమిచ్చెను.

అనంతరము దుర్వాసుఁ డాతని కిట్లుపదేశించెను. "ఓయీ ! సుజ్ఞానమునఁగాని సత్కర్మము జరుగదు. సత్కర్మ మునఁగాని విజ్ఞానము పొడమదు. ఆలోచింపఁగా నీరెండును ఒకదానికొకటి సాధనములు. సత్కర్మములు జాతులఁబట్టి

---

* భాగవతము.

నాలుగు విధములయ్యెను. కులధర్మము తప్పక బ్రహ్మోపాసకులైనవారు మోక్ష మందుదురు. బ్రహ్మ మనఁగా భక్తరక్షాపరాయణుఁ డగు నారాయణుఁడు. ఆతఁడు యజ్ఞాదివైదిక క్రియలకు సులభుఁడు."

ఆమాటలు విని "మహాత్మా! యజ్ఞాదికృత్యములు ధనసామగ్రి లేక నడపలేము. ధన మున్నను లోభమున సంసారులా కార్యము లొనరింపరు. కావున, అల్పప్రయాసమాత్రమున సకలవర్ణములవారికి మోక్షము కలుగునుపాయముఁ దెల్పు" మని యాశిబరుఁడు దుర్వాసుని గోరెను. అందుల కాతఁడు మహోత్తమఫలప్రదము లగు వ్రతముల నెన్నిటినో తెలిపి యవి యాచరించినచో నిహపరసౌఖ్యములు కలుగు నని యుపదేశించి యాతని నాశీర్వదించి వెడలిపోయెను. అవి యొనర్చి సత్యతపుఁడు తరించెను.*

## దుర్వాసుఁడు ముద్గలున కతిథియగుట

తొల్లి ముద్గలమహర్షి యుంఛవృత్తి నవలంబించి మహోత్తమతప మొనరించుచుండఁగా నాతని చిత్తశుద్ధిఁ బరీక్షించి యాతనికి మహోపకృతిఁ గావింపఁ దలఁచి దుర్వాసుఁ డాతని యింటి కతిథిగా నేఁగెను. పక్షోపవాసములు చేయు ముద్గలుఁడు సకుటుంబముగా నాతనిని గౌరవించి తాము తినుట మాని యామునివరుని కన్నము పెట్టి గౌరవించెను. దుర్వాసుఁ డంత యన్నముఁ దిని మిగిలినదాని నొంటెనిండఁ బాముకొని పోవువాఁడు. ఇట్లెన్నిమారులు వచ్చి చేసినను ముద్గలుఁడు కొంచెమైనఁ గోపింపక యామహర్షికి మహాసేవ చేసెను.

* వరాహపురాణము.

తుదకు దుర్వాసుఁడు ముద్గలుని మిక్కిలి స్తుతించి యాతనికి సశరీరస్వర్గసుఖము సమకూర వర మొసంగి పోయెను. కాని, ముద్గలుఁడు స్వర్గమును దృణీకరించి బ్రహ్మర్షియై మోక్షమందెను.*

## దుర్వాసోమహర్షి కుంతీదేవికి వర మొసఁగుట

దుర్వాసోమహర్షి యొకసారి కుంతిభోజునియింటి కేఁగ నాతఁ డత్యంతభక్తి పూర్వకముగా నాతనికి సపర్య లొనర్పఁ గన్య యగు తనకొమార్తెఁ గుంతిని నియమించెను. కుంతియు నేమఱిపాటు లేక దుర్వాసునిహృదయము కరఁగునట్లాతనికిఁ బరిచర్య లొనర్చెను. దుర్వాసుఁడు కుంతిభోజు నాశీర్వదించి కుంతీదేవికి వర మనుగ్రహింతుఁ గోరుకొను మనఁగా నామె తన కొకమంత్ర ముపదేశింపు మనియు నామంత్రశక్తిచే నే దేవు నుపాసించిన నాదేవునివలనఁ దన కొక పుత్త్రుఁడు గలుగవలె ననియుఁ గోరుకొనెను. దుర్వాసుఁ డట్లే యని యామె కొక మంత్ర ముపదేశించి వెడలిపోయెను. ఈమంత్రప్రభావముననే కుంతికి సూర్యుఁడు ప్రత్యక్షమై కర్ణుఁ నొసఁగెను.†

## దుర్వాసుఁడు యోగమాయను వివాహమగుట

దుర్వాసోమహర్షి యొకనాఁడు పదునాఱువేలగోపికలను, అష్టమహిషీమణులను వివాహమైనశ్రీకృష్ణునిఁ జూడ మనసు గలిగి ద్వారకకుఁ బయనమై పోయెను. ద్వారకానగరము నా మహర్షి సమీపించుసరికి శ్రీకృష్ణుఁ డుగ్రసేన వసుదేవాదులతో నాతని కెదురువచ్చి యర్ఘ్యపాద్యాదుల నొసంగి సభక్తికముగా

---

* భారతము. అరణ్యపర్వము.

† భారతము. ఆదిపర్వము.

నాతనిఁ దనయింటికిఁ దోడ్కొని పోయెను. అచ్చట నవయౌ వనయై హావభావవిలాసములతో నతిసుందరాంగియైన యోగ మాయ నాతని సేవకు శ్రీకృష్ణుఁడు నియోగించెను. దుర్వాసుఁ డామె పరిచర్యలకు మెచ్చి వరము కోరుకొను మనెను. శ్రీకృ ష్ణుఁ డంత నుగ్రసేనాదులఁ బిలిచి దుర్వాసోమహర్షి శివునంశ మునను యోగమాయ పార్వతియంశమునను జనించినవా రగుట నుభయులు వివాహమగుట తనయభీప్సిత మని వాక్రు చ్చెను. దుర్వాసుఁ డంగీకరించెను. అంత దివ్యవైభవోపేత ముగా యోగమాయా దుర్వాసులకు వివాహ మైనంతనే శ్రీకృష్ణుఁడు వినయవినమితుఁడై యామహర్షిని గొంతకాలము తననగరముననే యుండఁ బ్రార్థించెను. దుర్వాసుఁ డట్లే యని భార్యతో నటనే నివసించుచుండెను.

ఒకనాఁడు దుర్వాసుఁడు శ్రీకృష్ణునిమాహాత్మ్య మెఱుం గఁగోరి రాత్రివేళ వరుసగా అష్టమహిషులగృహములకుఁ బదు నాఱువేలగోపికలయిండ్లకు వెళ్లి చూచెను. ఆతని కన్నిచోట్లను శ్రీకృష్ణుఁడు భార్యాసహితుఁడై కానవచ్చెను. ఇది చూచి దుర్వాసుఁ డాశ్చర్యమంది యాతని ననేకవిధముల స్తుతించి యానందించెను.*

**దుర్వాసునికిఁ బార్వతి శ్రీకృష్ణునిగుఱించి తెల్పుట**

ఇట్లు ద్వారకానగరమున యథేచ్ఛముగా విహరించుచు దుర్వాసోమహర్షి భూతలమునఁ గాలము వ్యర్థపుచ్చుట కంటెఁ గైలాసమున కేఁగి పార్వతీపరమేశ్వరుల పాదసేవచేయు టే పరమకర్తవ్య మని యెంచి భార్యతోఁ గాని శ్రీకృష్ణునితోఁ

* భాగవతము. బ్రహ్మవైవర్తపురాణము.

గాని చెప్పకయే కైలాసమున కేఁగి పార్వతీపరమేశ్వరుల పాదములపై వ్రాలెను. శివుఁ డాతనిఁ గౌఁగిలించుకొని యాశీర్వదించెను. పార్వతియు దీవించి విశేషము లడిగెను. దుర్వాసుఁడు "అమ్మా! భూలోకజీవనమునఁ బ్రాణము విసిగినది. ఇఁక మీ కడనే యుండి మీపవిత్రపాదారవిందముల భక్తితోఁ గొల్చుచునుండ నిశ్చయించుకొని వచ్చితి"ననెను. శివుఁ డానందించిపార్వతి వదనారవిందముఁ దిలకించెను. పార్వతి "పుత్త్రా! నీవు మాకడ నుండిపోవుట మాకానందప్రదమే. కాని, నాయంశమునఁ బుట్టినయోగమాయను వివాహమైతివికదా! ఆమె నచట విడిచి వచ్చితివి. ఆమె యందుల కెంతయు ఖిన్నయై నీకై పలవించుచున్నది. అగ్నిసాక్షిగ వివాహమైన భార్య నకారణముగా నట్లు విడువఁ దగునా? ఆమె మహాపతివ్రత. ఆమెవలన నీకు సత్సంతానము కలుగును. మఱియు, శ్రీకృష్ణుఁడు మానవమాత్రుఁడు గాఁడు. గోలోకవాసి యగు పరబ్రహ్మమే యాతఁడు. ఆయనపాదపద్మములు గొల్చుట మా సేవచేయుట కన్నఁ గోటిమడుంగు లధికము. కావున, నీ వట కేఁగి వలయునపుడు వచ్చిపోవుచుండు" మని బోధించెను. దుర్వాసుఁ డామెమాట లాలించి యాజగన్మాతాపితలకు వందనము లొనర్చి తిరిగి ద్వారకకుఁబోయి సుఖముండెను.*

## దుర్వాసుఁడు శ్రీకృష్ణుని యాదవులను శపించుట

దుర్వాసోమహర్షి యొకనాఁడు కృష్ణునిఁ బరీక్షింపనేఁగ సత్యభామగృహమున నున్న శ్రీకృష్ణుఁడు సత్యాసహి

* శివపురాణము

తుఁడై దుర్వాసు నెంతయుఁ బూజించెను. దుర్వాసుఁ డాతని శాంత మరయుటకై యొకరథ మెక్కి దానికి సత్యామాధవుల రథ్యములఁ గమ్మనెను. వా రుభయులు వెంటనే యా మహర్షి యాజ్ఞ శిరసావహించి యాతఁ డెంత బాధించినను విసువకుండిరి. అది చూచి యాతఁ డాశ్చర్యపడి వారికి వరము లొసఁగి వెడలిపోయెను.

మఱియొకపర్యాయము దుర్వాసుఁడు చీరవసనుఁడు, బిల్వఖండుఁడు, దీర్ఘశ్మశ్రుఁడు, కృశశరీరుఁడునై రుక్మిణీ సహితుఁడైన శ్రీకృష్ణునికడ కేఁగి యాతిథ్యము కోరెను. శ్రీకృష్ణుఁ డధికభక్తి నాతనికి నమస్కరించి యుచితశయ్యావాసముల నేర్పఱిచి షడ్రసోపేతముగ విందు చేయుచుండెను. ఆతఁ డొకనాఁడు బహుసహస్రసంఖ్యాకులు తినఁగలుగుపదార్ధముల భుజించును. మఱియొకనాఁడు స్వల్పముగనే కైకొనువాఁడు, ఒకప్పు డుపవాసమే చేయుచుండెను. ఇట్లుండి యొకదినమున దుర్వాసుఁడు నిజశయ్యాస్తరణములను హర్మ్యములను భస్మపటల మొనర్చి రుక్మిణీకృష్ణులకడ కరుదెంచి తనకు వెంటనే పాయసము వండి "పెట్టవలయు" నని కోరెను. అట్లే యని రుక్మిణి సిద్ధము చేసెను. ఆపాయసమును దుర్వాసుఁడు రుక్మిణిదేహమునకుఁ బూసెను. శ్రీకృష్ణుఁ డతిశాంతముతో నుండెను. తుదకు దుర్వాసుఁ డాపాయసమును దనకుఁ బూయు మనెను. శ్రీకృష్ణుఁ డాతని దేహ మెల్లెడలఁ బూసి యాతనిపాదములకుఁ బూయ మఱచెను. దుర్వాసుఁ డంత సమయము దొరకిన దని యఱకా

ళ్ళకుఁ బూయనికారణమున నఱకాళ్ళనుండియే కృష్ణునకుఁ బ్రాణభయము కల్గు నని వచించెను.

పిమ్మట దుర్వాసుఁడు రుక్మిణీకృష్ణుల క్షమావిశేషమును బ్రశంసించి శ్రీకృష్ణుఁడు పరమశుభములు చేకొని సర్వలోకప్రియుఁ డగుటకును రుక్మిణీదేవి జరాజాడ్య వివర్జితయై యుత్తమపతివ్రతాతిలక మగుటకును వరములిచ్చి తత్క్షణమే యంతర్ధాన మందెను. †

భూభారము తగ్గించుటకు యాదవవంశవినాశన మెట్లొనర్చుట యని శ్రీకృష్ణుఁ డొకపరిఁ దలపోయుచు దుర్వాసోమహర్షిని స్మరించెను. త్రికాలజ్ఞుఁ డగుదుర్వాసుఁ డీది యెఱిఁగి ద్వారకకు వచ్చి వాకిట నుండ, దైవకృతమున యాదవకుమారులు సాంబుఁ డనువానికి స్త్రీవేషము వేసి దుర్వాసునకు మ్రొక్కించి "సంయమీంద్రా! ఈమెకుఁ బుత్త్రిఁ డెప్పుడు గల్గు" నని పరిహసించిరి. దుర్వాసుఁ డది గ్రహించి శ్రీకృష్ణుని సంకల్ప మీడేలుఁ గదా యని "మూర్ఖులారా! ఈమెకు లోహరూపముసల ముదయించి సపుత్త్రబాంధవముగా యాదవవంశము నిర్మూలించును. బ్రహ్మాదులు నిది తప్పింపలే" రని శపించి కృతకృత్యుఁడై యరిగెను. దాననే యాదవు లెల్ల రంతరించిరి.*

---

† ఇది విష్ణుపురాణమున, భాగవతమునందుఁ గలదు. కృష్ణునిఁజూడవచ్చుచున్న కణ్వ నారద విశ్వామిత్రులు యాదవులను శపించినట్లు భాగవతము మౌసలపర్వమునఁ గలదు. యమునాతటమునఁ దపముచేయు కణ్వమహర్షికడకు స్త్రీవేషము వేసి సాంబుని దీసికొనిపోయి యేబిడ్డ పుట్టు నని యడుగ, గణ్వుఁడే శపించె నని పద్మపురాణమునఁ గలదు.

## దుర్వాసుఁడు పాండవుల కతిథి యగుట.

ఒకమాఱు దుర్యోధనుఁడు పాండవుల నవమానింప గోరి దుర్వాసునిఁ బ్రసన్నునిఁ జేసికొని యాతనిని సశిష్యుఁడై పాండవులకడ కేఁగు మని ప్రార్థించెను. దుర్వాసుఁ డట్లే యని శిష్యసమేతుఁడై ద్వైతవనమునఁ గలపాండవులకడఁ కేఁగ ధర్మరాజాదు లమితభక్తిశ్రద్ధలతో నాతని సేవించిరి. దుర్వాసుఁడును సశిష్యుఁడై భోజనమునకు వత్తు ననెను. ధర్మరా జంగీకరింప నాతఁడు శిష్యులతో నదీస్నానమున కేఁగెను. ద్రౌపదీప్రార్థన నింతలో శ్రీకృష్ణుఁడు పాండవులఁ జూడ వచ్చి క్షుధాభరము నటించి ద్రౌపదిచే భోజన పాత్రముఁ దెప్పించి దానికంఠమున లగ్న మగు నొకమెతు కుని దిని పాండవుల కభయ మిచ్చెను. శ్రీకృష్ణప్రభావమున స్నాతు లగుదుర్వాసునకు శిష్యులకు నాఁకలిదప్పులు లేకుండఁ బోయెను. దుర్వాసుఁడు సమస్తవిషయమును యోగదృష్టి నెఱింగి దుర్యోధనుని కుటిలాభిప్రాయము గ్రహించి యాతఁడు బంధుమిత్రాదులతోఁ బాండవులచే నోడిపోయి మడియనుండుటఁ గని శిష్యులతో వెడలిపోయెను. *

## దుర్వాసుఁడు లక్ష్మణుని మరణమునకుఁ గారకుఁడగుట

దుర్వాసస్సంయమీంద్రుఁ డొకప్పు డతిక్షుధాతు రుఁడై శ్రీరామునిచే నాతిథ్య మందునుద్దేశముతో నయో ధ్యకు వచ్చెను. ఆసమయమున శ్రీరాముఁడు బ్రాహ్మణ రూపుఁ డగుయమునితో రహస్యముగ మాటలాడుచు నెవ్వ రిని లోనికి రానీయవల దనియుఁ దాను రానల దనియు

* భారతము.

లక్ష్మణుని నియమించెను. కాని, దుర్వాసుఁడు వచ్చి లోనికిఁ బోఁబోఁగా లక్ష్మణుఁడు నివారింప నాతఁడు వంశనాశనముగా శపింతు ననెను. లక్ష్మణుఁడు భయపడి శ్రీరాముని కడకేఁగి విన్నవించెను. శ్రీరాముఁడు తనయాజ్ఞ దాఁటిన లక్ష్మణుని నగరము వెడలనడప నాతఁ డన్నయనుమతిఁ గొని సరయూనదిఁ గ్రుంకి యవతారమును జాలించెను. ఇట్లు దుర్వాసుఁ డిందులకుఁ గారకుఁ డయ్యెను. *

దుర్వాసుని యాధిక్యము

పరమేశ్వరాంశసంభూతుఁ డగు దుర్వాసోమహర్షి యనేకులగు శిష్యప్రశిష్యులఁ జేరఁదీసి వారికెల్లరకు విమల విద్యారహస్యముల నామూలాగ్రముగా నెఱింగించెను త్రిలోక పూజ్యుఁడై లోకక్షేమంకరుఁ డైనయనసూయాగర్భశుక్తి ముక్తాఫలము సత్రితపస్సారము నగుదుర్వాసోమహర్షి మహాస్థలలో సప్రతిమానుఁడు.

తుదిమాట

"కోమలపల్లవనిభవా
సోమునిఁ బరిపీతవసనసోముని సువవా
సోమునిఁ బోలిన దుర్వా
సోమునిఁ నుతియింపఁ దరమె సోమున్కైనన్."

[దశావతారచరిత్ర. 3 అ, ౬]

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీకృష్ణార్పణమస్తు.

---

* ఉత్తరరామాయణము.